శ్రీ సిరంగు సత్తిరాజ దంపతులు.



శ్రీ సత్తిరాజ జమీందారుగారు
జననము 13-11-1877.



కీర్తిశేషురాలగు శ్రీమతి
రంగనాయకమ్మగారు.

# శ్రీ సిరంగు సత్తిరాజుగారి వంశవృక్షము.






# ఉపోద్ఘాతము.

మదాలసావిలాస మనునీప్రబంధమునకుఁ బరిచయవాక్యములు వ్రాయుభాగ్యము నాకుఁ గలిగినందులకు నెంతయు గర్వించుచున్నాను. ఈకావ్యము ధర్మవీరరసప్రధాన మగు మహాపతివ్రతాసౌశీల్యమునకును, నేకపత్నీవ్రతమహోన్నతికిని నాకరము. కృతిరచయిత, కవితాభూషణుఁడు, విద్వత్కవిశేఖరుఁడు. కృతిపతియో ధర్మపత్నీనిబద్ధచిత్తుఁడు, ఉదారుఁడు, జమీందారు. అఖండలక్ష్మీవిరాజితుఁడు, ఉత్తమచరిత్రుఁడు, అనిగ్రంథముచూచినయెల్లరకు స్పష్ట మగును. దానినే నే నించుక విపులీకరింతును.

ఇందలికథ మార్కండేయపురాణాంతర్గతము దానిని గ్రంథకర్త ధర్మప్రతిపాదకముగా రసమునకు లోపము రానటు ప్రాఁతపద్ధతిలో నూతనపద్ధతిని నడపెను. ఈకథనే యెత్తుకొని ప్రాచీనుఁ డగు ననగము నారాయణభూపతి "కువలయాశ్వచరిత్రము" అనుపేర శృంగారరసప్రధానముగా రచియించి యుండెను. మూలమున లేని జయంత నలకూబరులకు రంభాతారలమూలమునఁ బెద్ద కలహముగూడఁ జేర్చి శృంగారము నెంతయుఁ బెంచెను. ఈగ్రంథకర్త యాంధ్రీకృత మార్కండేయపురాణమున విడువఁబడియో సంగ్రహముగాఁ జెప్పఁబడియో యున్న ధర్మములను సాధ్యమైనంత దనుకఁ బెంచి ధర్మప్రధాన మనిపించెను. అట్లు పోషించుట యీకావ్యమునకే కాక ప్రకృతమునకు నెంతయు నుచితముగా నున్నది. సాధ్వీ

శిరోరత్న మనం దగిన కీ. శే. శ్రీ సిరంగు రంగనాయికాంబ
స్మారకముగా నీకావ్యము వెలువడినది. ఉదారుఁడును ధర్మ
లోలుఁ డగు శ్రీ సత్తిరాజ జమీందారు వాంఛకు ఫలముగదా
యీకృతి; అట్టియెడ నీకావ్యమున శృంగారముకంటె ధర్మ
వీరమే ప్రతిపాదింపఁబడి పరిపుష్టి మొనర్పఁబడుటకంటె నౌచి
త్యము వేఱుండఁ బోదనుకొందును. కావ్యమువలన యశస్సు,
పురుషార్థచతుష్టము, లోకవ్యవహారవిచక్షణత్వము, మంగళాపా
దనము సద్యస్కాలనిరతిశయానందము కలుగుట యెఱిఁగినవాఁ
డును బహుపురాణ నిరంతరశ్రవణము గలవాఁడును గావుననే
శ్రీ సత్తిరాజ మహాశయుఁడు యీకావ్యకర్తను సగౌరవముగఁ
బిలిచి సత్కరించి "మార్కండేయపురాణ మెల్ల బుధసమ్యగ్బో
ధనఁ విం టి, నాలకాంబాపద మహా మదాలస కథాలాపంబు
తాపాంధకారార్క ద్యోతమునై పుమర్థఫలదంబై యుండుఁదో
చెఁ" అని పలుకఁ గలిగెను. దాని ననుసరించియే కృతికర్త
యౌచిత్యము కొంచెమేయు దాఁటకుండ శృంగారరస మంగ
ముగాఁ జేసి అవారితసత్కవికల్పనా విభూషావహపూర్వాప్రాప్త
ములు సానలఁ దీఱినజాతిరత్నముల్" అనుసూక్తి లక్ష్యముగా
నిడుకొని పఠితల కుత్కంఠ దీపించునట్లు వలయుచోట్ల మార్పు
చేయుచుఁ బ్రధానకథకుఁ జేరికగాఁ గావ్య మంతయు ధర్మవీర
రసమున నడిపెను. మదాలసాకువలయాశ్వుల ప్రథమసందర్శన
ఘట్టమున మాటాడక మేడలోనికిఁ బోవుచుండల వెంబడినే కువ
లయాశ్వుఁడు దానును మేడలోనికిఁ బోవ మూర్ఛిత యైన
మదాలస కనఁబడుటయు, నిట్లేల మూర్ఛిల్లె నని యాతఁ డడుగ
నిన్నుఁ జూచి మోహించి, కామధేనువరమువలని ప్రాతికూల్య

ము దలంచి మూర్ఛిల్లె నని కుండల చెప్పుటయు స్థాయిభావము నకు దార్ఢ్యము స్ఫుటముగా లేదని అచట, ముందు పరస్పరము చూచుకొనుట, తరువాత నొండొరులఁ జేపట్టుటకై కలఁతనొం దుట, తగుమాత్రము మాటపలుకఁ బెంచి యౌచిత్యము నడల కుండ స్థూణానిఖననన్యాయమున స్థాయిభావమును దృఢ పఱచి పిదప మూలానుసారము రచింపఁబడిన విశేష మరయఁ దగినది. ఇట్టిఘట్టములు పెక్కుస్థలములను గలవు వాని నన్నిటి నెత్తి చూపఁ దొడఁగిన గ్రంథవిస్తర మగు నని యాభారము చదువరులకే విడిచి యీగ్రంథకర్తను గూర్చి కొంచెము ముచ్చటింతును. కవిసామర్థ్యము ననుసరించియే కదా కావ్యము యొక్క గుణాగుణము లుండుట? అట్లని యీవిద్వత్కవిశేఖ రుని బరీక్షించి చెప్పుచుంటి ననుకొనకుఁడు. పరీక్షించి, యానం దించిన పెద్దలహృదయము మనకుఁ బ్రమాణముగాకపోదు. కావున సంతకు మున్ను వీరు రచించిన 'మునిత్రయ చరిత్రము నకుఁ బీఠికవ్రాయుచు ఆంధ్రవిశ్వవిద్యాలయాంధ్రాధ్యాపకులు ను, సంస్కృతాంధ్ర భాషావిద్వాంసులు నుప్రసిద్ధవిమర్శకులు, నగు విద్వాన్ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు వ్రాసిన వాక్యము లిందుఁ బొందుపఱుతును. దానఁ గవినిగూర్చి వ్రాయుభారము నాపయి నంతగానుండదు.

“వీరి కవితాస్రవంతి యతినిర్మలమై మనోజ్ఞముగ జాలు వాఱుచుండును. గొగ్గిపద్య మొక్కటియుఁ గానరాదు. రచన యంతయుఁ బ్రసాదగుణభరితము. ఆవాసము కోనసీమ. ఆమీఁద వ్యాకరణపాండిత్యము. అయినను వీరికవిత నారికేళపాకమునకు దూర మైనది. మధురాతిమధుర మగు కోమలపాకము నాశ్రి

యించినది. 'నైవ వ్యాకరణజ్ఞ మేవ పితర'మ్మనుకొనుచుందుమే. నిత్యమును టక్కుటుక్కులతోను, ఢుక్కుతుక్కులతోను దంటాలుపడుచుండు నీమనీషికి నింతగా ముద్దులొల్కు పద్దెము లల్లు పాటవ మెటు లబ్బినదాయని నాలో నే నబ్బురపడుచుందును. ఇట్టివే వాసనావిశేషములు పుణ్యావాసన లూరక పోవు టెట్లు? ............నాయెఱుక కందినంతలో ననితరసాధారణ మనఁ దగినవిశేష మొకటి యీవిద్వత్కవికిఁ గలదు. శాబ్దికముగఁ గాని యార్థికముగఁ గాని యేదే నొకజిజ్ఞాసాప్రసంగము కలిగి నపుడు ప్రస్తుతసందేహనివారకముగాఁ బ్రాచీనకవితల్లజులమత మెట్టిదో యనుప్రశ్న ముదయించుటయే తడవుగా నెన్నిటినో ప్రామాణికప్రయోగములను గుప్పతిప్పలుగా వీరు ప్రదర్శించుచుందురు. ఈశక్తి యద్భుతావహము. ప్రాచీనకృతులను సూక్ష్మమార్గమునఁ బరిశీలించుటయు, నం దెట్టి విశేష మగపడినను నద్దానిని సరసముగా గ్రహించుటయు, గ్రహించిన దానిని ధారణ సేయుటయు, నట్టిది సమయమునకు స్ఫురించుటయు నొకేబుద్ధి కలవడుట యరుదు. కవితావిషయములం దెట్టిచర్చ యేర్పడినను నద్దానికి సాధకముగనో బాధకముగనో ప్రాచీన మతనిరూపక మగు ప్రయోగపరంపర వీరిబుద్ధికి స్ఫురించి తీఱ వలసినదే. ఒక్కొక్క మేధ యొక్కొక్క విషయమున నిశితమై యుండుట ప్రకృతిలక్షణము" అని శ్రీ వేంకటరమణశాస్త్రిగారు వ్రాసిన ప్రత్యక్షరము సత్య మనియు విద్వత్కవిగారితోఁ బరిచయము గల మాదృశులకుఁ దటుక్కున స్ఫురించును గావున నా భాగము విడువఁజాలక, యిందుఁ బొందుపఱిచితిని. దానితోఁ గృతికర్త యొక్క శక్తిసామర్థ్యములు పరిస్ఫుటములైనవి గదా!

మఱియు ఈభాగమునే వీరు రచించిన శంకరవిజయమునకుఁ బీఠిక వ్రాయుచుఁ దర్క-వేదాంతశాస్త్రసాగరులును, జగద్విఖ్యాతపండితులునగు బ్ర. శ్రీ బులుసు అప్పన్నశాస్త్రులవారును నుదాహరించి యుండుటచే మఱింత ధైర్యముగఁ జూపినాఁడను. అంతియకాదు. శంకరవిజయకృతిసమర్పణసభయందుయాంధ్రదేశపండిత, కవి లోకసమ్మతిని, బ్రికృతమున చెన్నపురి దొరతనమువారి యాస్థానకవులును, భారత, రామాయణ, భాగవతా ద్యనేకగ్రంథరచయితలును, కవిసార్వభౌమబిరుద మర్థవంత మొనర్చుకొనిన అభినవవ్యా సేత్యాద్యనేక బిరుదభూషితులగు మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిచే "విద్వత్కవి శేఖర" అను బిరుదము సంపుటమొక్కటియేకాక, యిరువదిసంవత్సరములకుఁ బూర్వమే మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గారికి, (వ్యాకరణశాస్త్రమున వీరికిఁ బరమగురువులు) మునిత్రయచరిత్రము కృతియిచ్చు సందర్భమున శ్రీ జగద్గురు కళ్యానంద భారతీమాంతాచార్యపరమహంసావతంసులవలన "కవితాభూషణ" బిరుదము నొందినవారగుటంజేసి యీవిద్వత్కవిని గూర్చి మాదృశులు వ్రాయుట సాహసమగును. కావున నది యటుండనిచ్చి ప్రికృతకావ్యమున వారు చూపిన ప్రతిభావిశేషమును గూర్చిముచ్చటించుకొందము.

అష్టాదశవర్ణనములు కావ్యమున నుండవలె నను నియమము వీరు పాటించినట్లు కానఁబడదు. అట్లని యావర్ణనలేవియును లే వని కాదు. సందర్భోచితముగా నాయాచోట్ల నావశ్యకము లైనవి విడువలేదు. ప్రికృతమునకుఁ గానివి స్వీక

రింపలేదు. కథ కుంటువడ కుండఁ బ్రికృతకథకుఁ జేయవగా నా వర్ణనము లుండవలసినదే కాని బలవంతముగాఁ జొనిపిన ట్లెచ్చ టను దోఁపదు. 3 వ ఆశ్వాసములో అశ్వతరుఁడు శివుని జేసిన స్తుతి యతిమాత్రమువలెఁ గనఁబడును. కాని యభూతపూర్వ మగు వరమునొందవలె నన్న నెంత శ్రమపడవలెనో దానిఁ దెలుప వర్ణితమై యుండును. సంగీతశాస్త్రకర్త యగు నశ్వ తరుఁ డెట్లు వర్ణించునో దాని కనుగుణముగ క. "నిగమాగమ ధని పాపా పగమాగమ! నిధానిపామాగధసామగ గరిమధారి ధామా పదాప!" యని చూపిన సంగీతసాహిత్యముల శ్లేషము వీరి ప్రతిభకు నికషము. ప్రికృతమునకు మిక్కిలి యుచితము. సరస్వతీస్తవమున మూలానుసారము స్తుతియు శివునివరము వేడి నప్పుడు నడపిన వాకోవాక్యములయందలి యుపజ్ఞయుఁ బరికించి యానందింప వలసినదే కాని తెలుప నసాధ్య మనిపిం చును. ఆఘట్టమున శివుని భక్తపరతంత్రత కనులకుఁ గట్టిన ట్లు న్నది. ఆయశ్వతరుని యుక్తివాద మపూర్వ మనక తప్పదు. మఱియును ప్రథమ సందర్శనమున మదాలస సిగ్గుచేఁ దెరచాటై యుండఁ గుండల తమ యభీష్టము ప్రికారము దా వలచినవాఁ డే భర్త యగుచుండెఁగదా! యని యుత్సాహంగాఁ దెర యెత్తిన ప్పు డెటు వోవ నవకాశము లేని మదాలసచేష్టల వర్ణించిన భాగమున గ్రంథకర్త భావనామహిమము వాచాతీతము !

చ. అరయు ముఖంబు వంచియు కటాక్షనిరీక్షలఁ జల్లఁగామనో
హరు నొకవంక, నొక్కదరి హాస్య మొనర్చు వయస్య
యాస్యముౕ

జాఱచుఱఁ జూచు, మాటువడఁ జూచు మృగాక్షి, దరిద్రిఁ
బడ్డ వా

శ్చర్యమటు మిట్టిమిట్టిపడుచంచలదృక్కుల నెల్లదిక్కులన్.

వ. ఆసమయమున నెదుట నున్న నాయకునిస్థితిమాత్రము

చ. కదలనిచూపులం దొకవికారపురాగము రేఁగి, యాఁగి నె
మ్మది నెవి యేని జిత్రముల మాటికి సృష్టి యొనర్పఁగా రసా
స్పద మయి లోక మంతయు నవంబుగఁ దోఁచె విలాసినీ
శుభా
స్పద మగు రూపమున్ గనినపాటున రాజకుమారమూర్తికిన్

1—ఆ. పు 184

చూపులు కదలక తదేకలక్ష్యముగ నున్నవఁట గాని ఒకవికార ముతోఁ గూడిన వలపు విజృంభించి, మనస్సున నాఁగి పోయి, యం దనేకము లగు చిత్రరువులను సృజించుచుండెనఁట జగమం తయు రసభరితమై క్రొత్తగాఁ దోఁచెనఁట ఆహా! యేమి యీ భావన; అనురాగ మంకురావస్థయం దెట్లుండునో ఆస్థితి భావించి బహుసూక్ష్మముగ నిట్లు నిరూపించుట సామాన్యమైన విషయ ము గాదుగదా! ఈపద్యమున గంభీరముగ నాంతరంగిక సౌం దర్యవిలాసము చూసి తరువాత

ఉ. నవ్వుచుఁ జూచుకాంతరదనంబుల మల్లెలఁ జల్లఁ జల్లునన్,
జివ్వున నొక్కవడ్డ నునుఁజెక్కులు క్రొత్తగులాబిపువ్వులన్
రువ్వఁగ విప్పు వాతెనకనుంగవ యుత్పలపంక్తిఁ జిమ్మ, న
వ్వువ్విలుకాని ముద్దినుసు ములుకులు గాఁడెఁ గుమారునా
త్మలోన్

నాయకుని యనురాగవికారము రవంత పైకిఁ బ్రస్ఫురింప నాయికముఖమున లేనగ వంకురించినదట దానితో మదనుడు బాణములతో నాయకుని హృదయము చీల్చిన ట్లైనదఁట? కచకుచాద్య వయవవర్ణనములవలన శృంగారము దెలుపుటకును భావవిశేషవర్ణనమునఁ బ్రస్ఫుటీకరించుటకుఁ గల తారతమ్యము రసజ్ఞులకుఁ దెలియని యంశము కాదు.

ఇట్టి నవీనరచనావిశేషము మదాలసకై కువలయాశ్వుఁడు తనలోఁ దాను బొగిలినఘట్టమునను, మదాలసను బాతాళమున నశ్వతరుఁడు చూపిన ఘట్టమునను బఠితల హృదయముల నాకాశగంగాతరంగముల నూఁగాడించి విడుచుననుట అతిశయోక్తి గానేరదు. వీరికవితయందు వర్ణనబాహుళ్యముకంటెఁ గథాచమత్కృతి హెచ్చు. గథ మార్పులు చేసి పఠితలకు ముందేమి వచ్చునో యను తహతహ గలుగునట్లు రచన సాగించుట యందు వీ రందె వేసినచేయి. ఈవిషయము మునిత్రియచరిత్రమున స్పష్టము. దానికంటె నిందు మఱియు నాఘశక్తి యతిశయించిన దని పాఠకులు గ్రహింపక మానరు. ఇకావ్యమందలి పాత్రములనన్నిటిని బరిపూర్ణత నొందింపఁగల పాటవము గలవారగుటం జేసియేకదా! మార్కండేయ పురాణమున (సంస్కృతాంధ్రముల రెంటను) మదాలసను గపటిమై చంపిన తాళకేతు ప్రసంగము మ ఱెక్కడను లేదు. వాఁడు జీవించియేఁ యున్న నూరకుండువాఁడు గాఁడు. అదియునుగాక తనప్రాణప్రదమైన మదాలస మరణింపఁ దాను జీవించియుండియు వైరశుద్ధికై యత్నింపకుండుట నాయకునకును నపకర్షాపాదకమగుననియు, నాగరాజకుమారుల మైత్రీలక్షణమున ననుగుణ

మగు లక్ష్య మగు ననియుఁ దాళకేతువధకథ స్వకపోలకల్పిత మైన, నట్లుగా నీరీతిఁ బ్రధానకథలో నదికి పాత్రముల కన్నిటికి నౌచిత్యము చక్కఁగాఁ బరిపుష్టమై కార్యమున కంతయుఁ దీప్తి గలుగఁదీర్చి దిద్దినారు. ఇట్లేయీావత్కథయు నికావ్యమున నేకాకార మగు రసభావముల పుష్టితో సహజమధుర మైన శైలితో నిష్టుమగు పదరచనతోఁ గవితాలాస్యరంగ మైనదని నేను చెప్ప నక్కఱలేక యే సహృదయులగు కవిపండితులు మెచ్చుకొనక మాన రని నావిశ్వాసము.

ఇట్టి యుత్తమకావ్యసృష్టికిఁ బ్రథమమున సంకల్పించిన శ్రీ సిరంగు సత్తిరాజు జమీందారుగారి గుణగణములు కొంచె ముద్ఘాటింపక కలము దింపివేయుటకు మనసొప్పకున్నది. ఆయనను గూర్చి యవతారికయందును నాశ్వాసాద్యంతలయందును గవిశేఖరులచేఁ బేర్కొనఁబడిన ప్రత్యక్షరమును వాస్తవము కాని, స్తవము గా దనియు నింకను గొన్ని సుగుణములు కొఱవడిన వేమో యనిపించు ననియుఁ బ్రాజ్ఞులు దెలిసికొందురు గాక. ఆయన ఆగర్భశ్రీమంతుఁడు ఆజన్మపవిత్రచరిత్రుడు, ఆబాల్యవివేకనిధి తనపూర్వు లెవ్వరికి లభింపని ప్రొప్రయిటరీ, జమీందారీలతోపాటు శ్రీకారముద్రచే నతిశయముగన్న మహాభాగ్యశాలి ఇంత యైశ్వర్యము గల్గియు గర్వము గాని కపటము గాని యసత్యముగాని, నిర్దయతగాని వంచన గాని కలలోఁగూడ నెఱుఁగనిసుమతి. అది యటుండ సువర్ణాక్షరములతో లిఖించికొనవలసినది యాయన పరస్త్రీ సోదరత్వము, రెండవది దీనజన రక్షాదీక్ష ఈసుగుణము లానక లైశ్వర్యములకుఁ గారణమో! ఆసక లైశ్వర్యములను సిద్ధింపఁజేసిన మహాదృష్టమే యట్టి లోకో

త్తర సుగుణములకుఁ గారణమో? తెల్పజాలముగాని యీ రెండు నేకమైననే సత్తిరాజ మహాశయుని రూపమగును. ఈయంశము శ్రీశాస్త్రిగారిచే నవతారిక 110 పద్యమునఁ బేర్కొనఁబడినది. ఇన్ని సుగుణములు గల్గిన, యీ యుత్తమున కీనాఁడే కవితాభిలాషము కలుగుటకు హేతు వరయగ

చ. శమనిధి సత్తిరాజనరసత్తము నుత్తమజీవిత ప్రబంధమునకు ముఖ్యనాయిక యనఁ దనరారిన రంగనాయకాప్రమద.

(అవతారిక. 112) కథావశేష యగుట ప్రధానకారణము. ఆమె పేరు భూమిపై శాశ్వతముగా నెలకొల్పఁ జేయుచున్న మహాకార్యములలో నొకటి యీకృతిస్వీకారము. శ్రీ రంగనాయికాంబపేర భీమనపల్లిలో సమస్త పదార్థపూర్ణగృహనిర్మాణ మొనర్చి స్థాపించిన హైస్కూలు మఱి యొకటి. ఇంకను నామెపేర మహిళావైద్యాలయము స్థాపింపఁ దలం పున్నదఁట. అది యైనచో నది యొకటి. ఇంత గాఢానురాగము గల భర్తను బిడ్డలను, సకలసంపదను విడిచి యకాలమృతికి గుఱియైన శ్రీ రంగనాయకమ్మ యాత్మశాంతి కింతకంటె మార్గము లేవి గల వని సహజౌదార్యము, దైవాస్తిక్యము గల మహావ్యక్తి గావున నిట్టియుత్తమకావ్య నిర్మాణమున కాదికారణమైన తనవంశమును గీర్తిశేషురా లగు శ్రీమతి రంగనాయికాంబను దన్నును యశస్స్థిరచిత్రములుగాఁ జిత్రింపఁ జేయుఁ విద్వత్కవిశేఖర శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారికి మాన్యము నొసంగి బహుమాన్యులగుటయేగాక, గ్రంథ ప్రకటనార్థము ధనమెంత వ్యయమగునని లెక్కింపక యొసఁగి శీఘ్రకాలమున

ముద్రింపఁజేసిన త్యాగశాలియగు శ్రీ సత్తిరాజ జమీందారుగా రభివందనీయులు.

ఈయన నలువురు పుత్రులు జనకుని యడుగులజాడ నడువ నేర్చినవా రగుటయే కాక 'పుత్రా దిచ్ఛే త్పరాజయ' మ్మనుసూక్తి కనుగుణముగ విద్యావంతు లగుటచేత దండ్రిని మించినవా రొక రిద్ద రైనారు? తక్కినవారును గాఁగలరు! అగుటలో ఆశ్చర్య మే మున్నది? అట్టి యాదర్శదంపతుల గర్భమున జనించిన వా రంతకంటె నన్నివిధముల నుత్తములు కాకుండుట యెట్లు? వారి నలువురకుఁ బరమేశ్వరుఁడు పరిపూర్ణాయు రైశ్వర్యము లొసంగి తండ్రిగా రొనరించిన ధర్మసంస్థలను బరిపాలించుటయే కాక తామును ధర్మకార్యనిర్వహణమునకుఁ బూనికొని శాశ్వతప్రతిష్ఠగాంతురుగాక యని యాశించుచు నింతతో విరమించుచున్నాను. శ్రీ రంగనాయికమ యాత్మకు శాంతి చేకూరుఁగాక. శ్రీ సత్తిరాజ జమీందారుగారింకను నట్టి యపూర్వకావ్యనిర్మాణమున కాధారభూతులై కవులకుఁ గల్పవృక్షమై యాంధ్రసరస్వతి నలంకరింతురుగాక! భగవంతుఁడు శ్రీ భాస్కర దేవుఁ డఖండాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించి ప్రోచుఁగాకయని ఆశించుచున్నాను.

ఇట్లు

గాడిలంక, 10-6-52. } బుధజనవిధేయుఁడు కేసాప్రగడ వీరరాజు.



# నివేదనము.

శ్రీ సత్తిరాజు జమీందారుగారు 'ధర్మస్యత్వరితాగతి' యనుసూక్తి నెఱిఁగిన వివేకధనులు గావున నీకావ్యరచనలో నన్ను వేగిరపెట్టుట యొంతయు నుపకారకమైనది. లేకున్న నింత స్వల్ప కాలములోఁ బరతంత్రుఁడ నగునాకీరచన మసాధ్యమగునేమో! వారి సంకల్పబలమునను శ్రీ రంగనాయికానామ మహిమమునను, గావ్యరచనమే కాక ద్రవ్యమునకు లెక్కలేని వారిత్యాగచేత నల్పకాలమున ముద్రణముకూడఁ బూర్తియైనది. "కృతార్థుఁడనైతినని మాత్ర మనుకొనుటకు జడియుచున్నాను. 'ఆపరితోషాద్విదుషా' మ్మనుసూక్తికి లక్ష్యమైననాఁడుగదా! కృతార్థత? కావున నెందైనఁ గొఱంతలు గనఁబడినఁ బ్రేమరసైకహృదయులగు సహృదయులు నాకాదరపూర్వకముగాఁ దెలిపినచో భావిముద్రణమున సవరించుకొందునని విన్నవించుకొనుచున్నాను. ఈగ్రంథమునకుపోద్ఘాతము వ్రాసిపంపిన శ్రీ కేసాప్రగడ వీరరాజు కవిగారి కాశీర్వాదపూర్వకముగా నాకృతజ్ఞతఁ దెలుపుచు, నత్యల్పకాలమున గ్రంథమునంతయుఁ దమజార్జిప్రెస్ నందుఁ జక్కగ ముద్రింపించి యొసఁగిన పరమసాధుస్వభావులగు శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారికి నా ధన్యవాదము లర్పించుచున్నాను.

ఇట్లు,

అమలాపురం,
ది 14-6-52.

గ్రంథకర్త:
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

# మదాలసావిలాసము.



## కథాసంగ్రహము.



### ప్రథమాశ్వాసము.

భూలోకమున రత్నపుర మని యొకపురము గలదు. ఆ పట్టనమును రాజధానిగా నేర్పఱచుకొని 'శత్రుజిత్తు' అనుపేరు గలయొకానొక రాజు పరిపాలించుచుండెను. ఆతఁ డభిమానవంతుఁడు, శూరుఁడు, ధీరుఁడు, ఉదారుఁడు అంతియ కాదు. విద్వాంసుఁడై యనేక యజ్ఞములు చేసి దేవతలను దనిపి వారి దయవలనఁ గలిగినవర్షాదికములచే భూమి యంతయు సర్వసస్యాఢ్యముగా నొనర్చి ప్రజల యనురాగమును చూఱగొన్నవాఁడు. ఆతనిపేరు విన్నమాత్రమున శత్రుభార్యలకు గర్భపాతము గలుగు నంతటి మహాప్రతాపశాలి. ఆతని నెదిరించి బ్రదికినప్రాణి యేదియు లేదు. అట్లనిశరణము గోరి యుపకారము పొందిన నరమాత్రుఁడు లేఁడు.

ఆమహారాజచంద్రుని పూర్వపుణ్యవశంబున చక్కని రూపము గలిగి దాతయు, ననాథరక్షకుఁడు నగునొకపుత్రుఁడు పుట్టెను. ఆతనిపేరు ఋతధ్వజుఁడు. ఆతఁడు శత్రుసంహారమున వెనుదీయనివాఁడు సకలవిద్యాపారంగతుఁడు వినయాదిసమస్తసద్గుణములు సహజముగఁ గలవాఁడు. బుద్ధియందు బృహస్పతి

సముఁడు. రూపమున నశ్వినీకుమారులవంటివాఁడు. విక్రమమున దేవేంద్రుని మించినవాఁడు. వేదములందుఁ జతురాననుఁడు. శాస్త్రములందు షడాననుఁడు. (కుమారస్వామి) త్యాగమునఁ గల్పవృక్షము. కాని యారాజకుమారుఁడు రాజ్యముతోడను సంబంధులతోడను సంబంధము లేక పట్టణమునకు వెలుపల నుండునొకసుందర మగుపూలతోఁటలో నొకకొలనియొడ్డున నున్నయొకబంగరుమేడయందు మిత్రబృందముతో వినోదములఁ బొద్దు పుచ్చుచుండు. ఒకనాఁడు రతనపుబంతులయాట ఒకనాఁడు జూదము. ఒకనాఁడు వేదార్థవిచారము; ఒకనాఁడు శాస్త్రములందు వాదప్రతివాదములు. ఒకనాఁడు గుఱ్ఱము నెక్కి స్వారిచేయుట. ఒకనాఁడు రథగజాదివాహనముల నెక్కి విహారము. ఒకనాఁడు చిత్రలేఖనము. ఒకనాఁడు పుష్పమాల్య రచనాదిశిల్పవిశేషములు గలుగఁ దనయీడుమిత్రులతో వినోదించుచుండును.

ఇట్లుండఁ గొంతకాలమునకు 'అశ్వతరుఁ' డనుపేరినాగ రాజు కొడుకు లిద్దఱు బ్రాహ్మణకుమారరూపము లొంది భూలోకమున విహరింప వచ్చి యాఋతధ్వజుని సకలవిద్యాపాండిత్యమును దెలిసికొని యాతనిమిత్రులలోఁ దాము గూడి యాతనితోఁ గ్రీడించుచుండ యువకులును, సుందరాకారులును, బ్రాహ్మణకుమారరూపులు నగునాసర్పరాజపుత్రులం గాంచి యారాకుమారుఁడు తనచెలికాండ్రుగాఁ బరిగ్రహించి ఆహార మజ్జన విహారాదుల నాదరింపఁ జొచ్చెను. ఆదరించుమాత్రమే కాదు. వారిపాండిత్యము, వారికుశాగ్రబుద్ధి, వారివాక్చమ

శక్త్రృతి, వారిసకలకళానైపుణ్యము, వారిస్వరమాధుర్యము, నెటేఁగి యయ్యిరువురను విడనాడి యుండఁజాలకుండెను. నాగకుమారులును విప్రవేషమునఁ బగ లంతయు నాబుుతధ్వజునితో విద్యావినోదములఁ బొద్దుపుచ్చి రాత్రి యగుసరికి తమజన్మస్థాన మగుపాతాళలోకమునకుఁ బోవుచుందురు.

అట్లు వా రింటికి వచ్చుట, భుజించుట, నిద్రించుట, మరల భూలోకమునకువచ్చుట యెవ్వ రెఱుంగ కుండిరి. ఆ సంగతి విని తండ్రి యగుయశ్వతరుఁ డొకనాఁటిరాత్రి కొడుకులం బిలిచి కోపముతో బిడ్డలార! మిమ్ము మనలోకమున నెన్నఁడు చూచి యుండ లేదు. చదువు మాని యెక్కడకుఁ బోవుచున్నారు? విద్యార్జనమున కుచిత మగు లేఁతవయస్సు వినోదములతోఁ గడపివైచిన నెట్లు విద్య లబ్బును? అని పలికి విద్యార్జనమునఁ గల క్లేశమును, దానివలని ప్రయోజనములను విపులముగా దెలియఁజెప్పి, మీరు నిత్యము నెవ్వరిస్నేహమునకు వశులై చదువు మానుకొని విహరించుచున్నారో తెలుపుఁ డనుటయుఁ దండ్రి యలుకకు భయపడి యిట్లు చెప్పం బూనిరి. నాయనా! విద్యావిహారార్థమై మే మిరువురము నొకప్పుడు భూలోకమున కేఁగి యెన్నియో పట్టణముల నరసికొనుచు రత్నపుర మనునొక వీటికి వచ్చితిమి. వచ్చి చూతుముగదా! ఆకోటలు, ఆకందకములు, ఆరాజవీధులు, ఆవిపణివీధులు, కులక్రమాగతధర్మపాలకు లగుప్రజలు, మా కద్భుతముకలిగించిరి. లక్ష్మీసరస్వతులందుఁ దాండవించుచుండుట నిక్కువ మనిపించినది. అందు శత్రుజిత్తనురాజు గలఁడు. ఆతఁడు సార్థకనాముఁడై శత్రు

వనుపేరైనను లేకుండఁ జేసి వారిధనాదికములు కొల్లలాడి తెచ్చి దక్షిణలుగా సమర్పించి యనేకయాగము లొనర్చినవాఁడు. ఆతనిరాజనీతి నిరుపమము. మంత్రులు రాజలక్షణముగాఁ దోడ నుందురే కాని స్వతంత్రి మగునాలోచనము గలవాఁడు. అట్లు వేదధర్మానుసారము రాజ్యపాలన చేయుచుండ నతనికి కొంత కాలమున కొకకొడుకు పుట్టెను. ఆకుమారుఁడు బాల్యముననే వేదవేదాంగాది సర్వవిద్యలను నేర్చి, కళల నన్నియు గ్రహించెను. శౌర్యధైర్య,గాంభీర్యౌదార్యాదిసకలసద్గుణంబుల కాతఁ డాధారయష్టి. దయాసత్యశౌచార్జవాదు లాతని సొమ్ములు. ఆతనితో మాకు మైత్రి కలిగినది. ఆతనిచెంత నెంతసే పుండినను దనివి కలుగదు. పగలు రాత్రి విభాగమే తెలియదు. రాత్రులు మనరసాతలము నరకమువలె నుండును. ఏమన ఆతనిని విడిచి యుండుటయె కారణము. ఆతఁడు చెప్పునుపచార వాక్యములకు మామనస్సులు తద్వశములై పోవును. అని చెప్ప-నశ్వతరుఁ డంతకు మున్ను మనస్సునఁ గలుగుకోప మంతయు బోవుటయే కాక యమిత మగుసంతోషమును గౌతుకమును గలుఁగఁగాఁ గొడుకులం గవుఁగిలించుకొని 'నాయనలార ! మీరు ధన్యులు. అట్టిలోకోత్తరసుగుణవంతుఁ డగునారాజకుమారుసౌజన్యము చూఁజగొన్న మిమ్ములను గడుపునఁ గనుటచే నేను ధన్యుఁడను. దీని కేమి ! యాసుజనాగ్రణిని గన్నవా రెంతధన్యులో గదా! మీవంటిసుగుణులు పరోక్షమున నేపుణ్యాత్ముకొడుకును గొనియాడుదురో, యాయుత్తముఁ డగుసుతుఁడే కదా ధన్యుఁడు. శాస్త్రజ్ఞతయు సుశీలము నెవరికిఁ గలుగునో యాతఁడు ధన్యుఁడు మాత్రిమే కాదు. ధన్యతముఁ డనఁబడును.

ఎవనిస్నేహమును మిత్రులును; బలసంపదను, శత్రువులును మెచ్చుకొందురో యట్టిపుత్రునిచే నాతనితండ్రి పుత్రవంతుఁడై గణుతి కెక్కును గదా. అది యట్లుండ నిండు. ఇంతకాలముగా నాతనిమైత్రికై నిత్యము నేఁగి పెక్కుపకారము లాతని వలనఁ బొందుచు మీ రాతని కేదేని ప్రత్యుపకారము చేసి యున్నారా? ఏల యనః-నర్థులఁ దృప్తిపఱచుటకును మిత్రుని కోర్కె తెలిసికొని నెఱవేర్చుటకును సంశయింపనివానిదే యుత్తమ జీవితము. వానిపుట్టుకయే సార్థకము. సంతత ముపకార మొనరించుమిత్రునకుఁ బ్రత్యుపకారము చేయనిపాపాత్ముఁడు జీవన్మృతుఁ డనఁగా నట్టిమిత్రున కపకారము దలఁపోయుమహా దుర్మతి నే మనవలయును? మిత్రుల కుపకారమును, శత్రుల కపకారమును దెలిసికొని చేయుసజ్జనుని యభ్యుదయమును బ్రాజ్ఞు లందఱు గోరుకొనుచుందురు." అని పలుకుటయుఁ గొడుకులు తండ్రి కిట్లనిరి. తండ్రీ ! ఆతనికి మే మేమి యుపకృతి చేయుదుము? అతఁ డన్నివిధములఁ గృతకృత్యుఁడు. ఎవ రేది యడిగినను వారి కది పూర్ణముగా నిచ్చి తృప్తిపఱుపక పంపఁడు. ఆతనిగృహమందుఁ గలసంపదలు మనలోకమందే కాదు. ఏ లోకమందును లేవనిన నతిశయోక్తి గాదు. ఇఁక విద్యావిషయమం దన్ననో యతనికిఁ గలనిష్కళంకజ్ఞాన మేపండితులయందును గనఁబడదు. అట్టివారి కేవేని సందేహములు కలిగెనేని వానిం దీర్చి పంపఁ గలజ్ఞానశాలి. కాని యాతని కొకదుర్లభమైనకోర్కె గలదు. దానిని హరి, హర, బ్రహ్మలం దెవ్వరేని దీర్పఁగలరేమో కాని యింక నెవ్వరును దానిని దీర్ప శక్తులు

కారు సుమా' అనిరి. అది విని నాగరాజు "అయిన నాకోర్కి యేదియో తెలుపుఁడు. శ్రద్ధాబుద్ధులు గలవాని కసాధ్య మని యొకటి యుండునా? మనుష్యులు దేవత్వము, దేవేంద్రత్వము దేవపూజ్యత్వమును బొంది యుండరా ? దృఢదీక్ష గలవాని కీలోకమునను బరలోకములను సర్వవాంఛలు నెఱవేఱితీరును. చీమ యైనను మెల్లగాఁ బ్రాఁకుచున్న యెడఁ వేయియామడఁ బోఁగలదు. కదలఁడేని గరుత్మంతుఁ డైన నచ్చటనే యుండును కావున దృఢోద్యముల కసాధ్య ముండఁబోదు. భూమి ఎక్కడ? ఆకాశ మెక్కడ? ధ్రువుఁడు భూమియందుండి ఆకాశమున సకలజ్యోతిర్మండలముపైకిఁబోయి స్థిరముగా వెలుఁగుచుండుట లేదా? కావున నరున కసాధ్య మేదియు నుండఁబోదు. అయి నను ఆతఁడు కోరు నాయసాధ్యపుఁగార్య మేదియో వివరింపుఁ డన నన్నాగేంద్రునకుఁ దనయు లిట్లు చెప్పిరి.

దేవా ! రత్నపురాధీశ్వరుఁడు శత్రుజి త్తనియు నతని కొడుకు కువలయాశ్వుఁ డనియుఁ జెప్పి యుంటిమి గదా! మహా ప్రతాపశాలియు, యాయజూకాగ్రణియు నైనయాశత్రుజిత్తు ధర్మప్రధానముగా రాజ్య మేలుచున్నకాలమున నొకపు డా మహారాజదర్శనార్థము గాలవమహర్షి యద్భుతాకారలక్షణ మగునొకగుఱ్ఱమును వెంటఁ బెట్టుకొని వచ్చెను. రా జాతని నర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి మహానుభావా ! ఏలవచ్చితిరి? ఈగుఱ్ఱ మెక్కడిది" అని యడుగ నమ్ముని దనవృత్తాంతమును గుఱ్ఱమువృత్తాంతమును జెప్ప నారంభించెను.

మహారాజా ! పాతాళకేతుఁ డనునొకఘోరరాక్ష

సుఁడు వరాహరూపమున వచ్చి మునుల నందఱను నిత్యమును బాధించుచున్నాఁడు. వానిబాదల కోర్వలేక నేను దపంబు చేసి కొనుచున్న గౌతమీతీరస్థ మగునడవియం దుండుమును లందఱు తమతమయాశ్రమములు విడిచి యన్ని దెసలకుఁ బాఱిరి. నే నప్పటి కొకయాగదీక్షయం దుండుటచే నెటు వోవ నవకాశము లేక యందే యుండ, వాఁడు తాపసవేషధారియై వచ్చి నా శిష్యులను నన్నును గలవఱపెట్ట, దిక్కు లేక వానిని జంపు నుపాయము దోఁపక సూర్యునివంకఁ దదేకదృష్టిగాఁ గన్నీ ళొలుకఁ జూచుచు దీర్ఘనిశ్వాస మొకటి ఆకాశమువంక విడిచి తిని. తోడనే యీదివ్యాశ్వ మాకాశమునుండి నాయగ్రభూమి కవతరించినది. తెల్లఁబోయి నేను జూచుచుండ 'మునివర్యా! ఈయశ్వమును సూర్యుఁడు నీకడ కంపినాఁడు. దీనిపేరు కువల యము. ఇయ్యది భూవలయము నంతయు నొక్కగడెకాల ములోఁ జుట్టివచ్చును. కాన దీనిపేరు సార్థక మైనదే. ఆకాశ మున, భూమియందు, నదులయందు, నదములయందు, సము ద్రములయందుఁ, గొండలయందు మాత్రమే కాదు. సర్వ దిక్కులయందు నడ్డు లేకుండ సంచరింపఁ గలపాటవ మీతురగ మునకుఁ గలదు. దీనిచే నీదుఃఖము తొలఁగును. శత్రుజిన్మహా రాజుపుత్రుఁ డగుఋతధ్వజుఁ డనువానికి దీని నిచ్చినచో దీని నెక్కి వచ్చి యాతఁడు నిన్ను బాధించునాపాతాళకేతుని జం పును. దుఃఖింపకుము. నాఁటినుండి యాతనికిఁ గువలయాశ్వుఁ డని పేరు గూడఁ గలుగును. అని యాకాశవాణి యొకటి విన వచ్చినది. తోడనే ధైర్యము వహించి సూర్యునికి నమస్కరించి యీగుఱ్ఱమును గూడఁ బూజించి, దీనిం గొంచు వెంటనే మీ

పురంబునకు బయలు దేఱితిని. రాజా! యీయశ్వము నే మని వర్ణింపఁగలను? నామనమునఁ గలయభిప్రాయము గ్రహించి నది కాఁబోలును! ముందు తాను ను వెనుక నేనును గా సూటిగా నీపురమునకు నన్నుఁ దెచ్చినది. మాట లొక్కటిమాత్రమే కొదువ గాని సర్వము నెఱిఁగినది సుమా! యిది దీనిని నీకొడుకున కిచ్చి నావెంటఁ బంపుము. ఆతనికి శుభములు చేకూఱును. అని తనకథ నంతయుఁ జెప్పెను. తోడనే రాజేంద్రుఁడు గురుకులవాసియై విద్యాభ్యాస మొనర్చుచున్నకొడుకగుఋతధ్వజుని దెప్పించి గాలవునివాంఛితమును హయవృత్తాంతమును జెప్పి మునిజనరక్షణమును రాక్షసశిక్షణమును జేసి రమ్మని యాశీర్వదించి యంపఁగా నాఋతధ్వజుఁడును జనకాజ్ఞను దురగము నెక్కి మునితో వనమున కేఁగి ఋషుల కభయ మిచ్చి వారియాశ్రమముల నెల్లఁ గాపాడుచుండెను. గాలవుఁ డొనర్చనయీకృత్యము కర్ణాకర్ణికగా విని పాతాళకేతుఁడు వరాహరూపమున వచ్చి యయ్యరణ్యమంతయుఁ గగ్గోలుసేయఁ జొచ్చెను. అది యెఱిఁగి మునిశిష్యు లావార్త ఋతధ్వజున కెఱిఁగింపఁ దత్క్షణమే సాయుధుఁడై కువలయాశ్వము నెక్కి పంది నెదుర్కొని యర్ధచంద్రబాణమును వరాహము త్రొమ్మున నాఁటుకొన విడిచెను. వెంటనే వరాహ మాబాణముతోడనే యడవిం బడి మెట్ట లనక, గుట్ట లనక, నదు లనక, వాగు లనక యొకచే పరుగునఁ బాఱుజొచ్చుటయు రాజపుత్రుఁడును విడువక యతివేగముతో వెంబడి నేఁగుచుండెను. అంత నావరాహము బహుయోజనములు పరుగెత్తి యెత్తి

యొక్కచో భూమిరంధ్రమునఁ దటాలున దిగఁబడెను. బుత్యశ్వ జాడను గుఱ్ఱము తో నావివరమునఁ గూలఁబడెను.

అంధకారబంధురం బగునాసొరంగమున పంది కనఁబడ లేదు. దారి తెలియుటలేదు. కువలయాశ్వుఁడు కొంచెము కల వరపడిముందటికిఁ బోవఁబోవ వెలుగుకానరా ధైర్యము వహించి యెదుటఁ గానవచ్చు ననుపమశిల్పాభిరామ మగునొక మహా పట్టనములోఁ బ్రవేశించెను. కాని యది నిర్జనముగా నుండుటచే నదియేదియో తెలియక, క్లేశపడుచు, దూరమున మనఃఖేదముచే వివర్ణయై యేఁగు నొక స్త్రీని గాంచి క్షణములో నామెయొద్ద కరిగి యింతీ! నీవెవ్వతవు? ఈపట్టన మెవ్వరిది? ఇట్లు నిర్జనముగా నున్నయీవీటఁ నీవు భయము లేక యొంటిగ నె ట్లుంటివి ? అని యెన్నియో ప్రశ్నములు వైచుచు వెంట నరుగుచున్నను, ఆమె యొక్క ప్రశ్నమునకు బదులు సెప్పక వెనుదిరిగి యైనఁ జూడక బిఱబిఱ పోయి యొక రమణీయ మైనబంగరుమేడ లోపలఁ జొచ్చెను. రాజపుత్రుఁడు ప్రాకారద్వారమునొద్ద నశ్వము దిగి లోని కరుగవచ్చునో లేదో యని కొంచెము సం దేహించి యొకటి రెండు కక్ష్య లతిక్రమించి సాహసింప లేక నాల్గవకక్ష్యయందుఁ గల వృక్షవాటిక నిలిచి, తలయెత్తి మేడ వంకఁ గనుఁగొన దొలకరిమెఱుపువంటి యొకయువతి గనఁ బడెను. ఆయతివచూపులలో నేదియో భావమున్నట్లు గ్రహిం చి యాతఁడు కలఁగుచుండెను. ఆమగువయుఁ గొంచెము సేపు చూచి తటుక్కున గవాక్షమునొద్ద కేఁగి తనవంకఁ జూచుట యరసి తనయం దాసుందరికి వలపు గలదో లేదోయని యతఁడు

తత్తఱపడుచుండెను. తన యూహ తప్పేమో యని సంశయించెను. చెలియ గవాక్షమునొద్దను గనఁబడకుండెను.

ఆసమయమునఁ దొలుతఁ దనతో మాటాడక పోయిన యాకాంత వేగముగా వచ్చి "యార్యా! యీమేడయందున్న మానవయస్య కారణ మేమియు లేకయే మూర్ఛ పోయినది. ఏదియే నుపాయముచే నామెమూర్ఛ తొలఁగించి రక్షింపుమని కోరుచు, అవ్వల మావృత్తాంతము దెలుపుదును. ముందు రమ్మని తోడ్కొని చని శయ్యపై మూర్ఛిల్లి యున్న నెలఁతం జూపింప రాకుమారుండు చెంగటి కేఁగి "కాంతా! భయపడకుము. కన్ను విచ్చి నన్నుఁ జూడు" మని పలుకరింప, నమ్మగువ కన్ను దెఱచి చూచి సిగ్గున శయ్య డిగ్గి దెరచాటున కరిగె. అంత మొదటియంగన నిట్టూర్పు విడిచి నారాజపుత్రునితో "అయ్యా! నీవెవ్వరవో మాకుఁ దెలియదు" ఈపురము పాతాళకేతునిది. ఇం దితరు లెవ్వరు నడుగిడఁ జాలరు. ఈకన్యక విశ్వావసుఁడను గంధర్వరాజు కొమార్తె. ఈమె పేరు మదాలస. ఈమె పరిపూర్ణ యౌవనయై చెలికత్తెలతో నుద్యానంబున విహరించుచుండ నారాక్షసాధముఁడు చూచి వంచించి యెత్తుకొని వచ్చి యీమేడయం దుంచినాడు. నేఁటిరాత్రి పెండ్లాడుదు ననియున్నాఁడు. ఈవార్త నిన్ననే విని యీయమ సౌధాగ్రమునుండి క్రిందఁబడి మరణింప యత్నించుచున్నతఱి కామధేనువు ప్రత్యక్షమై "అమ్మా! నీవు చావపలదు. ఈరక్కసి నీకెన్నఁడును భర్త కాఁడు. ఈపాతాళకేతుఁడు భూలోకమునకుఁ బోవ నెవ్వఁడు వీనిని బాణమునం గొట్టునో వాఁడు నీభర్త

యగును. ఆశుభదిన మెప్పు డందువేమో యది రేపేసుమా ! యని యూరార్చి యెందేని జనియెను. ఈమె చావ మానినది. ఇఁక నాచరిత్రము గూడ వినుము. నాపేరు కుండల. వింధ్య పంతుని పుత్రికను. నాభర్త వింధ్యవంతుఁడు శుంభుఁడను రాక్షసునితో యుద్ధముచేయుచు మరణించెను. ఆయనఘునకుఁ బుణ్యలోకములకై సర్వతీర్థములు తిరుగుచుందును. ఈయమ నాకు నెచ్చెలి యగుటచే ననుదినమును దివ్యగమనమునఁ దీర్థములన్నియుఁ దిరిగి యిటకు వచ్చుచుందును. ఈదినమున నట్లే వచ్చుచుండ "పంది యై పాతాళకేతుఁడు మునులను జంప రాఁగా నొక మహావీరుఁడు బాణమునఁ గొట్టె"నని యొక యడవి యందు విని యాశుభవార్త నీమెకుఁ దెలుప వేవేగ వచ్చుచుండ నీ వేదియో యడుగఁగా మాఱు పలుకక వచ్చి మేడఁ జొచ్చి, యందీమెకై సలువలం కరయఁ గానరాక పోవుటచేఁ దత్తఱపడి, యటు నిటు చూచుచుండ గవాక్షమునొద్దఁ దదేక దృష్టిగా నిన్నుఁ జూచుచున్న యీ కాంతను జూచి సమీపించి, పలుకరింప నెట్టకేలకు నావంకఁ జూచి, అక్కా! అదిగో నాయెలమావి నీడ నిలిచియున్న యాసుందరమూర్తిం జూచితివా ? ఆతనియెడ నామనస్సు లగ్నమైనది. ఇంతటి మోహనాకారు విడిచి కామధేను వరప్రకారము రక్కసుని జంపిన శూరునకు భార్యనై యెట్లు కాఁపురము చేయుదు? నని తన పూర్వచరిత్ర మంతయుఁ దలంచుకొని దుఃఖము పట్టఁజాలక మూర్ఛిల్ల నా కుపాయము తోఁపక నీకై పరువెత్తి వచ్చితిని. దేవునివలె నీవు వచ్చి మహాపదనుండి మమ్ము బ్రదికించితివి. నీవృత్తాంతమును

గూడఁ దెలిపి మమ్ముఁ గృతార్థులఁ జేయుదువే యన రాకు మారుఁడు వరాహరూపుఁ డైన పాతాళకేతుని దాను బాణము నఁగొట్టుటయుఁ దన నివాస, వంశ, నామధేయంబులును జెప్పఁ గామధేను వరానుసారము తన ప్రేమించిన యతఁడే భర్త యయెనని మదాలస సంతోషపారవశ్యము నొందెను. కుండ లయు దైవఘటనమున కరుదెంచు నిరువురను బ్రియమునఁ బలికి యప్పుడ వివాహము గావింప నిశ్చయించి విశ్వావసుని పురోహితుం డగుతుంబురుని స్మరణమాత్రమున రావించి యథావిధిగ నాయనఘునిచే వారి నిరువురను గృహస్థులఁ జేయించెను. తుంబురుండు తపోవనమున కరిగిన యనంతరము కుండలయుఁ గువలయాశ్వునకును మదాలసకును గృహస్థధర్మ ములు చెప్పి తనభర్తం గలియుకోర్కె తత్క్షణంబ తీర్థయాత్రల కుం జనెను.

---

## ద్వితీయాశ్వాసము.

అనంతరము ఋతధ్వజుండు మదాలసను గువలయాశ్వం బుపైఁ గూర్చుండఁ బెట్టుకొని బయలుదేఱుట రక్కసులు కొం దఱు చూచి పాతాళకేతుని కెఱిఁగింప సేనల నెదుర్కొనఁ బంపెను. వా రుదాయుధులై మార్కొనిన కొంతసేపటికిఁ బాతాళకేతుండును నిలు, నిలు మని కేకలు వేయుచుఁ బ్రతి ఘటించెను. అపుడు రాజపుత్రుఁడు శస్త్రాస్త్రముల సేనలను జించి చెండాడి పాతాళకేతునిపైఁ ద్వాష్ట్రాస్త్రము ప్రయో

గించి సపరివారంబుగాఁ భస్మము గావించి జయలక్ష్మిం గైకొని మదాలసతో సశ్వారూఢుఁడై భూవివరంబుననుండి మహీతలం బునకు వచ్చి గాలవుని దర్శించి యాయనయాశీస్సు లంది, రత్న పురంబు చేరి తలిదండ్రులకుఁ బౌరులకును జరిగినవృత్తాంత మం తయు నెఱింగించి సుఖం బుండెను.

మదాలసాసమేతుఁడై ఋతుధ్వజుండు వివిధభోగంబులం దేలుచుఁ గొంతకాలము గడపినయనంతర మొకనాఁడు శత్రుజి న్మహారాజాతనిని బిలిచి నాయనా! ధర్మప్రతిష్ఠకై రాజైనవాఁడు మునుల రక్షించుకొనవలెఁగదా! సూర్యదత్తం బైనకువలయా శ్వము నెక్కి ప్రతిదినము మునులయాశ్రమములు పీడారహితము లుగా నున్నవో లేవో పరిశీలించుచు వలయునేని వారికి సాయ పడుచుండుము. అని యాజ్ఞాపింప నట్లే వేకువ నేఁగి భూవలయ మంతయుఁ దిరిగి మధ్యాహ్నమునకు నావాసమునకు చేరు చుండును. అట్లు కొంతకాల మరుగ నొకనాఁడు భూవలయ మంతయుఁ దిరిగి తిరిగి పిపాసితుఁడై యమునానదికి వచ్చి జల పాన మొనర్చి తత్తీరమునం దొకమునియాశ్రమ మగపడ నచ్చెరు వొందుచు నిత్యము నీయమునానదీతీరమునకు వచ్చుచుఁ బోవుచుందును. ఎన్నఁడు నీతాపసాశ్రమము గోచరింపదు. ఎంత ప్రమాదము! ఇందలిమునుల యోగక్షేమము లిన్నాళ్లు నరయ నైతినే? యనుకొనుచు నామునిజనాశ్రమము సొచ్చి యరయ, నం దొకముని యాగదీక్షితుఁడై కనఁబడెను. తోడనే భక్తి నాతనికి వందన మొనర్ప; నారాకుమారునకు మునియర్ఘ్య పాద్యమ్ము లిచ్చి కుశాసనసమాసీనుం జేసి, కన్నులు మూసి

క్షణకాలంబు ధ్యానించి "వత్సా! శత్రుజిత్పుత్రుఁడవా? ఆరాజునకు సేమమా? మునిజనరక్షకై ప్రతిదినము భూవలయ మంతయుఁ దిరిగి వచ్చుచుంటివా? అని ప్రశ్నించి నీవంటివాని కిల్లాలు గావలసినమదాలసను గ్రూరుఁ డగుపాతాళకేతుఁడు వివాహమాడ యత్నించి యే మనుభవించెను? నీచే బూడిద యైనాఁడు గాని వానిపాపము వానినే కొట్టినది. అని యాతని వెనుకటివృత్తాంత మంతయు జూచినట్లు చెప్పి యింతటిమహాను భావుని నిన్నాళ్లు చూచి సేవింప కుండుట యెంత తప్పని రాచ పట్టి యనుకొనుచుండ 'వత్సా! మాపాపమునఁ బాతాళకేతు తమ్ముఁ డగుతాళకేతుని జంపక విడిచితివి గదా! ఆదుష్టుఁ డొన ర్చువిప్లవమునకు భయపడి యీవనమున రహస్యముగా నీ యజ్ఞము చేసికొనుచుంటిని." వాఁడు ముమ్మాఱు విఘ్నము గావించెను. దానం జేసియే యిచటికి వచ్చి యదరుగుండెతో యాగము పూర్తిచేసికొనుచున్నాను. వాఁ డెక్కడ వచ్చి పైఁ బడునో యని నిన్నరాత్రి కన్నుమూయ లేదు. నాదైవమే నిన్ను దెచ్చెను. ఈయొక్కదినము కాచితివా నాసంకల్పము పూర్తి యగును. ఆక్రూరునియలజడిచే యజ్ఞదక్షిణ సంపాదించుకొన మఱచితిని. దక్షిణ లేని యజ్ఞము నిష్ఫలము గదా! నీమెడ యందలి హార మిచ్చితో నది దక్షిణగా యాగము సమాప్తి చేసికొందు ననుటయుఁ గువలయాశ్వుండు "నీయాగమునకు రాక్షసబాధ రాకుండఁ గాపాడెదను. దక్షిణగా నిదిగోకొనుము" అని మెడ నున్నరత్నహారము నీయఁగా నమ్మౌని యు సంతసిం చుచు 'వత్సా! పరిజాక్షేమమునకై యీయమునాప్రవాహం బున మునింగి వారుణము లగు వేదమంత్రములచే వరుణుని

స్తుతించి వచ్చెదను. అంతదాఁక రాక్షసబాధ లేకుండ నాయా
శ్రమమును రక్షించుచుండు'మని యాతనియనుమతి నొంది యా
రత్నహారముతో నదీప్రవాహమునఁ జొచ్చెను. కువలయాశ్వుం
డశ్వము నెక్కి యాశ్రమమును జాగరూకుఁడై కాపాడుచుండెను.
రాక్షసుని జాడ యెచ్చటను లేమికి విసిగెను. గడియలో వచ్చెద
నన్నఋషి రాలే దని యతఁడు కలఁగుచుండెను. పొద్దు పడ
మటికి వాలెను. ప్రతిదినము తా నింటి కేఁగుసమయము
దాఁటుచున్న దని తన్నుఁ గోరి బాధపడుచున్న దని తల్లిదండ్రులును
భార్యయు నిరీక్షించుచుందు రని తలంచుచుండెను. అంతలో
నదినుండి ముని తటాలున బయటికి వచ్చి "నాపని యంతయు
నెఱవేఱెను. నీ వరుగు" మనుటయే తడవుగా నాతనియొద్ద
సెలవు గైకొని రాజపుత్రుఁడు గుఱ్ఱము నెక్కి సూర్యాస్త
మయము కాకుండ నచ్చట బయలుదేరి చీఁకటిపడునప్ప
టికిఁ బట్టనము చేరుకొని నిశ్శబ్దముగా నిర్జనముగా నున్నకారణ
ము దెలియక తహతహ పడుచు వెళ్లుచుండఁగా - నాతని
నాశ్చర్యచకితచిత్తములఁ జూచి ప్రజలు పరుగిడసాగిరి. క్రమ
ముగా నరుగుచున్నయాతనికి రాజును మంత్రులును బరివారము
నెదురై 'యెటు బ్రతికితి' వని యడుగఁ జొచ్చుటయు నాతఁ
డాందోళనమందుచు ని ట్లడుగుదు రేమి యనుకొనుచుండఁగా
మంత్రు లయ్యందఱును గోటలోనికిఁ గొంపోయి కూర్చుండఁ
బెట్టిరి "ఒకరిమాట లొకరి కర్థము గా కున్నవి. తరువాత నీ
వెఱిఁగినది చెప్పవచ్చును. ఇచటివృత్తాంత మాలకింపు" మని
వృద్ధమంత్రి యి ట్లనెను. రాజనందనా! నీ వట్లు యథాప్రకా
రము దివసారంభమున భూవలయయాత్ర కరిగితివి గదా!

మధ్యాహ్న మగునప్పటి కొకముని యొకచేత నీకంఠమాలఁ
బూని ఆొమ్ము కొట్టుకొనుచు సూటిగాఁ గోటకు వచ్చి హా
రాజపుత్రా! యని యేడ్చుచుఁ బ్రభువు కొలువున నుండఁగా
నందుఁ జొచ్చి 'రాక్షసునిచేత మరణించితివా' యని విలపింపఁ
జొచ్చెను. రా జాతని సమీపించి 'నాకొడు కే మయ్యెనో'
చెప్పు మన నాముని కొంచెము స్వస్థపడి 'రాజా! ఏమి చెప్పు
దును? నీకొడుకు నాయాశ్రమమునకు నేఁడు వచ్చెను. నాయాగ
మునకు ఘాతుకుఁ డైనపాతాళకేతునితో యుద్ధము చేసి మరణిం
చెను. అతఁ డట్లు మరణింప నతని గుఱ్ఱమును రాక్షసుఁడు
తోలుకొనిపోయెను. చచ్చిపోయినయాతనికళేబరమును వనస్థు
లైనమునులు కొందఱు దహనమొనర్చి రని చెప్పఁగా నిందలి
వా రందఱును గొల్లు మనిరి. ఈవార్త యంతిపురమునఁ దెలి
యఁగా నందలిస్త్రీ లందఱు విలపించుచుండ నీభార్య మదాలస
'పాతాళకేతుని జంపిననాభర్త నెవఁడో చంపె ననిన నేను
నమ్మను.' అని వారల నూరార్చుచుండ 'ముని యేల యసత్య
మాడును? నీవే వచ్చియడుగు' మని సభలోనికి నేను దోడ్కొని
వచ్చితిని. అంతనాసాధ్వి ముని వయ్యు నన్నృతము లాడె దే
మయ్యా! నాభర్త యే మరణించిన నేను బ్రదుకుదునా? యను
నంత ముని తత్తఱపడుచు "అమ్మా! నీవు కువలయాశ్వుని
భార్యవా? నే నబద్ధము చెప్పుదునా? ఆతఁడు యుద్ధమున మర
ణించుచు నీ కిమ్మనిన రత్నహార మిదిగో" యని నీకంఠమాలను
జూపెను. ఆయమహారము నట్లు కనులతోఁ జూచినదో లేదో
వెంటనే మరణించెను. అది గాంచి యందఱును బెద్ద పెట్టుగా
నేడ్చిరి. కొంతసేపటికి నీతండ్రియుఁ దల్లియు విరక్తి వహించి

యందఱకు ధైర్యము చెప్పఁగాఁ దేఱుకొనిరి. అనంతరము నీ తండ్రి యామె దేహమున కగ్నిసంస్కారము చేసెను. అంత దాఁక స్మశానమందే యుండి విలపించుచు నాముని వెడలిపో యెను. రాజునకు మేమును గృహమునకు వచ్చితిమి యని చెప్పఁగా 'హాప్రియా! కనఁబడవా' యని యనేకవిధముల విలపించి చావ నెంచి న్యాయము గాదని పరిపరివిధములఁ దర్కించి తుదకు నాకై ప్రాణములను బాసినమదాలస గాక యీజన్మమున నా కెవ్వతెయు భార్య కారాదు. ఆమె బ్రదికి వచ్చిననే నాకు గార్హస్థ్యముకల్గునని కఠోరప్రతిజ్ఞ గావించియు న్నాఁడు. తండ్రీ! కావుననే యాతనివాంఛ యెవ్వరికి నసాధ్య మని యంటి మని కొడుకులు దెలుప, అశ్వతరుఁడు పౌరుషదైవ ముల బలాబలములఁ జర్చించి పౌరుషమును నమ్మి పనిచేయవలె నని నిశ్చయించుకొని తత్క్షణమే హిమవంతంబున కరిగి యందుఁ బ్లక్షావతరణం బనుతీర్థరాజంబున సరస్వతీదేవి నుద్దేశించి ఘోర ముగాఁ దపము సేసి యామెదయచే తనకును; దమ్ముఁడగుకంబ ళునకును శంకరుని గరంగింప నేర్చినసంగీతవిద్య వరంబుగాఁబడసి తమ్ముని దోడ్కొని కైలాసమున కరిగి పరమేశ్వరుని గానకళచే నుపాసింప మొదలిడెను. వారలభక్తికి మెచ్చుకొని పరమశివుఁ డల్పకాలముననే ప్రత్యక్షమయి వరంబు గోరుకొం డనిన నశ్వతరుఁడు మ్రొక్కుచు "దేవా!! మాకై నీవేమియు నీయ నక్కఱలేదు. భూలోకమున ఋతధ్వజుం డనురాజు గలఁడు. ఆతనియర్ధాంగి మదాలస యనుసాధ్వి నొకానొక దుష్టుఁడు మాయచే వంచించి చంపివేసెను ఆయమ నాకుఁ గూఁతురై జనింపవలెను. జనించుటలో వెనుకటిరూపవయోలావణ్యవిజ్ఞా

నములు గలిగి యాయమ యోగజ్ఞయై యోగిమాతయై జగద్వి శ్రుత కావలె నని కోర, నీశ్వరుఁ 'డోయీ! యిట్టివరం బపూర్వము. ఎట్లు కోరితి వన ఫణిపతి నిరుత్సాహుఁడై దీనముగా 'దేవా! ఈవర మెవ్వరు నీయఁజాల రనియే కదా! నిన్నాశ్రయింతుము? నీవు ప్రత్యక్ష మయ్యు నిట్లు నిరాశముగఁ బలుకుచుంటివి. ఎట కేఁగుదుము. సమానాధికరహితుని నీవు గాక వే ఱొక్కని జూపింపుము. వానినే సేవింతుము. అఘటనా ఘటనాసమర్థుఁడ వని కాదా వచ్చితి' మనియ నేకవిధముల విన్న వించుకొనఁ బరమేశ్వరుఁ డలరి, 'పన్నగేంద్రా! పితృదేవతా ప్రీతిగా శ్రాద్ధము చేసి, యందలిమధ్యమపిండము నారగించి మదాలసాజననమునకై ధ్యాన మొనర్చినచో నీనడిమిపడగ నుండి యామె నీకోరినప్రకారము పుట్టు'నని వరం బిచ్చి యంత ర్ధానమయ్యెను.

---

## తృతీయాశ్వాసము.

అనంతర మశ్వతరుఁడు దమ్మునితోఁ బాతాళమునకు వచ్చి యీశ్వరోక్తపద్ధతిని శ్రాద్ధము నెఱపి మధ్యపిండమును దిని పితృదేవతలను స్తుతించి, తనయైనుపడగ లాకస మంతయుఁ గ్రమ్మునట్లు విచ్చి మదాలస తనకుఁ గూఁతురై జనింప ధ్యానించుచుండ నద్భుతరీతిని కురులు, నొసలు, కనుబొమలు, కనులు, చెక్కిళ్ళు, నాసిక, యధరము, కంఠము, చన్నుఁగవ నాభి, ముకుళించిన కేలుదోయి, వళులు, నడుము, జఘనము, తొడలు

జంఘులు, పదము లోకోత్కృష్టిగా వెలువడుచుండ హా! ప్రాణేశా! యనుచు నాతనిమధ్యమఫణమునుండి మదాలస కోంటె వయోరూపవిజ్ఞానములతోఁ బొడమి పుడమిఁ బడి డస్సి యుండ, నామెను దేర్చి, తనవృత్తాంతమంతయుఁ దెలియఁజెప్పి యమ్మా! నీపతి మరణింపలేదు. రేపు నీకుఁ దెచ్చిచూపెదను. ఊఱడు మని పలికి యంతర్గృహంబున నెవ్వరికిం దెలియకుండ డాఁచి తగునుపచారములకై దాసీనివహంబు నియోగించెను.

ఇంతటఁ గువలయాశ్వునొద్దనుండి వచ్చి తన్నుఁ జూడఁ గుతూహలపడుచున్నకుమారుల నరసి కువలయాశ్వునియోగ క్షేమము లడిగెను. అడుగుటయుఁ గొడుకులు "తండ్రీ! ఇన్నాళ్ళకు మిత్రుఋణంబుఁ దీర్చుకోఁ గంటిమి. నీ వట్లు తపంబునకై హిమవంతంబున కేఁగ మేము యథాపూర్వముగా మిత్రుని గాంచ నేఁగ, నాతనిచెంగట గాలవమహర్షి కూరుచుండి జ్ఞానోపదేశము చేయుచుండెను. మేము వినతి సల్పి యాయనయాశీర్వచనము లొంది కూరుచుండ, నాముని మాకుఁ గూడ సంసృతి విరక్తి గలుగు నట్లు "వత్సా! నీ వెచటఁ బుట్టితివి? ఆమె యెచటఁ బుట్టినది? ఎక్కడ మీ రిరువురు దంపతు లైతిరి? అట్టి విచిత్రఘటనమున కేయదృష్టము కారణమో, యాయదృష్టమే నేఁడు దూరము చేసినది. అయ్యది ఋణానుబంధ మని తెలిసి దుఃఖము విడువుము" అనుటయు, రాకుమారుఁడు "దేవా! మీకరుణచే లభించిన యాకాంతను మీకుఁ జూపలేకపోతి నని యాఁగనిదుఃఖమున మునింగితిని. ధైర్యము వహింపనేని మిత్రులతో నహర్నిశము విద్యామార్గనికుఁడనై యెట్లు విహరింపఁ గలను? పరమసాధ్వి యగుమదాలస నాకై ప్రాణము విడిచిన

వార్త వినియు మరణింపని కృతఘ్నుఁడ నైనను, ఆయమసౌశీల్యా
మున కుద్బోధకముగా మీయాగమనము మదికి సోఁకి య
త్నిలితిని. దేవా! దాని కేమి గాని మును లట్టివంచన చేయు
దురా? అని యెంచి మ మ్మీరుపుర ద్వారము సేసినయామునిం
జూడఁ గోరి పెక్కుసారులు యమునాతటమున కరిగితిని. ఒక్క
మాఱును ముని గాని యాయాశ్రమము గాని కనఁబడలేదు.
చాల వింతగాఁ గనఁబడును. ఆముని యెవఁడో య ట్లేల చేసె
నో దేవరకుఁ దెలియునా? యని యడుగ, నాగాలవముని కన్ను
లుమూసి యొక్కింతతడవు ధ్యానించి కన్దెఱచి వాఁడు పాతాళ
కేతుని తమ్ముఁడు తాళకేతుఁడు. కానిమునికాఁడు. నీవు
పాతాళకేతునిజంపి మదాలసనుబెండ్లాడి సుఖంబుగానుంటివన్న
వార్త విని యీర్ష్యనొంది, ఎవ్వతెకై మాయన్న నెవ్వఁడుచంపి
యాయువతితో సుఖమనుభవించుచున్నాఁడో వానిని నాయువ
తిని రూపుమాప నేనిసోదరు ఋణమెట్లుతీరును ? యుద్ధమున
వానిని జంపుదమన్న శత్రువు సకలశస్త్రాస్త్రవిదుఁడు మహాబల
వంతుఁడు. కావున వంచనచేఁ జంపవలయునని తలఁచి యట్లు
చేసినాఁడు. నీమృతివిని యామెయు, నామె మృతి విని నీవును
మరణింతురుగదా యనుకొనెను గాని దైవవశమున నందు
సగమే ఫలించినది. అనెను. తోడనే మహాకోపముతో
"మునీంద్రా! వాఁ డెచట దాఁగెనో చెప్పుఁడు. వాని
నిప్పుడే చంపి వాని నెత్తుటితో నా ప్రియురాలికిఁ దర్ప
ణము చేసెదను. పంచమహాభూతములలో నెందు దాఁగి
నను నాబాణాగ్నులఁ గాల్చి వేసెదను. అట్లు చేయలేనియెడ
నేను మరణింతు నని ప్రతినఁ బూన దద్దరిల్లి మే మి ట్లనుకొం

టిమి. పట్టరాని దుఃఖముచే సీతం డే మగునో యనుభయమును పోయినది. శోకము క్రోధముగా మాఱినది కావున సీతండు దక్కినాండు. చిరకాలమునుండి మనము చేయవలె ననుకొనెను ప్రత్యుపకృతికి అవకాశము కలిగినదిగదా యని వానియాయువు పట్టు తెలుప మునీంద్రుం గోరంగా నాయన యిట్లు చెప్పెను. వాండు సురాసముద్రమధ్యస్థ మగునొకద్వీపమున నొకపట్టనము కట్టుకొనియున్న వాండు. ఎవ్వరు నాతా వెఱుంగ రనియు, నెఱింగినను శాపభీతిచే నచటికి రా రనియు వాని విశ్వాసము. రెండు కాళ్లుగల యేప్రాణిచేతను జావు లేకుండ బ్రహ్మవలన వర మొంది ముల్లోకములను మాయచే బాధించుచుండును. అని ఋషి చెప్పుచుండంగనే గుఱ్ఱము నెక్కి కత్తి చేంబూని యప్పుడ కువలయాశ్వుండు దుర్నిరీక్ష్యప్రతాపుండై వెడలుటయు, సదృశ్యరూపమున నాతనివెంబడినే మేము వెళ్లుచుంటిమి లవణేక్షు సముద్రములుదాంటి సురాసముద్రమధ్యస్థ మగు ద్వీపమునం దాళకేతుపురంబు దూరముననే కానంబడ నాసముద్రపుటొడ్డున నే గుఱ్ఱము డిగ్గి దాని మూంపుపైం జేయిమోపినిలిచి యాతం "డరరే! వైరి ద్విపాత్తుల కసాధ్యుం డగునుగదా? వానిం జంపు టెట్లనుకొనుచుండంగా మే మిరువురము గుఱ్ఱము కళ్లెమునను బల్లమునను సదృశ్యరూపమున నావహించి ప్రేరింపం గువలయాశ్వ మొక్కపరుగునం దాళకేతుపురంబునం జొచ్చి యెందఱు పట్టుకొన యత్నించినను జేంజిక్కక తిన్నగాం దాళకేతు నాస్థానద్వారమున నిలుచుటయు వాం డరు దందుచు సపరివారుండై వచ్చి మున్ను చూచి యుండుటచే 'నిది ఋతధ్వజుని గుఱ్ఱము. ఏల యిట్లు కళ్లెము పల్లము దాల్చి రౌతు నెడసి

వచ్చెనో? అతఁ డేయుద్ధమునకో గూల దిగ్భ్రమ మొందదయిందు చేరి యుండును. ఇది ప్రతిదినము జగమంతయు దిరిగి వచ్చునఁట! దీనిని జో నిత్తునా! యని కళ్లెము పట్టుకొని పల్లము ముడి బిగించుచుండ నం దావహించియున్న మేము సర్పాకారముల తో వానికాలుసేతులు బంధింప భయపడి వాఁడు సేవకులం బిలిచెను. వాండ్రును మమ్ము హింసింప సాధనములు గొని సమీపింప విషాగ్నిని వారలం గాల్చివైచి పడగలు విచ్చి తాళ కేతునితో "ఓరీ మూర్ఖా! పరమపతివ్రత యైన మదాలసను మాయచేఁ జంపి, బూది యగుదాఁకఁ జలపట్టి సాధించితివఁట. ఇప్పుడు ప్రాణములతో నెచటి కేఁగఁగలవురా! ఆపాపమే నిన్నుఁ జంపుచున్నది కాని మేము కా దెఱుంగుము. పరులకన్యను బలవంతమున నెత్తికొని వచ్చి నిర్బంధించుట న్యాయమును, అట్లు చేసిన దుష్టుని జంపుట యన్యాయము నఁటరా! అట్లయి నను నీయన్నం జంపినవైరిఁ జంపక యతని సతిని నెందులకురా చంపితివి? నిన్నిప్పుడ చంప కున్నయెడల జగద్ద్రోహ మగును. దేవుని స్మరించుకొనుము. నీబ్రదుకు సమాప్త మైనది. ద్విపాత్తు లైన మిగులుదువేమో! గూఢపాత్తుల మగుమాకుఁ జిక్కి నీవు బ్రదుకు టెట్లు? అని వానికంఠమును గోఱల నొక్కి విషాగ్ను లచే స్వరూపనాశన మొనర్చి బ్రాహ్మణాకారములతోఁ గువ లయాశ్వము నెక్కి మిత్రుని గలసి చతుష్పాత్తు గావున నశ్వ ముచే రక్కసుం జంపించితి మని చెప్పి, మాగుట్టు తెలుపక, యాతనికోరికపై నతనితో గుఱ్ఱము నెక్కి మరల గాలవుం గాంచి రత్నపురమునకు వచ్చి యాతనిని స్వగృహమున దిగ విడిచి వచ్చితిమి అని చెప్పిరి.

అది విని సుతులకృత్యమును మెచ్చుకొని మీరు ఋణవిముక్తులైతిరి గాని బిడ్డలార! నేను గాలేదు గదా! ఆతని నొక్కసారి చూడవలె నని చిరకాలమునుండి కోర్కెగలదు. వినోదమునకేని నాతని నొక్కమారు దోడ్కొని రారేల? యనుటయు నప్పుడే కదలి కువలయాశ్వునిం గాంచి యాతనితో విహరించుచుం బ్రసంగవశంబున అన్నా! మే మిన్నాళ్ళనుండి మీయింటికి వత్తుము గదా! మాయింటి కెన్నఁడు రావైతివి" అనిరి. అందులకుఁ గువలయాశ్వుఁడు 'సోదరులారా! మీరిట్లు పల్కుట' ధర్మమా? నాగృహము మీది కాదా? నన్నన్యునిగాఁ దలంపఁదగునా? నాగృహమందుఁ గలవాహనధనవస్త్రాది పదార్థములం దేది యెవ్వని కీయవలె నని మీకుఁ దోఁచినను నీయవచ్చును గాదా? నేను దురదృష్టవంతుఁడను గాన నాయెడ మీకు మమత్వము గలుగక పోయెను. నాసర్వధనము మీది. మీసర్వము నాది. మిత్రుఁ డనఁగా బహిఃప్రాణము కదా! కావున మీ రిట్టి భేద మెంతు రేని యొట్టుసుఁడీ యని మైత్రితోఁ గూడినకొంచెము కోపముతోఁ బలుక, ముఖములు వికసితపద్మములు గాఁగ ఫణికుమారు లిట్లనిరి. అన్నా! నీవు చెప్పిన దంతయు నిజమే! నీవు మాయింటికి రమ్మని కోరుటకు హేతువు మాతండ్రియాజ్ఞ సుమా' యనునంతఁ దటాలునఁ బీఠమునుండి దిగి భూమిపైఁ బడి మ్రొక్కి "తండ్రియే రమ్మనెనా? అట్లయినధన్యుఁడను లెండు. ఇప్పుడ పోవుదము జనకాజ్ఞ కెన్నఁడు నాలసింప నేరను. మీతండ్రి యన నాతండ్రి కాఁడా? నన్నుఁ జూడవలె నన్న యాయనవాంఛ నిన్నాళ్ళదాఁక నేల చెప్పరు? మన మెంత తప్పొనర్చితిమి. తండ్రి యుత్కంఠ

మీ రెన్నఁడును జెప్ప రైతిరి. ఆయనక్షేమము నేను నెన్నఁడు నడుగనైతిని; అని మనమున నెంతయు నొచ్చుకొనుచు వారి వెంట నప్పుడే పయన మయ్యెను. అట్లు వెడలి యమ్మువ్వురును గొంతదూర మేఁగినపిదప గౌతమీనది మార్గమున నడ్డు రా నందు స్నానాదికము నిర్వర్తించుకొని యన్నదీప్రవాహం బుత్త రించినయంతఁ గన్నులు మూసికొమ్మని నాగకుమారులు రాకుమారుని రెండుచేతులు పట్టుకొని భూవివరమునుండి రసాత లంబునకుఁ గొనిపోయి స్వస్వరూపములతోఁ గానిపింప నాశ్చర్య పడుచుబుతధ్వజుఁడు "మీరు విప్రనందనులు కారా? ఏమి యీ చిత్ర"మనియడుగఁ దమ నిజవృత్తము దెలుపుచు వారు పాతాళ మునను్న భోగవతీపురంబునకుఁ దీసికొని పోయి యశ్వతరునకుఁ జూపిరి. ఆయహిచక్రవర్తియు నతని నత్యాదరమునఁ బూజించి నాగకన్యలనాట్య మేర్పఱచి, యాంతనిభోగవైముఖ్యమునకచ్చెరు వందుచు, నిష్టకథల సంతుష్టుఁ జేసి "బిడ్డా మా కతిథిగావచ్చిన నీకు నొకయపూర్వవస్తువు కానుకగా నిచ్చి పంప నెంచితిని. కాన సువర్ణవస్త్రధనవాహనాదులం దెది నీ కిష్టమో యది కోరుకొమ్మన "దేవా! నాయింట సమస్తము గలవు. ఎట్టి దుర్లభవస్తు వైనను దెచ్చి యిచ్చుతండ్రి గలనాకు యాచనా నైచ్యమేల? నా కేవాంఛయుఁ గూడ లేదు. నేనే యాచకు లేది కోరిన నది యిత్తును. అన నాఫణీంద్రుఁడు "మండనవస్త్ర ములందు నీకు వాంఛ లేనియెడ మఱి యొకవాంఛ నీమది నేది యున్నను దెలిపినచో నెట్లయినను దీర్చి యంపుదును. చెప్పు మన సకలసంపదలకు హేతు వగుధర్మమున నామనసు నిశ్చల ముగా నుండ వర మిమ్మన అట్లే యుండును గాని అతిథి వగు నీకు

నరలోకమున దుర్లభ మగున దేదియేని యిచ్చి పంప నెంచితిని. నిస్సంశయముగాఁ గోరుకొమ్మన నేమియు ననలేక నాగకుమారుల మొగములవంకఁ జూచుటయు, వారు మదాలస తక్క నన్యమీతఁడు కోరఁడు అని చెప్పిరి. ఆశ్చర్యము నభినయించుచు నశ్వతరుం డిట్టికోర్కి యుండునా? సకలవిద్యలు చదివితివి. సృష్టిరహస్యము లన్నియు నెఱిఁగినవాఁడవు. ఎచ్చట నైనను చచ్చినవారు మరల వచ్చుట కంటివా? వింటివా? కావలెనేని మాయచేతఁ గాని స్వప్నమునఁ గాని చూచుట మాత్రము కలుగవచ్చు ననఁగాఁ గువలయాశ్వుండు తండ్రీ! అట్లు మాయచే నైన నొక్కమాఱు మదాలసను జూపు మన నహిరాజట్లు నేను జూపెదను గాని నీకామెను స్పృశింపవలె ననియేపాటి కోర్కి గలిగిన నామె మాయ మగుటయే కాదు. నామంత్రము వికటించి హాని కలిగింపవచ్చును. కాన నీ కట్టిధైర్య మున్న నే చెప్పు' మనఁ 'గంటితోఁ జూచియైన తృప్తి పడుదును' చూపుమని రాకుమారుఁ డన 'నీరాత్రి చూపెద'నని సర్పరాజు మదాలసయొద్దకు రాఁగా నామె 'భర్తృవిరహాసహిష్ణువై మూర్ఛిల్లినదని చెలులు చెప్పఁగాఁ దత్తఱమున నామె నొడిఁ జేర్చుకొని 'అమ్మా నీభర్త వచ్చె' నని యశ్వతరుఁ డన్నాఁడో లేదో! “ఎచ్చట నుండెను” తండ్రీ! చూపవా? యనుచు మదాలస మూర్ఛనుండి తేఱుకొన నూరార్చుచు 'అమ్మా! యీరాత్రి చూపెదను. నీవు నీనాథుఁడు కంటి కగపడఁగనే పరవశత నొందక యొక్కగడియసేపు ప్రతిమవలెఁ జలింపక యుండవలెను. అన మదాలస తండ్రీ! నాప్రాణప్రియుఁడు నాకంటఁ బడినచో నే నెట్లుందునో ఉండఁగలనో యిప్పు డేమి చెప్పఁగలను. అయి

సను యత్నింతును అనెను. 'అయినను నామాట మఱువకు' మని యశ్వతరుఁడు చెలికత్తెలఁ బిలిచి యామె నలంకరింపుఁ డని వెడలిపోయెను. వెంటనే సకియ లామెను జక్కఁగ నలంకరించి రాత్రి యగుదాఁకఁ బరిహాసములతోఁ గాలము గడపిరి. అశ్వతరుని యాజ్ఞచే సేవకులు సభారంగ మంతయు నలంకరించి, తెర నొకదాని నేర్పఱిచిరి. సభకు నాగలోక మంతయు వచ్చి కూరుచుండెను. తరువాత ఫణిరాజకుమారులు కువలయాశ్వుని రెండు చేతులను బూని వచ్చి యుచితాసనములం దతని కిరు వంక నుండఁ గూర్చుండిరి. మాంత్రిక వేషముతో అశ్వతరుఁడు తెరముందటికి వచ్చి నిలిచి మాయమంత్రముల నే వేవియో చదువుచు 'శ్రద్ధగాఁ జూడుఁ డని హెచ్చరించుచు రాకుమారా! నీమదాలస యగునో కాదో చూచుకొను' మని యట్టహాసము సేయుచు మెల్లగాఁ దెర యెల్లఁ దొలఁగించెను. లలితాతిలలిత మైనయాకారముతో మదాలస కంటఁ బడఁగనే కువలయా శ్వుఁడు దాను గూర్చున్నపీఠికనుండి రివ్వున 'హాప్రియా !' యనుచు లేవఁబోవ ఫణికుమారులు రెండుచేతులు పట్టుకొని 'మిత్రమా ! తండ్రి చెప్పినమాట మఱచితివా ? నీవు తాఁకిన యెడ వాయుమ మాయ మగును' అనుచు బలవంతమునఁ గూరు చుండఁ బెట్టిరి. అంత మదాలస 'హా ! నాథా యనఁబోయి మాట రాక యెలుఁగు గ్రుటుకొనుచుండ నశ్వతరుఁడు మంత్రిం చినరీతి వల దని యదలింప విభ్రాంతయై యూరకుండెను. కువ లయాశ్వుండును వెఱ్ఱివోలెఁ జూచుచు వారి నిరువురను విదలిం చుకొని మహావేగమున రంగస్థలమునకు రాఁగా అశ్వతరుఁ డడ్డు కొని "నాయనా ! యిది మాయ సుమా ! సోఁకినఁ బ్రమాద

మగు నని యూఁప దీనముగాఁ మాయ మైనను సరే! ఒక్క-సారి స్పృజించి యామెయడుగులయొద్దఁ బడి మరణింప ని' మ్మనుచు రాజపుత్రుఁడు మూర్ఛవోయి పుడమి నొఱఁగుచుండ నశ్వతరుఁడు రెండుచేతులతోఁ బట్టుకొని 'అయ్యో! యెంత కఠినుఁడ నైతి'నని తన్నుఁ దాఁ దూఱుకొనుచుఁ గొడుకులును దానును జందనాదిశీతలపదార్థములఁ దెచ్చి యుపచారములు చేయుచుండ మదాలస 'హా ప్రాణేశా!' యనుచు నాతనిపైఁ బడి విలపించుచు నశ్వతరు నొడినుండి తనయొడికి నాథుని దెచ్చికొని 'అయ్యో! నాకై విలపించుటచే నిట్లు కృశించితివా నాథా! యనుచు శరీరము నిమురుచు నాగరాజువంకఁ జూచి 'తండ్రీ! యిది యేమి వినోదము? నాకై భర్తయును, భర్తకై నేనును, విలపింపఁ జూడ ముచ్చట యైనదా? అనుటయు నశ్వతరుఁ 'డమ్మా! మీయనురాగము కనులారఁ జూడవలె నని యనుకొంటిని గాని యిట్లు పరిణమించు' నని యనుకొంటినా? అని నొచ్చుకొనుచుండ మదాలస యొడియం దుండఁగనే మూర్ఛనుండి దేఱి కువలయాశ్వుఁడు 'ప్రియా! బ్రదికితివే' యని పెద్దగాఁ బలికి, 'తండ్రీ! నన్ను క్షమింపు' మని యశ్వతరునకు మ్రొక్కి, తత్పుత్రులను గారవించుచుండ సిగ్గుచే తటుక్కున లేచి నిలిచియున్న మదాలసను నాగేంద్రునిపట్టపురాణి కువలయాశ్వునితోసమముగానిలిపి నివాళులిచ్చి దీవించెను. అంత నశ్వతరుఁడు కువలయాశ్వునితో మదాలసామరణవార్త తనయులవలన విసినది మొదలాయమ తనపడగనుండి పుట్టెడుదాఁకఁ దా నొనరించినకార్యదీక్ష వివరముగాఁ దెల్ప నందఱును దెల్లఁబోయిరి. పిదప వారి యందఱలోకోత్తరసుగుణ

ముల నొండొరు లుగ్గడించుకొన్నతరువాతఁ గువలయాశ్వుఁడు తలిదండ్రులఁ జూడ వేడ్కపడుచు, నశ్వతరుని బుత్రిసహితము రాఁ బ్రార్థించి, తలఁచినతోడనే వచ్చినకువలయాశ్వముపై నెక్కి, యనర్ఘమణికనకాంబరాదుల సారెగా నొసఁగి యందలమునఁ బయనమైనయశ్వతరునితో, మదాలసతో, నాగరాజపుత్రులతో, తనపురము చేరి తలిదండ్రులకును బరివారమునకు నానందాశ్చర్యములు గలిగించెను. శత్రుజిన్మహారాజును నాగేంద్రునిసమక్షమునఁ గువలయాశ్వునకుఁ బట్టాభిషేకముగావించి తపోఽర్థమై భార్యతో వనముల కరిగెను. అశ్వతరుఁడును మదాలసాకువలయాశ్వులను నాశీర్వదించి కొడుకులును దానును దనలోకమున కరిగెను. మదాలసాద్వితీయుఁడై కువలయాశ్వుఁడు ధర్మప్రధానముగా రాజ్య మేలుచుండెను. పాఁడిపంటలు గలిగి యీతిబాధలు లేక, ఆతనియేలుబడియందు ధరణీచక్ర మంతయు సుఖసంపదలతో శుభోదర్కముగా నలరారెను.

సమాప్తము.



# వి ష య సూ చి క.

## ప్రథమాశ్వాసము.


| | పుట |
|---|---|
| అవతారిక ... ... | 1 |
| షష్ఠ్యంతములు ... ... | 41 |
| రత్నపురాధిపతియగు శత్రుజిన్మహారాజు వర్ణనము | 43 |
| ఋతధ్వజునియొద్దకు నాగకుమారులు వచ్చుట ... | 45 |
| అశ్వతరుఁడు విద్యాభ్యాసమునుగూర్చి కొడుకులకుఁ దెలుపుట | 46 |
| అశ్వతరునకుఁ గుమారులు ఋతధ్వజచరిత్రము చెప్ప నారంభించుట | 49 |
| గాలవమహర్షి కువలయాశ్వమును దెచ్చుట | 53 |
| గాలవమహర్షి పాతాళకేతుని దుండగములు తెలుపుట | 56 |
| వరాహరూపుఁడైన పాతాళకేతుని కువలయాశ్వుఁడు వెంబడించుట | 65 |
| ఋతధ్వజుఁడు కుండలతో మదాలసను సమీపించుట | 74 |
| కుండల మదాలసా వృత్తాంతమును కువలయాశ్వున కెఱిఁగించుట | 77 |
| మదాలసా కువలయాశ్వుల వివాహము | 87 |


## ద్వితీయాశ్వాసము.


| | |
|---|---|
| కువలయాశ్వుఁడు పాతాళకేతుని చంపుట | 92 |
| మదాలసా సహితంబుగ గాలవుని యాశ్రమంబునకుఁ గువలయాశ్వుఁడు వచ్చుట | 95 |

శత్రుజిత్తు కొడుకుం బ్రశంసించుట 99

మునుల యాశ్రమంబుల రక్షింపం గువలయాశ్వుని దండ్రి నియోగించుట 103

కువలయాశ్వుఁడు తనపురంబునకు వచ్చుట 111

మదాలసా మరణవార్త మంత్రులు కువలయాశ్వునకుఁ దెలుపుట 115

కువలయాశ్వుని తలిదండ్రుల వైరాగ్యము 123

మదాలసకై కువలయాశ్వుఁడు విలపించుట 126

కొడుకుల పలుకులువిని యశ్వతరుఁడు తపంబునకరుగుట 130

కంబళాశ్వతరులు శివుని గానముచే సేవించుట 136

శివుఁ డశ్వతరునకుఁ బ్రత్యక్షమగుట 139


తృతీయాశ్వాసము.


మదాలస పూర్వపరూపములోఁ బుట్టుట 147

కొడుకు లశ్వతరునితోఁ దాళకేతుని జంపువార్త చెప్పుట 151

గాలవమహర్షి తాళకేతునికి బ్రహ్మయిచ్చిన వరము దెలుపుట 153

కువలయాశ్వునికి గాలవమహర్షి హితోపదేశము 162

కువలయాశ్వుని నాగకుమారులు పాతాళమునకుఁ గొనిపోవుట 164

అశ్వతరుఁడు కువలయాశ్వుని గౌరవించుట 169

అశ్వతరుఁడు కువలయాశ్వుని మనస్సు పరీక్షించుట 174

అశ్వతరుఁడు మదాలసను బ్రతిమాకారమునఁ గూర్చుండఁగోరుట 179

నాగాంగనలు మదాలస నలంకరించుట 183

మాంత్రికవేషముదాల్చి యశ్వతరుఁడు మదాలసను కువలయాశ్వునకుఁ జూపుట 184

మదాలసంగాంచి కువలయాశ్వుఁడు తహతహపడుట 187

మదాలస మూర్ఛిలిన పతిని సమీపించి విలపించుట 189

మదాలసా కువలయాశ్వు లొండొరులం గలియుట 191

మదాలసా కువలయాశ్వులు నిజపురమునకుఁ జేరి పట్టాభిషిక్తులగుట 198



శ్రీమాత్రేనమః

# మదాలసావిలాసము.



## ప్రథమాశ్వాసము.

### అవతారిక.



ఉ. శ్రీరమణుం డనామయవిశిష్టచిరాయు వుదీర్ణవైభవో
దారయశః కుటుంబవితతత్వము లొందఁగ రంగనాయికాం
బారమణున్ సుతాన్వితుని బంధుసముద్రిని సత్తిరాజ్ఞమీం
దారుసిరంగువంశమణి దాంతుఁ బ్రశాంతునితాంతమేలుతన్.

శా. గంగన్ మాళిధరించి, యద్రితనయన్ గాయార్ధమందూని, ని
స్సంగ బ్రహ్మఋషీంద్రలక్ష్య మగునీశానుండు రక్షించుతన్
రంగాంబాదయితున్ సిరంగుకులవారాశీందుఁ గీర్తీందిరా
సంగబ్రాజుని సత్తిరాజు సతతైశ్వర్యాంచితున్ జేయుచున్

సీ. తనపినతండ్రిచేతఁ బ్రతిష్ఠితుం డైన
చెయ్యేరువేంకటేశితృని కృపయు
నాత్మనిర్మితమంటపాదుల హృష్టుం డ
యిన మురమళ్ల వీరేశుదయయు
నారాయణస్వామి కారాధ్యుఁడై ప్రద
త్తైశ్వర్యుఁడయి యేలునభవుఘృణయు
దనకు నిత్యోపాస్యదైవతం బయి యనా
మయదాత యానభోమణి కరుణయు

రంగనాయికావిరహాతీవ్రశుచితప్త
మానసంబుల కమృతంపుసోన గాఁగ
సత్త్రరాజును దత్పుత్త్రసంతతులను
నేక మయి ప్రోచుఁగాక నూ తేండ్లదాఁక. 3

చ. కలుములఁ జల్లుచూపుల జగంబులకున్ సుఖమిచ్చు దేవి, పె
న్జలమున రంగనాయిక స్వసన్నిధిఁ జేరుచుకొన్నయన్ను, శ్రీ
లలన మనంబునన్ దయ దలంచి సపుత్రుని సత్త్రరాజు భూ
తలనగభేదిఁ బ్రోచు నిరతం బదసీయ నివాస వాసయై. 4

చ. ప్రణతిసహస్రపూర్వక ముపాస్తియొనర్చెద నాదిపూజ్యుఁడౌ
గణపతిదేవు విఘ్నమిహికామిహిరున్ శ్రితలోకవాంచితా
ర్పణచణు మోదకప్రియు నభంగురమంగళమూర్తి, మత్కృతి
ప్రణయనపూర్తికై కృప నపాంగనిరీక్ష రవంతసేయఁగన్.

సీ. జలజాత జాతాస్యసాధచతుష్టయి
విడువ కేయము తాండవించుచుండు
నుపనిషల్లనలయుడిగంబు నేతల్లి
యంగీకరించుఁ గటాక్షదృష్టిఁ
బుండరీకాసనంబున సమాసీనయై
యేదేవి యేలు నీరేడుజగము
లేకొమ్మ వీణ వాయించు నాదబ్రహ్మ
మగపడఁ బ్రతిపరమాణువందుఁ
గరుణ నేలేమ కవుల నాల్కల వసించి
సరససారస్వత ప్రపంచమ్ము నెఱపు

నట్టిజగదేకమాత బ్రహ్మాణి వాణి
నను సుకృతిసేయ ముపాసనం బొనర్తు. 6

క. అని సుకవిజనాచారం
బున దైవస్మరణపూర్వముగఁ గృతిపతిఁ దీ
ననలు పచరించి యీకృతి
వినిర్మితికిఁగారణంబు వినిచెదఁ బ్రీతిన్. 7

సీ. తనసచివుండు మేధావి యాపిండిప్రోల్
శేషగిరీంద్రు నంచితమనీష
తనన్యాయవాది యుత్తముఁ డైనగిడుగు శ్రీ
సూర్యనారాయణుసూక్తిపటిమ
తనకుఁ దోడల్లుఁడై తనరు నుయ్యూరు వం
శజ సుబ్బరావు ప్రోత్సాహమహిమ
తనకుఁ గల్గినకవిత్వప్రీతి గార్యరూ
పము నొందఁ వీక్షింపఁ బ్రబలుకాంక్ష
యన్నిటిని మించి ధాత్రి నర్ధాంగి పేరుఁ
నిల్పఁ బుట్టినయాత్మసంకల్పబలము
సత్తిరాజు జమీందారుచిత్తమత్తు
కొనఁగ నెదియేని సత్కృతిఁ గొనఁ దలంచి. 8

క. నను వెంపరాలకులజ
న్మనిరూఢుఁ గవీంద్రు సూర్యనారాయణశా
స్త్రిని శంకరవిజయాదిర
చనాచణుని బిలువఁ బనిచి సాదరమతియై. 9

క. ఖరవత్సర విజయదశమి
గురువాసరమందు హితులుఁ గొమరులు బంధూ
త్కరము గొలువ నిజసౌధాం
తరమందు వసించి యిటు ముదంబునఁబలికెన్. 10

క. కవితాభూషణ ! విద్వ
త్కవి శేఖర ! నాసపర్య గైకొని మద్వం
శవిభవవిస్తరయుతిఁ గృతిఁ
బ్రవిమలమతిఁ జెప్పుడ తరతరంబులు వెలుగన్. 11

శా. మార్కండేయపురాణ మెల్ల బుధసమ్యగ్బోధనన్ వింటి నా
లర్కాంబాపద మామదాలస కథాలాపంబు తాపాంధకా
రార్కద్యోతము నై ప్రమగ్ధఫలదం బై యందుఁదోఁచెన్ శుభో
దర్కప్రక్రియఁ దత్సతీచరిత సంధానింపు కావ్యంబుగన్. 12

క. మరణించి మరలఁ బొడమిన
పరమసతీకథకుఁ దిలకఫణితిగఁ గూర్పన్
మరణించిన నాసతి గ్రి
చ్చఱఁ బొడమదె కీర్తిమూర్తినని మదిఁ దలఁతున్. 13

ఆ. ఎంతదాఁకఁ గీర్తి యిల నిల్చు నన్నరుం
డంతదాఁక స్వర్గ మధివసించు
నందు గానఁ గృతిముఖావాప్తకీర్తి మ
ద్గృహిణి స్వర్గవాస మెనయుఁగాదె. 14

చ. అని యిటు రంగనాయికమ యాత్మను శాంతియుఁ బుణ్యలోకముల్
దనుక నిజాన్వయుల్ తనయుదారతఁ గీర్తివహించి మించ నం

దనుల కిలోధికాభ్యుదయధార్మికబుద్ధులు సుప్రసిద్ధి గ
ల్గను దన పేర నంకితముగాఁ గృతిఁ జెప్పఁడటంచుఁ గోరుచున్.

ఉ. నూటపదాఱురూప్యములు నూతనవస్త్రయుగంబు కప్రపున్
వీటికతో నొసంగి ధరణిన్ నను సుస్థిరుఁ జేయుమీకు నే
టేట ఫలించునట్టి స్థిరవృత్తి బహూకృతి సేయువాఁడ నం
చోటకుఁ జో టొసంగక 'యొహో' యనియెల్లరు మెచ్చఁగా
ననెన్. 16

ఉ. కాన మదాలసాచరితఁ గావ్యముగా రచియింపఁ బూని వి
జ్ఞానిజనంబు దీవెన లొసంగఁ బసందుగ రంగనాయికా
జాని జనిప్రభావమున సన్నుతిఁ గన్నసిరంగు వాఁగసం
బానసమందుఁ గూర్తుఁ దిలకాకృతి నీకృతి కింపు నింపఁగన్.

## కృతిపతి వంశావతారము

సీ. గగనంబు పుట్టిల్లుగా జగత్పావని
గంగాభవానిని గనియె నెద్ది
పరమర్షిమానసాబ్జాతకర్ణికల ద్వి
రేఫమై సతము నర్తించు నెద్ది
వేదవేదాంతవీథీదూరసంచార
భరము వాటింపక మెఱయు నెద్ది
కమలా మృదులపాణికమల లాలనభాగ్య
మంది సుఖించు నన్వాహము నెద్ది
యెద్ది బలిచక్రవర్తి కయ్యెను గిరీట
మెద్ది దూత్యము నడుపు ముక్తిందిరాప్తి

కమ్మహావిష్ణుపాదాంబుజమ్ముఁ దలఁప
జన్మకోటీకృతాఘముల్ సడలిపోవె ? 18

ఉ. అట్టిపవిత్రవిష్ణుచరణాబ్జమునందు మరందధారయై
పుట్టినగంగతో నకరువుల్ మొలతెంచెనొ నాఁగనాపెతోఁ
బుట్టువులై జనించి ధరఁ బొల్తురు నాలవజాతివారు చే
పట్టిననాగటన్ బసిఁడి పండఁగఁజేసి కుబేరు గేరుచున్. 19

ఆ. కాపు బలిజ వెలమ కమ్మ యొంటరి రెడ్డి
యనుచు వ్యవహృతంబు లగుతురీయ
వర్ణశాఖలందు వరలుచుండును దెల
గాఖ్యఁ గాపుకొల మనంత కీర్తి. 20

క. అలకాపురపతి నగియెడు
నలకాపులకులమునన్ ధనాఢ్యంబై ని
స్తులపైడిపాలగోత్రము
తిలక మయి సిరంగుకుల మతిఖ్యాత మగున్. 21

శా. శ్రీరంగేంద్రు 'సిరంగరా' జనుక్రియన్ శ్రీరంగనాథాంఘ్రిసే
వారంగన్మతులన్ జనుల్ వికృతిమై వాక్రువ్వ నానాఁట న
వ్వారే నేఁటి 'సిరంగు'వార లయి దేవ క్ష్మోణిదేవార్హణా
పారమ్యంబున మించు రూర్జితరమాపాంగాప్తిసామంతులై.

ఆ. ఆసిరంగువంశ మమితకరీరమై
నాంధ్రభూమి నెల్ల నంకురింపఁ
గోనసీమతోడవు గా నొప్పుభీమన
పల్లె నొక్కశాఖ ప్రబలె సిరుల. 23

క. ఆశాఖకు మూలపురుషుఁ
డై శోభిలెఁ బుణ్యచరిత యగుభాగమప్రా
ణేశుఁడు నృసింహమూర్తి ర
మేశచరణసరసిజద్వయీస్థిరభక్తిన్. 24

ఉ. ఆనరసింహమూర్తి సుకృతాతిశయంబునఁ గన్నసప్తసం
తానములో యనన్ సుచరితామణిభాగమయందుఁ గాంచె సం
తానముసప్తకంబు ధనధాన్యసమృద్ధివిరాజమానమున్
దీనజనానుకంపిహృదధీనము మానితకీర్తిగానమున్. 25

ఉ. పేరమ పేరిపుత్రికకు వెన్కను వెంకనయయ్యపాహ్వయో
దారుఁడు సుబ్బనాభిధుఁడు దమ్మననాముఁడుఁ బద్మనాభుఁడున్
ధీరుఁడు మల్లయాఖ్యుఁడు జనించి 'సుపుత్రు' లటంచు లోకు ల
వ్వారి నుతింపఁ గొల్చెదరు భాగమ నానరసింహమూర్తినిన్.

క. ఆసంతతి నాఱవవాఁ
డై సమమతి పద్మనాభుఁ డగ్రజుల సదా
దాసుఁ డయి కొల్చునటు తా
నై సాకును దమ్ముఁ గుఱ్ఱ యగుమల్లయ్యన్. 27

సీ. ఆలమందలు మందలందుఁ బన్నుండి య
ర్థముకుళితాక్షులై నెమరువెట్ట
వెనుపట్టె కానిపింపనియట్లు క్రొవ్విన
వృషభముల్ పొలముల విహృతిసేయఁ
బండించి పోసినపలుధాన్యముల గరి
సెలు కణంజాలు గాదెలును నిండ

మెలఁకువ మీఱ విత్తుల నేర్చి కట్టిన
ముడికట్ట లింట నల్లడ రహింపఁ
బాఁడిపంటల కింత లోపంబు లేక
భువి ననుభవించు దేవేంద్ర భోగ మెల్ల
నన్నదమ్ముల కవలంబమై సిరంగు
పద్మనాభుండు రేవతీపతినిభుండు. 28

శా. సత్యాలాపకలాపుఁ డుజ్ఝితధనాశాపాశుఁ డబ్జాలయా
పత్యాకారుఁడు పద్మనాభుఁడు శుభప్రారంభుఁడై రుక్మిణీ
సత్యాకాంతలఁ బోలునిర్వుర సరోజాతాక్షులన్ బెండ్లియై
ముత్యాలన్ నగుబిడ్డ లాఱుగుర నాపూఁబోండ్లయందుం
గనెన్. 29

ఆ. అల్లపద్మనాభునాద్యకళత్రమం
దాత్మజత్రయం బుదయము నొందె
నమలచరితలో మహాలక్ష్మి ముత్యాలు
నారసింహనామధారు లగుచు. 30

గీ. అవుల నప్పద్మనాభుపుణ్యమునఁ గనియె
నాత్మజుల వెంకమా ద్వితీయ ద్వితీయ
రామయాఖ్యు నారాయణస్వామినామ
తనయు లిర్వుర, భాగమ్మ యనుకొమార్తె. 31

క. తలిదండ్రు లన్నలును వ
త్సలతన్ లాలింప విధియచంద్రకళవలెన్
విలసిల్లును భాగమని
చ్చలు గోము దలిర్ప సుగుణశాలిని యగుచున్. 32

శా. ఆభాగమ్మను సత్తిసూరయవివాహంబౌటగోలెన్ గృషిన్
లాభంబుల్ పెరుగన్, సిరుల్ గృహమునన్ నర్తింపఁబుత్రి
త్రియా
లాభంబొంది, శుభంబులన్ గడపుఁ గాలంబెల్లఁ జుట్టాలలో
శోభిల్లెన్ దలమానికం బగుచు సంస్తుత్య స్వచారిత్రుఁడై. 33

మ. అనఘుం డౌనరసింహమూర్తికిఁ గనీయఃపుత్రుఁడై పద్మనా
భునకున్ దమ్ముఁడు నైనమల్లయ నిజాంభోజాక్షి సుబ్బమ్మకున్
దనయుల్ లేమిఁ దపించి దుస్తరపితౄణం బీఁగఁగా దత్తపు
త్రునిగాఁ గైకొనెఁ బద్మనాభతనుజాతున్ రామయన్ జేరి
మమ్మై. 34

మ. తమ సర్వస్వము నిచ్చి మల్లయయుఁ గాంతామాళి సుబ్బ
మ్మయున్
గ్రిమ మేపారఁగ రామయాఖ్యుఁ గృతసంస్కారుండుగాఁ
జేసి ని
త్యముకళ్యాణము పచ్చతోరణముగా నాహ్లాదమున్ గం(దప
త్యములే కాదె భవాబ్ధి ముగ్గి కొనుముత్యంబుల్ పరివాళం
బులున్.

శా. ఉగ్రంపశ్యుఁడు పశ్యతో హరుల,కాద్యుండు విశ్వంభరా
ర్చాగ్రీయామృతధార, కుత్తమకృషివ్యాప్తృత్యలంభూష్ణుఁ,డా
త్మగారిమాణశివంకరుండు, వసుధామర్త్యప్రియంభావుకుం
డగ్రియుండు సిరంగురామయ నుతుం డౌ నుత్తమశ్లోకుఁడై.

సీ. ఏరామ రంభాలవారింట క్షీరాబ్ధి
తెరఁ బుట్టు(శ్రీ)దేవికరణిఁ బుట్టెఁ
గర్షకోత్తంసు వెంకన నేసుశీల పౌ
త్త్రికయై భవాబ్ధిఁ దరింపఁ జేసె
వేంకటరెడ్డి గావించినపుణ్యమే
యమరూపమునఁ గూఁతురై జనించెఁ
గడుపు చల్లంగ నేపడఁతుకఁ గని సత్తె
మాంబ బిడ్డలతల్లులందుఁ బ్రబలె
నట్టిసత్తెమ్మఁ దల్లిపే రంది వెలయు
సాధ్విఁ బెండ్లాడి గార్హస్థ్యసౌఖ్య మెల్లఁ
గొల్లలాడెను మల్లయ్యకొడుకు రామ
యాఖ్యుఁ డిరుదండఁ దలిదండ్రు లలరుచుండ. 37

క. రామయ విశ్రుతుఁ డయ్యె ని
రామయకమలాకృపా ధురామయుఁడై, శ్రీ
రామ యనఁ దనరుసత్తెమ
రామయసభఁ గొనినధర్మరా జనఁ దుట్రిలో. 38

శా. ఆరామయ్యకు సత్తెమాంబకును జన్మానీకసంపాదితా
పారశ్రేయము లేకరాశిగఁ బరీపాకంబు గైకొన్నటుల్
కారుణ్యాంబుధి యన్వయోద్ధరణదీక్షాకుండు లక్ష్మీస్థిరా
గారాకారుఁడు సత్తిరాజు పొడమెం గారాబపుంబుత్త్రుఁడై.

ఆ. కన్నవారు పెంచుకొన్నవా రఖిలసౌ
ఖ్యములఁ జెంది త్రిదివ మందుపిదప

నొంటిసుతుని సతిని నుర్విపై డించి రా
మయ యకాలమృతికి నగ్గమయ్యె. 40

క. జనకకుటుంబమునందుం
దన కనుజుఁ డపుత్రుఁ డైననారాయణసా
మి నితాంతాదృతినై నో
మెను రామయసుతుని సతిని మేలఁతయుఁ దానున్. 41

సీ. భూరిక్షమాగుణంబున భూమిదేవిని
బోలు నేయింతులమేలుబంతి
పరమపాతివ్రత్యపటిమాప్తి సావిత్రి
నడుగువట్టించు నేయన్నుమిన్న
పతిచరణాబ్జానపాయినీత్వమున న
రుంధతి కేవరారోహ సాటి
కష్టసహిష్ణుతాగౌరవమ్మునఁ బ్రతి
బింబమ్ము సీత కేకంబుకంఠి
యేమెలంత నారాయణస్వామిభాగ్య
లక్ష్మి యయి వాసికెక్కె నిలాతలమున
యాసతీమణి భాసిల్లు ననుపమాన
శమగుణైకావలంబ శ్రీసత్తెమాంబ. 42

శా. రామయ్యాత్మజు సత్తిరాజు నిజపుత్రప్రేమతో నోముచున్
ద్వ్యాముష్యాయణుఁగా గ్రహించి తమసర్వస్వంబునర్పించి త
త్క్షేమంబే తమసేమ మంచు మదిలోఁ జింతించునారాయణ
స్వామిన్ దత్సతిసత్తెమాంబ నుపమింపన్ లేరిలన్ దంపతుల్

సీ. తమయదృష్టవ్యత్యయమునఁ దపస్సు స
ల్పిననేని గడుపు ఫలింప కుంట
మరణ మొందుచును రామయ తనమూఁఱుగాఁ
బెంపు మంచును జేతఁ బెట్టియుంట
నాత్మీయదాంపత్య మనితరసామ్యమై
యైకకంఠ్యమునఁ బే రంది యుంట
నాబాల్యగత వినయాదితదీయస
ద్గుణములు తమ కర్మి గూర్చి యుంటఁ
గడుపునం గన్నకం టె నెక్కుడు ప్రియంబు,
దనర నారాయణస్వామిదంపతులు స
దా మమత్వాప్తిఁ బెంచి పెద్దగ నొనర్చి
రుత్తమగుణాబ్ధిరాజు శ్రీసత్త్రిరాజు. 44

గీ. చనుసిరంగునారాయణస్వామిఁ బొగడఁ,
బరమశివభక్తుఁ డాజన్మపావనుండు
నిర్జితేంద్రియుఁ డేకపత్నీవ్రతుండు
నన్నదానప్రియుండు ధన్యాత్ముఁ డతఁడు. 45

సీ. కట్టించెఁ జెయ్యేరుగ్రామాన శ్రీవేంక
టేశ్వరాలయమును శాశ్వతముగ
నర్పించె మాన్యంబు లనుదినధూపదీ
పాద్యర్చనలకుఁ దదర్చకులకు
దానమ్ముసేసె బీదలకు భూములు గట్టి
యిండ్లు తత్రాంతమందే వసింప

సలిపె దైనందినార్చలు తనగోత్రనా
    మములతో జరుగునేమమ్ము భక్తి
యేఁడి యేతాదృశోదారహృదయుఁ, డేఁడి
యిట్టిహరిభక్తుఁ డని ప్రజ లెంచ నెగడె
శ్రీసిరంగకులాబ్ధిరాకాసుధాంశుఁ
డైననారాయణస్వామి యమరజీవి. 46

మ. నరసింహాత్మజ పద్మనాభ సుతుఁ డౌ నారాయణస్వామిసో
దరి యా శ్రీమతి సత్రిభాగమయుఁ దా దానమ్ము గావించె సు
స్థిరరీతిన్ స్థలముల్ గృహస్థులకు నాచెయ్యేరు శ్రీవేంకటే
శ్వర దేవాలయసీమయం దుభయవంశంబుల్ తరింపన్ దమిన్.

మ. తనప్రాణేశుఁడు వేంకటేశుగుడి నాస్థన్ గట్టి స్థాపించు తే
వను దా 'మొక్కలతిప్ప' గ్రామమున ద్రవ్యం బెంతో
    వెచ్చించి క్రి
న్నన రామాలయనిర్మితిన్ సలుపు శ్రీనారాయణస్వామి యం
గన యాసత్తెమ నాత్మపుణ్యఁ దలఁపంగాఁ బాపముల్ రూప
    ఱున్. 48

మ. విపులాలంకృతి వృద్ధగౌతమితటిన్ విఖ్యాతపుణ్యస్థలాం
కపుటూరా మురమళ్లలో వెలసి చక్కన్ నిత్యకళ్యాణమున్
విపులప్రీతిని గాంచుఁ గోర్కు లిడు శ్రీవీరేశు కళ్యాణమం
టపిఁ గట్టించెఁ జిరంతనం బగు క్రియన్ నారాయణస్వామిదార్

శా. క్షేమంబాశ్రితకోటికిన్ గలుగ దాక్షిణ్యంబు సూపున్ రిపు
స్తోమంబున్ నయమార్గమున్ విడక గెల్చున్ బెల్చ నారాయణ

స్వామియేఁ భూపుడని యేమి పుణ్యమొ! స్పృశింపఁ బంగారౌ
మన్న నా
శ్రీమంతుండై యశఃప్రబంధమున కర్థిఁ జుట్టె శ్రీకారమున్.

క. సేద్యమున ధాన్యమటు కా
సీద్యమ్మున ధనము వృద్ధిఁ జెందఁగ నిచ్చల్
చోద్యముగ విభవయుతుఁడై
యాద్యుల మఱపించె రామయానుజుఁ డహహా. 51

ఉ. ఆయతశంభుభక్తి సముపాత్తసుదర్శనుఁడై, సిరిన్ సదా
పాయక, రాముతమ్ముఁ డయి, పంటవలంతిని బంట నేలునా
రాయణుఁడే వసుంధర సిరంగుకులంబునఁ బుట్టె నాఁగ నా
రాయణుఁ డొప్పు నచ్యుతపదార్థుఁడు దానవదానహేతువై

క. ఇన్నా ఱెకరమ్ములపొల
ము న్నేర్మి గడించి సేద్యమును జేయు చతం
డన్నసుతు సత్తిరాజును,
గన్నుల నిడుకొంచుఁ బెంచుఁగన్నసుతుబలెన్. 53

శా. నక్షత్రేశధరాంఘ్రి దివ్యభజనన్ నారాయణస్వామి భూ
రిక్షేత్రార్జనపాత్రమై ధనము వర్ధిల్లంగ నానాఁటికిన్
లక్షాధీశ్వరుఁ డయ్యెఁ దత్కరమలోలం బౌరమాస్థానమై
సాక్షీభూతమగున్ 'శివార్చన మహైశ్వర్యప్రదం' బంటకున్.

ఆ. కరము పరసవేది కరుణామయము చూపు
మనసు శివవశంబు ధనము తనది
గా మెలంగుఁ జిత్రగతిని నారాయణ
స్వామి రాజయోగి భావ మూని. 55

మ. తనశిక్షఁ ధనధాన్యధేనువృష కేదార ప్రతానావలో
కనకార్యాతి సమర్థమానస లసద్గంగాకళత్రాంఘ్రి చింత
తనలోలుండగు ఁడేదినం బెటేఁగెనో నారాయణస్వామి యా
దినమందే యిడెఁ దాళిపుంజెవుల నర్థిఁ సత్త్రరాట్ప్రేలికిఁ.

ఉ. ఏయహమందుఁ బుత్రునకునిచ్చెనొ పెత్తనముఁ నిరీహుఁడై
యాయహమాది'యింత వ్యయమైనది, వచ్చినదింత నేఁటికా
దాయ' మటంచుఁ దెల్పఁ జెవిఁ దార్పఁడు నిల్పఁడు బుద్ధి నందు నా
రాయణసామి నిశ్చలవిరక్తి సమాత్త మమత్వముక్తిమై. 57

ఉ, శ్రీయుతుఁ డయ్యు సంసృతిని జెందక నిర్మముఁడై సిరంగు నా
రాయణసామి నిచ్చలు శివామలనామ జపాభిషేక త
ద్ధ్యాయితలఁ మునింగి మునులంద అపత్రపనొంద శంభురూ
పాయితుఁడై వెలుంగు శివభాగవతుల్ శివులౌట యబ్రమే.

సీ. కననే కనందు కన్గొనిన నేది లభించి
నను గతించిన దానఁ జొనుపఁ డాత్మ
వినసే వినం డెద్ది వినినను జెవులతో
నే కాని మదిలోని కెక్కనీఁడు
చననే చనం డెందుఁ జనిన నచ్చోట శివ
క్షేత్రమై ఖ్యాతి గాంచిననె చనును
అననే యనం డెద్ది యనినను శివనామ
మో సత్యమో యయి యుండు నద్ది
నెందు మొగమోట జంకు సుంతేనిలేక
సత్యము విరక్తి దైవతాసక్తి విడక

ఘనుఁడు నారాయణస్వామి గడపె జీవి
తము నహా ? యసిధారావ్రతంబు గాఁగ. 59

శా. దివ్యుల్ సైతము సన్నుతించు క్రియ భ్రాతృవ్యుల్ స్వపు
త్రాయితుల్
భవ్యాచారుని సత్తిరాజు నెలమిన్ నారాయణస్వామి శో
భావ్యాసక్తముగా గృహస్థు నొనరింపంగాఁ ద్రివారం బదృ
ష్టవ్యత్యస్త విధాప్తి నాసకల మస్తావ్యస్త మయ్యెన్ గటా !

సీ. తండ్రిరామయ యుదాత్తతపఃఫలము, కన్న
పొలఁతి సత్తెమ్మ నోముల సుకృతము
అభిమానధనము నారాయణస్వామికిఁ
దత్సతీపుష్టమందార తరువు
పుత్రీకృతాత్మదౌహిత్రులౌ వెంకట
రెడ్డి సత్తెమలు తరింప నావ
యధమర్ణులకు జీవనౌషధమ్ము సుహృత్త
తులకుఁ బ్రాణము, కోవిదులకు సురభి
యగుచు శ్రీసత్తిరాజు భాగ్యప్రభావ
మునఁ బితృవ్యునిప్రాపొంది మనియె నావ
రాజ్యపట్టాభిషిక్తుఁ డైరాజమానుఁ
డైనయువరాజునకుఁ బ్రతిమానుఁ డగుచు. 61

గీ. అనఘుఁ డగుసత్తిరాజు శేషమ్మ, నమ్మ
నాహ్వయను,మాచరమ్మ, బెండ్లాడి యొకతె
మరింద వేఱొక్క తెగ మువ్వురను దొఱంగి
యంధతమసంబునన్ బ్రాఁకులాడ నయ్యె. 62

ఉ. దైవదురాగతాహతికిఁ దప్పినజంతువు సృష్టి నెందు ను
న్నే? విభవాభిరాముఁడు ననింద్యచరిత్రుఁడు నైనసత్తిరా
జావిధి మూవు రాండ్రురు కులాంకుర మొక్కటి లేకణంగఁ జిం
తావిలభావుఁడై మఱుఁగు నందఱుగల్గియు నొంటియైనటుల్.

సీ. శ్రీల పూకాపులపాలెమ్ము దనజన్మ
మునఁ బావన మ్మొనర్చిన కిశోరి
మోపూరికులు లేడుపురుషాంతరము లిటు
నటు తరింపఁగఁ దోఁచినట్టి సాధ్వి
శ్రీనివాసు పురాసుకృతమున రత్నమా
గర్భశుక్త్యుదిత ముక్తాఫలంబు
రామలింగేశ్వరరాయ సత్యాఖ్యుల
కైదవతోఁ బుట్టు వగు నయిదువ
యక్క సత్యవతికి, శేషమాదులకును
జెలియ, లగురంగనాయికా నలిననేత్రి
యెలమి నాలవపాణిగృహీతి యయి తొ
లంచె శ్రీసత్తిరాజు కలంత లెల్ల. 64

శా. 'లక్ష్మీణాస్మదనేకజన్మకృతపుణ్యశ్రీపరీపాకమై
సాక్షాల్లక్ష్మియొ భాగ్యదేవతయొ యాస్మాకీన వేశ్మంబునన్
నిక్షేపించెఁబదాబ్జ'మంచు వధువున్ శ్రీరంగమన్ గాంచి వం
శక్షేమంకరి గాఁగ మామ సలిపెన్ స్వశ్రేయసాశీస్సులన్.

ఉ. అద్దిర ! రంగనాయిక పదాబ్జము వెట్టిన గేహరాజమే
మిద్దెలు మేడ లౌచు నటిమెన్ దెస లెల్ల నొకబ్దమందె 'సం

పద్దశ యబ్బు టబ్బమియుఁ బైదలిభాగ్యముపైఁ దలిర్చె' నట్టి
పెద్దలసుద్ది వట్టిదగునే? పురుషుండు నిమిత్తమాత్రుఁ డౌ. 66

గీ. సత్తిభాగమ్మ యనుమేనయత్తకూఁతు
కూఁతు రగువెంకమను బెంచి కూఁతురుగను
జలిపెఁ గన్యాప్రదానమ్ము సత్తిరాజె
యల్లబండారుసత్యనారాయణునకు. 67

శా. సంతానం బిఁక రంగనాయిక కవశ్యంభావి యేచింతలన్
స్వాంతం బొందఁగనీకు మంచు ఋషి యానారాయణ
స్వామి య
త్యంతంబున్ వచియించుచున్న వ్యవధిన్ సైఁపంగలే కేరినేఁ
డెంతం జేరిచి పెంచుకోఁగ మది నెంచెన్ సత్తిరాజత్తరిన్.

ఉ. ఆదృతి మీఱఁ బెంచె ననయంబును గన్నిడి రంగనాయికా
సోదరి నందికోళ్లకులశోభన దేవత సూరమాంబ యా
మోదమెసంగఁ గాంచినసుపుత్రు స్వపుత్రుఁగ నెంచి ప్రేమ
పెం
పూఁదఁగ సత్తిరాజు తనయుల్ జనియింప రిఁ కన్ననమ్మికన్.

సీ. వీరవెంకటసూర్యనారాయణుం డని
పేరు వెట్టిరి ప్రేమఁ జేరఁ దీసి
యర్హతఁ గల్గ విద్యాబుద్ధులను గఱ
పించి రొజ్జలను రప్పించి తనిపి
కట్టించి యొసఁగి రక్కజము దోఁప మనోజ్ఞ
మైనసౌధము విశాలావరణము

జీవిక కంచు నిచ్చిరి రత్నగర్భ నాఁ
బొలుపొందు నెనిమిదిపుట్ల భూమి
పెండ్లి సేసిరి వైభవోపేతముగను
రంగనాయికా శ్రీసత్తిరాజు లర్థిఁ
దమకు సంతతి గల్గుచందమ్ము వ్యక్త
మగు వ్యవధియందుఁ బెంచుకొన్నాత్మజునకు. 70

శా. ఆనందాన సిరంగువారిపితరుల్ నాకంబునన్ నృత్యకే
ళీనిర్మగ్నులుగాఁగ, బాంధవులు హాళిన్, మిత్రులాశ్వాసమున్
బూనన్, బుట్టినయింటివారుశ్వశురుల్ పొంగన్ విభుం డున్మన
శ్శ్రీ నింపారఁగ రంగనాయికధరించెన్ గర్భమున్ శ్రీకృపన్.

ఉ. ము న్నొకసారి తన్ను గదముక్తఁ జేసి శరీరసౌఖ్యసం
పన్న నొనర్చు "ఏలను" సమాహ్వయ యూ దొరసాని యాసువ
త్రి న్నెలవొంది సద్గ్రహనిరీక్షణవేళను లక్ష్మి మన్మథున్
గన్నటు రంగనాయిక సుఖప్రసవంబునఁ గాంచెఁ బుత్రునిన్.

గీ. అహహా ! పీఠాపురిని నేలనాసుపత్రి
యెల్లఁ జందోదయపుఁ బాలవెల్లి చాయ
వడసె రంగనాయిక సుఖప్రసవ మైన
వార్త దొరసానినోట వెల్వడెనొ లేదొ. 73

శా. శ్రీనారాయణ, సత్తిరాజులకు వచ్చెన్ వార్త 'రంగాంబ సౌ
ఖ్యాన్ సూనుని గాంచె' నంచు నలపుంఖ్యానాక్షరంబుల్ సుధా

నూనాసారము మించి డెందమునకెందుర్ జెందఁగా రానిపూ
ర్ణానందమ్ము నిడెర్ సిరంగుకుల భూజాజీవ జీవాతువై. 74

మ. ధనముల్ ధాన్యము లంబరంబులు విరుల్ దన్పొప్ప నాస్త్ర
వ్రజం
బున కర్పించుచు సత్తిరాజు మమతన్ బుత్రోత్సవమ్మెం బొన
ర్పను, నారాయణసామి దానును మమత్వం బూని వెండిన్
బసిం
డిని బాత్రోత్సవ మాచరించెఁ-జన నెందేఁ దొంటివైరాగ్య
ముల్. 75

శా. అంచత్కౌతుకు సత్తిరాజు నపు డొయ్యన్ బీఠికాపత్తన
ప్రాంచ ద్వ్యావతవైద్యశాల కనిచెన్, బంగా రటన్ బంచిపె
ట్టించెన్ దత్పరివారసంహతికిఁ 'బైఁడిన్ జల్లుపెన్దాత' లన్
చంచత్కీర్తి సిరంగువారి కొదవన్నారాయణస్వామిదాన్ 76

క. వే లొసఁగి సిరంగుకులయ
శోలక్ష్మీవాసముగ శిశుశ్రేణికలో
మేలుగ నొకగది నవ్యా
ద్యాలయమున 'ఏల' నలరునటు కట్టించెన్. 77

సీ. చేయించె దొరసానిచేతనే పురుటిస్నా
నము భార్య కారోగ్య మమరి మెఱయఁ
బంచిపెట్టించెను బసుపుఁ గుంకుమ రంగ
నాయికచేఁ బౌరనారులకును
గట్టించె గది పీఠికాపురస్త్రీణ వై
ద్యాలయమ్మున స్వనామాంకితముగఁ

గొత్తిగా మోటూకు కొని యందు దునిచి తెచ్చెఁ
దల్లిబిడ్డలఁ బినతండ్రియాజ్ఞ
మనుమగుబ్బని వెసఁ బితృవ్యునికిఁ జూపి
జన్మచరితార్థత వహించి సత్తిరాజు
చిరముగా నింట లేనిలేఁజిఱుతపాప
యూఁకరల ధనలక్ష్మికి జోకగూర్చె. 78

ఉ. 'నిండెను సత్తిరాడ్గృహము నేఁటికి నీశ్వరుసత్కృపన్ గుమా
రుం డుదయించెనంట వినరో' యనుచున్ హితమిత్రబాంధవుల్
బందులమీఁదఁ బల్లకులపై నరుదెంచి కుమారుఁగాంచి బ్రి
హ్మాండముగా నుతింతురు తదన్వయతద్గృహతద్ధనాదులన్. 79

ఉ. పుత్రవతీజగంబునకు భూషణమై తగురంగనాయికన్
స్తోత్రి మొనర్చు పుత్రుని దనర్ గన వచ్చినయెదువల్ 'సప
త్నీత్రియ మొందజాలని యదృష్టము నీకె లభించెఁబుణ్యాచా
రిత్రి' యటంచుఁ; బెల్చ నొనరింతురు దీవన లర్థి వర్థిలన్. 80

ఆ. బాంధవాప్తమిత్రపరివారయుతుఁ డౌచు
సత్తిరాజు బారసాల యుత్స
వంబు సుతున కొనరుపంగ నారాయణ
స్వామి మోదపారవశ్య మెనసె. 81

సీ. తన కనారతపూజ్యదైవతం బగుశివు
పేరు గోల్డొల్ల దీపించునట్లు
తనసహోదరునామమును రంగనాయికో
పాస్య మారాముపే రవులఁ దవుల

దనయుఁ డౌ సత్తిరాజునకు నిత్యారాధ్యుఁ
డగు సూర్యభగవానునాఖ్య గలియ
దనవ్యవహారాభిధాన మానారాయ
ణాఖ్యతోఁ బరిపూర్ణమై రహింప
నపుడు 'శివరామ సూర్యనారాయణుఁ' డని
నామకరణం బొనర్చె మన్మనికి దేవ
దుందుభులు మ్రోయ బంధుమిత్త్రులు మహోత్స
వంబు సేయ నారాయణస్వామి యెలమి. 82

గీ. అదిర ! శివరామసూర్యనారాయణునకుఁ
బుట్టినప్పుడ దొరసాని పెట్టిన 'దొర
బా' బనెడిముద్దుపేరె యాబాలవృద్ధ
సంతతవ్యవహారరంజకత మించె. 83

సీ. తండ్రితాతల మించి దరిలేని కేదార
ఖండసంహతి హేలగా గడించె
నానాఁట ధనసమున్నతిఁ బేర్చి లక్షాధి
కారిపట్టంబును గట్టికొనియె
భార్త్రీయుఁ డగుసత్తిరాజును బెంచి స
ర్వస్వ మొసంగి వైరాగ్య మెనసెఁ
గాశీరామేశ్వరఖ్యాతపుణ్యస్థలీ
యాత్రలఁ బరమపవిత్రుఁ డయ్యె
నభవచరణాబ్జ సంతతధ్యాన మాక
రందధారాసదన మదభ్రమరితాంత

రంగ విస్మృత సకలబాహ్యప్రపంచుఁ
డయ్యె నారాయణస్వామి యద్భుతముగ. 84

మ. చిరకాలాభిమతంబుగా హృదయరాజీవంబు వీడ్కొని దు
ష్కరపౌత్రాననదర్శనేచ్ఛయు నదృష్టస్ఫూర్తిఁబండన్ వసుం
ధర నన్నింట నవాప్తకాముఁడగుచున్ నారాయణస్వామి శం
కరసాన్నిధ్యముఁ జేరె నిర్మలమనస్కత్వంబు దీపింపగన్. 85

గీ. పాంచభౌతికదేహమ్ము వాసి శివుని
పదము గన్న నారాయణస్వామి యిందుఁ
గీర్తిదేహమ్ము నట దివ్యమూర్తిఁ బడసె
నొకటికిని రెండుగడియించుసుకృతి గాన. 86

సీ. తండ్రి నెఱుంగనంతటి బాల్యముననుండి
యెత్తి పెంచినకృపాళూత్తముండు
తనుఁ జూచి యనపత్యతను విస్మరించి స
ర్వస్వ మిచ్చిన ప్రేమరసమయుండు
వ్యవహారదాక్ష్య మన్వక్షరంబుగ దిద్ది
తను మించువానిఁ జేసినఘనుండు
పౌత్రముఖేక్షణావధిగ భీష్ముం డంప
సెజ్జ నున్నటు తపించినస్థవిరుఁడు

కంటికిని ఱెప్పవలెఁ దన్నుఁ గాచుపిన్న
తండ్రి నారాయణస్వామి ధాత్రి వీడి
శివుని జేరఁ దపించియుఁ జిత్తశాంతిఁ
గాంచె శ్రీసత్తిరాజతికష్టముసను. 87

చ. క్రమముగ రంగనాయికకుఁ గల్గిరి రెండును నాల్గు నైదువ
ర్షము లెడగా సుతత్రయ; మసారము సంసృతియంటకున్ విరు
ద్ధముగ ససారమై మదికిఁ దట్టఁ జెలంగెను సత్తిరాజు మో
దమునఁ జతుస్సుతుల్ దశరథక్షితినేతకుఁబోలెఁగల్గుటన్.

మ. తనతల్లిన్ బినతల్లి వేల్పులుగఁ జిత్తంబందు భావించి పూ
జను గావించుచు సత్తిరాజు స్వకులాచారప్రవర్తిష్ణువై
తనయాశ్లేషసుఖంబునన్ గరఁగుచున్ 'దన్వంగి రంగాంబ దా
ల్చెను గర్భం' బని విన్నయాక్షణము దేలించున్ బ్రిజన్
సత్కృతిన్. 89

గీ. ప్రాక్స్మరణిఁ బీఠపురియాసుపతిఁ గుక్కు
టేశుకృప నీసుతుం డుదయించె ననుచు
రంగమాంబాద్వితీయగర్భమున కిడియె
సత్తిరా జల్లకుక్కుటేశ్వరుని పేరు. 90

చ. మఱియును రంగనాయిక కుమారుఁదృతీయుని గాంచెఁబీఠికా
పురినె సుఖాన 'రాఘవుఁడువోలెఁ బునర్వసుతారఁబుట్టెనీ
చిఱుతఁడు వీరభద్రుకృపచే' నని వానిని సత్తిరాజు సం
బరమున 'వీరరాఘవ'సమాఖ్యనొనర్చెఁ దనర్చుప్రేమతోన్.

మ. ఒకయైదేండ్లెడగాఁగ దార్వ్యదము రామోద్యత్కృపన్
రంగనా
యిక దాఁ దాలిచి యేఁగి పీఠపురమందే యేలనాస్వత్రిఁ బు
త్రకుఁ దుర్యున్ గులధుర్యుఁ గాంచఁ బ్రియమారన్
మామపే రంచుఁ బ
ట్టికి నామంబును శ్రీనివాసుఁ డని పెట్టెన్ సత్తిరాజర్షిలిన్.

సీ. వలువంక బలసి రత్నాకరమ్ములు నాల్గు
గమిచి పట్టినరత్నగర్భ యనఁగ
ధర్మాది పూరుషార్థ చతుష్టయావాప్తి
సాగ సొల్కు వైకుంఠనగరి యనఁగ
నందకాద్యాయు ధాస్పంది చతుర్భుజ
మ్ములఁ దేజరిలు హరిమూర్తి యనఁగ
భీమాది చతురను జామేయ రక్షాప్తి
నెసఁగు ధర్మజుని రాజ్యేందిర యన
నాత్మజాతచతుష్కావృతాంక వాళి
యగుచు శ్రీసత్తిరాజునర్ధాంగలక్ష్మి
రంగనాయిక సౌధాంతరమున మోద
వార్ధి నోలాడఁ జూడఁ గన్పండు వగును. 93

క. గణితాగమమున నెంతని
పుణుఁడో శ్రీసత్తిరాడ్విభుఁడు ధనమునఁ గా
కణి యొకటి తీయ నది దశ
గుణ మగు; నది తీసివేఁతకును సూత్రమె గా. 94

చ. వ్యవకలంబునం దొకటి యన్న యెడఁ బదియుండుగాని యెు
ట్లవును దలంప సంకలనమం దొకటే పదిసంఖ్య? యద్భుతం
బు వసుధరెండునూర్లెకరముల్ బినతండ్రి యొసంగ రెండువే
లవుగతి సేసె సంకలనమందు నొకట్లు పదేసి లెక్కగాఁ.

శా. ఏకల్యాణముహూర్తమం దిడెనొ కాసీ పాద మారంగమాం
బాకంజేక్షణ యత్తయింట, నదియే ప్రారంభ మాసత్తిరా

ప్రాకట్యంబునకున్ యశంబునకు హర్మ్యప్రాప్తికిన్ నూతన!
శ్రీకారాప్తికి దీప్తి కౌర! గృహలక్ష్మీరూప యాలే కదా

శా. మాన్యత్తంసుఁడు సత్తిరాజు దొలుతన్ మాగాము ప్రొప్ర
యిటరీ
మాన్యుండయ్యును న‘య్యనాతవర’నామ గ్రామరాజం బనా
మాన్యద్రవ్యం బొసంగి బీరపురసామంతేంద్రునొద్దన్ గొనెన్
‘ధన్యం’ డన్నజనస్తుతుల్ విని ‘జమీందా’ రన్నఖ్యాతిన్
గనెన్. 97

ఉ. శ్రద్ధయు రాజభక్తియు విరాజిల డెబ్బదివేలరూప్యముల్
సిద్ధముసేసి సంచులను జేతులఁ బెట్టెను మొన్న జర్మనీ
యుద్ధమునన్, ధనార్థ మడకొత్తునఁ బడ్డ బ్రిటీషువారి కా
పద్ధతిగా సిరంగుకులపద్మవనార్కుఁడు సత్తిరా జహో! 98

ఉ. ఉండఁగఁ గొంపలేక దివియున్ భువియున్ గనుఁగొంచు బీదలై
యుండు ననాథసంతతుల కుప్పలగుప్తము గ్రామమందుఁదా
మిండులు కట్టుకో స్థలములిచ్చెను; నిచ్చలు ‘సత్తిరాడ్వదా
న్యం డిడినట్టి దీప’ మని యుబ్బున వారతిభక్తి మ్రొక్కఁగొన్

చ. తనసహధర్మచారిణి సదాహరితత్పర రంగనాయికాం
గన జనియించి వర్ధిలిన కాపులపాలెము విష్ణునాలయం
బును శిథిలంబు నుద్ధరణమున్ బచరించెను సత్తిరాజు మున్
దను నొకయింటివానిగ నొనర్చిన యాహరికిన్ గృతజ్ఞుఁడై.

సీ. అత్తవారింటికాఁపురం బాస సేయు
క్షీరవారాశిశయను లక్ష్మీపతిఁ దన

యత్తవారూర నిల్పె జీర్ణాలయము న
వోల్లసనముగ సత్త్రిరా జుద్ధరించి. 101

శా. కట్టించెఁ గద! గౌతమీతటినిప్రాక్తీరంబునన్ లోకస
మ్రాట్టయ్యెఁ మురమళ్లలో వెలసి ప్రేమన్ బ్రోచు వీరేశుసా
ధాట్టచ్ఛాయమునన్ దదీశు నభిషేకాజస్రకళ్యాణవి
భ్రాట్టున్ జేయఁగవచ్చు భక్తులకువిశ్రాంత్యర్థమై సత్రముఁ

శా. శ్రీవీరేశ్వరపాదపద్మ సవిధోర్విన్ బెండ్లిపేరంటముల్
గావింపన్ మును మొక్కుకొన్న జను లక్కార్యంబులై
యిండ్లకున్
బోవన్ రా నపుడందు సత్రమునయందున్ నిల్చుచున్
భోజనం
బై విశ్రాంతిగ సత్త్రిరాజు నుతియిం, త్రానందసాంద్రా
త్ములై. 103

సీ. క్షేత్రమెన్నఁగఁ ద్రిలోకీ పావనీ కర
ణాతివిశ్రుత గౌతమీతటంబు
స్థల మెన్న భక్తమందారాయమాణ వీ
రేశ్వరాలయమున కిరుగు పొరుగు
కృత్యమో భద్రకాళీశాభిషేకార్చ
నాయాత భక్తాశ్రయ ప్రదాన
మాయామ మరయ శతాధికపరిణయా
దికశుభకార్యపూర్తిప్రవీణ
మారచన మెన్న నాప్రళయావినశ్వ
రాతిమసృణ సుధాలేప నాఁచితంబు

సత్త్రరా జుంచుమురమల్ల సత్రిమునకు,
నన్నివిధములఁ బ్రాశస్త్య మమరె నిట్లు. 104

మ. శివరాత్రిఁ దనగోత్రనామములతోఁ జేయించుఁగళ్యాణ ము
త్సవపూర్వం బనువత్సరమ్ము ముద మొప్పన్ భద్రకాళీ యుతుం
డవువీరేశ్వర దేవదేవునకు భక్త్యావిష్టుఁడై సత్త్రరా
జవనిన్ శ్రీమురమల్ల రాజతథరాశన్ మాన్పఁగా శూలికిన్.

గీ. సత్త్రరాట్కృత శివరాత్రిసమయ గాత
మీకలిత శీతసలి లాభిషేకమహిమ
హాలహాలపాన జనిత మహౌష్ణ్యబాధ
యిగిరి సుఖముండు వీరేశ్వ రేశ్వరుండు. 106

గీ. కార్త్తికవేళ నేకలక్షముగ లక్ష
బిల్వదళములు మురమల్ల వీరశంక
రేశుఁ బూజించు సత్త్రరా; జేసుకరుణ
నింకఁ గోట్లకుఁ బడగల నెత్తఁ బోలు. 107

సీ. అన్నవస్త్రము లిచ్చి యాదరించును దిక్కు
లేనివారికి దిక్కు దానె యగుచుఁ
గట్టించి యిచ్చు సుఖంపడ నిండ్లు పం
చలపా లయినబీదజనులఁ బిలిచి
దోలిపెట్టును బాఁడియాలమందలఁ దల్లి
పాలు చాలనిచంటిపాపలకును,
నెలకొల్పుఁ బాఠశాలలను విద్యాపిపా
సాయస్త ధనవిహీనార్భకులకుఁ

గాని కానిగ ధనము లక్షలుగ గడన
సేసి తగువేళ వర్షించుఁ జిత్తజల్లు
స్వాతివానగ సౌజన్యశాలి సత్తి
రాజు సతతము ప్రేరింప రంగమాంబ. 108

చ. మితము ఋతంబు నొప్పలు, కమేయదయామయ మానసం, బుదం
చితకులధర్మలోల మగుశీల, మనావిల మాయశం, బనా
దృతపరకీయ మాచరిత మెట్లలవడ్డవొ సత్తిరాజస
న్మతి, కవి జన్మసిద్ధము లనం దగుఁ గాకిపుడౌనె నేర్వఁగన్.

సీ. సంపూర్ణసామంతసంపత్తి గలిగియు
గర్వ మించుక యెఱుంగకయ మసలు,
జనులెల్లఁ దనవశంబున నున్నఁ బరవిత్త
పరకాంతలకు నాసపడఁ డొకింత
లక్షాధిపతి యయ్యు దాక్షిణ్య మెడయక
దీనజనావనదీక్ష విడువఁ
డఖిలపురాణగాథాభిజ్ఞుఁ డయ్యుఁ బ్రా
జ్ఞులఁ బిల్చి కొల్చు శిష్యుండువోలె
నావినయ మాజితేంద్రియతానుభావ
మావినిర్మలకృప యాసుధీవిధేయ
తామహిమ సత్తిరాడ్జమీందా రొకనికె
దక్కెఁ గా కెవ్వరికినేనిఁ జిక్కునొక్కొ. 110

ఉ. భావుకసత్తిరాట్కృత తపఃఫల మీసతి యంచుఁ గొందఱున్
బావని రంగనాయిక తపఃఫలమే యితఁ డంచుఁ గొందఱున్

వావిరిఁ జేయువాదములు వ్యర్థము లిర్వురుఁ బూర్వజన్మసం
భావిత తత్పరస్పర తపఃఫలరూపము లంట న్యాయ్య మా.

చ. శమనిధి సత్త్రిరాజనరసత్తము నుత్తమజీవిత ప్రబం
ధమునకు ముఖ్యనాయిక యనర్ఘ దనరారినరంగనాయికా
ప్రమద చరిత్రి కిల్బిషహరం బగు టొక్కటెకా దగణ్యపు
ణ్యము నొనగూర్చుఁ గాన హృదయం బలరన్ దలపోయ
నొఁగదే. 112

గీ. అవనితలగత ధనపతి ఖ్యాతుఁ డౌసి
రంగువంశాబ్ధిశశి సత్త్రిరాజుభాగ్య
దేవత యనంగఁ దనరె సతీవతంస
మైనశ్రీరంగనాయికాజ్ఞాయితాక్షి. 113

శా. ప్రాసాదోపరిసీమ నుజ్జ్వల సువర్ణస్ఫార డోలాంతరా
శాసన్నస్వపన స్తనంధయ తనూజాహ్లాద కాందోళ నో
ల్లాసోపేతము సత్త్రిరాడ్యశము జోలల్ వాడు రంగాంబ యా
శాసీమంతవతీతతిక్రియ వయస్యాబృందగానమ్మొకోన్. 114

శా. రామారత్నము రంగనాయిక విచిత్రప్రక్రియన్ రామస
న్నామోచ్చారణకోటిదీక్ష సలిపెన్ మానీంద్రులున్
దక్రియన్
సామాన్యంబుగఁ జేయలే రనిన నాశ్చర్యంబు కా, దామెకా
నామంబం దగపడ్డశక్తి యుమకైనం దోఁచెనో లేదొకో.115

సీ. రామనామ మ్ముచ్చరణముసేయుచు ముక్కు
విఱుగనిబియ్య మొకొక్కగింజ

కుడికేలి బొట్టన నడివ్రేళ్లఁ గాని లెక్క
నవి వ్రాసి యొకకుంచెఁడైన యంత
నుత్తమబ్రాహ్మణు నొకనిఁ బూజించి యా
తండులమ్ము లుదాత్తదక్షిణాక
మర్పించి యల్లబియ్యమున వండినపాయ
సము విప్రదత్త మాసక్తిఁ గొనుచు
నద్ది శ్రీరామునిప్రసాద మనుచుఁ గనుల
కద్దికొని నాఁటి కాయించుకంత దినుచు
నేకదీక్షను రంగనాయికమ నడపు
కొనె వ్రతము రామనామాత్తకోటిసంఖ్య. 116

క. ఎనుబదినాలుగు లక్షలు
మునుమిడి శ్రీరామనామపుంగణనముఁ బూ
ర్తి నొనర్చి రంగనాయిక
పెనిమిటి కెడకాలిత్రుదిసి బెనువ్రణ మొదవెన్. 117

ఆ. రామనామకోటివ్రతమందు లోప మే
దేని సలిపి యుంటి నేమొ యన్చు
భీత యయ్యె రంగమాతన్వి ధృతి నూనె
నాత్మయే ప్రమాణ మనఘులకును. 118

శా. నేనే వీరపతివ్రతామణిన యేనిన్ రామపాదాంబుజ
ధ్యానాధీనన యేని యేయఘము స్వప్నావస్థనేఁ జేయఁబో
నేనిన్ నాపతికాలిపైవ్రణము శాంతిం బొంద కెట్లుండు నం
చానిష్ఠాత్మిక రంగమాంబ గొనె రామాఖ్యావ్రతంబత్తఱిఁ

క. పదియూ ర్లక్షలు లోపం
బొదవిన యూరాఘువాహ్వయోచ్చారణముక్
దుదముట్ట రంగనాయిక
యొదవింపఁగఁ బతికి స్వాస్థ్య మొనఁగూడె నహా! 120

సీ. తనపతివత్నీనుతం బౌనలోకసా
మాన్యపాతివ్రత్య మహిమముననొ
తనయజపోచ్చారిత శ్రీలరామనా
మప్రాప్తనిరుపమ మహిమముననొ
తనివారఁ బంచి పెట్టినపసుపుం గుంకు
మయు ఘటించినపుణ్యమహిమముననొ
ధనధాన్యములు నిత్యమును దరిద్రులకు సం
బంధుల కిడుధర్మ మహిమముననొ
రంగమాంబిక సావిత్రిభంగి భర్త
ప్రాణములు నిల్పె యమునితో రణమొనర్చి
యంచు జను లెంచ నాగండ మతకరించి
తనసువాసినీత్వము నిల్పుకొనియెఁ దుదకు. 121

సీ. ఒకపతివ్రత సూర్యుఁ డుదయింపకుండ శా
సించి ప్రాణేశు రక్షించుకొనియె
నొకసాధ్వి యముని నుజ్జూఁత లూఁగించి యా
ర్జిననాథు బ్రదికించు కొనియె మరల
నొకసతి యగ్నిలో నుటికి చల్లార్చి ది
వ్యగ్భమము పుట్టించె భర్తకును గూడ

నాకసుచరిత్రి నాయకుఁ బాయ కాకస
మ్మున జ్యోతిష్యై ధ్రువంబుగను నిల్చె
నేఁడు రంగనాయిక వినిర్జిద్రి రామ
నామకోటితపశ్శక్తి నాథుఁ గాచు
కొని పసుపుఁ గుంకుమము నిల్పుకొనెఁ బతివ్రి
తాశిరోమణి యను శాశ్వతప్రతిష్ఠ. 122

మ. పతి కారోగ్యము గల్గుడున్ నియమ మొప్పన్ రామనామ వ్రతం
బతిభక్తిన్ బరిపూర్తి సేయుసుచరితాలంకృయన్ సత్త్రిరా
ట్సతి రంగాంబిక సన్నుతింతు జనముల్ సంతృప్తిగా పడ్రి నాం
చితశాల్యన్నము లారగించి ప్రమదశ్రీ మించుచున్ దీవ్రిం చున్. 123

క. ఈదృశ పురంధ్రి పుణ్యమె
నాఁ దగిశివరామసూర్యనారాయణుఁ డా
పాదించె జనకులకె కా
దేదెసఁ గలబంధులకు మహీయః ప్రీతిన్. 124

సీ. వరసిరంగుకులామ్రతరురాజము చిగిర్చె
నట్టి యాదిమపల్లవాంకురంబు
గారాముతోఁ దాత నారాయణస్వామి
తొడ యెక్కి మనిన ముద్దులమనుమఁడు
వంశవృద్ధికినై తపస్వి యాసత్త్రిరా
జజమీనుదారు వాంఛలఫలంబు

పతిదేవతావతంసిత రంగనాయికాం
బాకరోద్భూత హీరాంకురంబు
పేర్వడినరోళ్ల వా రింటి పెండ్లికొడుకు
కృష్ణవేణీ మనోహరుం డిద్ధగుణుఁడు
హరి శివరామసూర్యనారాయణాభి
ధానుఁ డయ్యును 'దొరలబా' బైనవాఁడు. 125

క. శ్రీమత్సిరంగుకుల శివ
రాము పదాబ్జములు గడిగి రహిఁ గన్య నిడం
గా మెఱసె రోళ్ల సీతా
రామయనాయండు తరతరాలు తరింపక. 126

ఉ. పాయక పాఠశాల సులభంబుగ నాంగ్లము నేర్చుకొం చుపా
ధ్యాయులు మెచ్చ 'స్కూల్ ఫయిన' లొచుఁ గలార్థిగ నై
పఠించు 'యఫ్ఫే' యనుకక్ష దీక్షఁ ద్యజియింపక యాశివరామసూర్యనా
రాయణుఁ డాత్మజాద్వితయ మంకము నెక్కి యలంకరింపఁ గన్. 127

గీ. అమ్మ! రూపవతీ! ర మ్మటంచుఁ బెద్ద
కూఁతు నెత్తుకో, రెండవకూఁతు రడ్డు
రాఁగ నగు చెత్తుకొను శివరాముఁ డమ్మ
గారె' యని రంగనాయికక్ గడమచంక. 128

గీ. రంగమాంబాద్వితీయపుత్త్రికుఁడు కుక్కు
టేశ్వరుఁడు తల్లిదండ్రుల కింపు గుల్క

సేవ సలుపుచు విద్య లార్జించుకొనుచు
విదియచందురుశేవ నభ్యుదయ మొందు. 129

చ. చతురుఁడు పోలిసెట్టికులసంజనితుం డగుస్వామినాయఁడు
న్నతవిభవుల్ సిరంగుకులనందనచందనుఁ గుక్కుటేశు స
త్కృతు లిడి యల్లుఁ జేసికొనియెన్ దనమూఁడవపుత్రి లక్ష్మినా
యతశుభసంపదల్ బరిణయం బొనరించి తరింప వంశజుల్.

గీ. ఆమహాలక్ష్మి యత్తింట నడుగువెట్ట,
శ్రీమహాలక్ష్మి దినదినవృద్ధి యగుటె
కాదు శ్రీరంగనాయికాకాంక్ష దీఱ
గొడు కొదవె సత్తిరాజుపే రిడుకొనంగ. 131

చ. జనకుఁడు సత్తిరాజు మది సంబర మొందును వీరరాఘవుం
డనెడుతృతీయపుత్రుఁ డనయంబు నిజాంకము వాయ 'కద్దియే'
మని 'యిది యేమి' యంచు వినయంబున వేసెడిప్రశ్నకోటి క
ల్ల నగుచు నుత్తరం బిడఁ గలంగు నసాధ్యుఁడ' వంచు మెచ్చుచున్. 132

క. 'కొడుకుల ముగ్వురఁ గొంచెం
బెడగాఁ గనురంగమాంబ కిటు కా న్పయి దేం
ట్లెడ మయ్యె' ననుకొనుతఱిం
గడగొట్టుసుతుండు కడుపునఁ బడె సువిధిన్. 133

ఉ. కానక కన్నతుట్టతుదికా న్పగుటన్ దనతండ్రిపేరితో
మానితుఁ డౌట నాల్గవకుమారుని గారవు శ్రీనివాసు న

మ్మానిని రంగమాంబ యొకమాఱొడి డింపక తద్వియుగ్ధచే
ష్టానిపుణోక్తులన్ గరఁగ నౌర! కలంగును బ్రొద్దుచాలమిన్

ఆ. కన్నసుతులు పెంచుకొన్నసుతుండు నై
దుగుఱు పసితనంపు దుడుకుఁదనము
చూప రంగమాంబ చూచుచు మదిఁ బొంగుఁ
గాని పలుకదింత కటువుపలుకు. 135

చ. నలుగురుపుత్రు లిట్లు జననం బయినందుల కాఁడుతోఁడుగాఁ
గలిగినచోఁ గుమారిక యొక ర్తయినన్ మదిఁగోర్కె-లీఱు నం
చలమిన రంగనాయికహృదంతరచింత తొలంగెఁ గన్నకూఁ
తుల మఱపింపఁ జాలినవధూయుగ మింటను గాలువెట్టఁగన్

క. కోడండ్రు ముద్దుమనుమలఁ
గూడి సుతులు రంగమాంబకుం బతి కా
నేడ్రింప ముదము-సంపద
తోడఁ గుటుంబమ్ము దోసతోఁటగఁ దనరున్. 137

సీ. ప్రాణేశునానుకూల్యము గాంచియు సభక్తి
సేవించుఁ బాదదాసీవిధాన
'కోడంట్రు' మను మాటకును దావు లేక స్ను
షాద్వయి మాతృవత్సలత నేలు
నెఱిఁగి య త్తింటి పుట్టింటి సంబంధుల
మన్నించు మర్యాద చెన్ను మీఱఁ
దన యనిదంపూర్వఘనతకు గర్వింప
కనదల బిడ్డల ట్లాదరించు

నన్నవస్త్రమ్ము లిడుఁ దత్తదర్థితతికి
రామనామ ముపాస్యమంత్రముగఁ గొల్చు
నవిరతము 'భక్తవిజయ' మత్యాస్థఁ జదువుఁ
బుణ్యచారిత్రి రంగమాంభోజనేత్రి. 138

ఉ. భూరి హిరణ్యరాసులు, పరిభూత మణీ తపనీయ హార్యాలం
కారము, లాణిపూస లనఁగాఁ దగుసంతతులున్, ససస్యకే
దారములున్,బయస్యసముదంచితగేహము,లొప్ప గొప్పసం
సారము నేలు నాథుకనుసన్నల రంగమ తాన 'రాజ్ఞి' నాన్

గీ. కాంచ నన్నింట నుత్కృష్టైకతరకోటి
కెక్కిన సిరంగురంగనాయిక సమస్త
భాగ్యములు గాంచ నేమి లాభం బనంగ
రక్తస్రుంబోటువ్యాధి తీవ్రతకు లోఁగె. 140

ఉ. 'రక్తపుఁబోటురోగము దురంత మసాధ్య' మటం చిటన్ భిష
క్పూర్తి నెఱింగి చెన్నపురి సుప్రథితాంగ్ల భిషక్చికిత్స కా
సక్తని జేరి యందు నుపశాంతి యొకింతయుఁ గాంచ లేక ని
ర్ముక్తతదాశయై స్వగృహమున్ వెస రంగమ చేరె వేసటన్

క. చిరముగఁ బరివారముతో
నురువిభవముతో వసించి యున్నను రోగాం
కుర ముంటఁ జెన్నపురి కాఁ
పుర మారంగాంబ కెలమి పుట్టింప దయో. 142

ఉ. ము న్నొకమాటు మేన రుజ పుట్టఁగఁ జెన్నపురిన్ జికిత్సకై
గ్రన్ననఁ జేరి స్వస్థపడి రంగమ యింటికి వచ్చె; గాలివా

న న్నరు లెండటో రయిలునం బడి యమ్మలునాఁడె డింది ర
న్నన్న! యదృష్టవేళ లవ మాపద రాద, తొలంగు వచ్చినన్

గీ. అట్టులే చెన్నపురికి నేఁ డరిగి యటఁ జి
రంబు కాఁపురముండి పేర్గన్న వైద్య
తతి చికిత్సల స్వాస్థ్య మొందద రవంత
నాఁటిదైవము వకిరించె నోటు నేఁడు. 144

ఉ. అట్టియసాధ్యరోగజనితార్తి మునింగియు రంగమాంబ యి
ట్టట్టన కేప్రు 'భక్తవిజయం' బనుగ్రంథములోనిసత్కథా
ఘట్టములన్ బఠించుచునె కాలము పుచ్చుఁ గుటుంబబంధ
ముల్
నెట్టి, పరంబునందె మది నిల్పుఁ, బరోపకృతిన్ బ్రవర్తిలున్.

శా. మంచంబందరుజన్ బరుండియుఁ బతిం భావించు జిహ్వాంచలో
దంచన్నామునిరాముఁగాఁ; దదుపచారాదిన్ మనంబుంచి క
న్గొంచున్ లోపము రానటుల్ సుతులతోఁ గోడండ్రితోఁ
జెప్పి చే
యించున్ నేర్పుగ రంగమాంబ; యిఁక ముం దిట్లుండ నో
నన్నటుల్. 146

మ. తనయారోగ్య మనుక్షణంబు క్షయ మొందన్ 'సత్తిరా'
జంచు నా
ధుని పేర్వెట్టినపౌత్రుఁ గోడలిని దోడ్తోఁ జూడ రావించి మ
న్ననిఁ 'రాజా' యనిపిల్చుచున్ నిరుపమానందాబ్ధినోలాడు నా
థునిపేర్నెప్పక చెప్పినట్టు లయి ముద్దుంగూర్పఁగా నేర్పునన్

ఉ. పౌత్రిముఖావలోకనపుభాగ్యముతో నిహలోకసౌఖ్యచా
రిత్రము పూర్తి యైనటు ధరిత్రి స్వమూర్తిని గీర్తి డించి యా
ముత్రికసౌఖ్యసంపదలఁ బొందఁజనెన్ సతి రంగమాంబ-యి
ద్ధాత్రికి క్షీణపుణ్యు, లతిధన్యులు స్వఃపురి, కేఁగ కుందురే ?

ఉ. చెన్నపురంబునుండి యిలు సేరినదాదిగ వచ్చి చూచి యె
న్నెన్ని యౌ మందులిచ్చి యెటులేనియు రంగమప్రాణరక్ష సే
య న్నిరతంబు కష్టపడి నట్టేఁడు డాక్టరుధర్మరా వెదన్
ఖిన్నత నొందె, నెట్లు వెలిఁగించును దైలములేని వత్తినిన్.

ఉ. ఇంచుక లోప మొందనటు లెంతయు శ్రద్ధఁ జికిత్సలెన్నో చే
యించితి, దేవు నమ్మి భజియించితి, దృష్ట మదృష్ట మేకమై
పంచెను రంగనాయిక దివంబున కాయువు లేని దాట ఛే
దించి ఋణానుబంధ మని ధీరతఁ గాంచెను సత్తిరా జటో.

సీ. వినునొకో నాశోకమును. బ్రాణనాయిక
దేహ మిచ్చట డించి దివికిఁ జనియు
వినును బో వెనువెంట వెనుకకు వచ్చునే
నాయెడఁ దన కెంత కాయు వున్న
గలుగునే యుత్తమగతి నాసతి కొకింత
విడుచు నాకన్నీటి యుడుకునదులఁ
బొందఁ గల్గునె నన్ను ముందుజన్మమునందు
నైన శ్రీదేవిలో నైక్య మొంది

నాబహిఃప్రాణ మగురంగనాయిక కెటు
చూపుదుఁ గృతజ్ఞత నటంచు నాపెపేర
సంస్థ లెన్నియొ నెలకొల్పు సత్త్రిరాజు
తనకు నాపెకుఁ దరణసాధనములుగను. 151

సీ. తనవిత్త మొసఁగి భీమనపల్లిహైస్కూలు
రంగనాయికమపేర నెలకొల్పె
గొల్లవిల్లిని హాయిస్కూలుంప నామెపే
రన రెండువేలు సొమ్మును నొసంగె
నాసాధ్వీచారిత్రి కద్దమ్ముగాఁ బతి
వ్రతకథఁ గృతిగొన మతిఁ దలంచె
నాత్మ సంకల్పించె నంగనావైద్యాల
యము నెలకొల్ప నాయతివ పేర
వట్టిమాటలఁ గాక భావస్థిరాను
రాగ మంతయుఁ గ్రియలందుఁ బ్రకటితముగఁ
దత్సతీస్మారకముగ సంస్థల ఫలాభి
సంధిరహితము స్థాపించు సత్త్రిరాజు. 152

మ. తనవంశోద్భవు లెవ్వ రొందనిజమీందారీయు శ్రీకారముల్
ధన, కైదారక, ధైను, కౌక్షక పరీత ప్రాజ్యసంపత్తి వా
వానరా జాశ్మనధాన్యకోష్ఠతతులుల్ హర్మ్యంబులుల్
గేహముల్
గని భాసిల్లును సత్త్రిరాజు భువనాలంకారసంతానుఁడై. 153

ఉ. పావనశీలుఁ డార్త జనపాలుఁడు వాఙ్మయఖేలుఁ డార్జవ
శ్రీవరణీయుఁ డుత్తమకృషిప్రవణాత్ముఁ డజస్రరంగమాం

బావరవర్ణినీసుగుణభావితచిత్తుఁడు సత్తిరాజు పు
త్రావృతుఁడై విరాజిలు నిత్యోఽధిక వైభవకీర్తిశాలియై.

క. ఏతాదృశసుచరిత్రో
పేతునకు సిరంగువంశపృథులీకరణ
ఖ్యాతచతుస్సుతహేతుసు
జాతున కనవద్యకీర్తిసమవేతునకున్. 155

క. దక్షునకుఁ జరణపతితవి
పక్షునకున్ దీనసమితిఫాలస్థలభా
గ్యాక్షరసిసృక్షునదయక
టాక్షునకున్ రంగనాయికాధ్యక్షునకున్. 156

క. ముఖ్యున కవిరళలక్ష్మీ
సఖ్యునకు జనోపయోగిశాశ్వతదానా
భిఖ్యునకు విభవశక్ర
ప్రఖ్యున కరుణార్చనాత్తఫలసౌఖ్యునకున్. 157

క. అన్యాయ్యకార్యభీరున
కన్యసతీసోదరున కనన్యాదృశసా
జన్యాగారున కరిదా
ర్జన్యాపాకరణనిపుణసంచారునకున్. 158

క. ధీరునకు సూరిజనమం
దారునకు నుదారకీర్తిధవళితదశది
గ్వారున కంభోనిధిగం
భీరునకున్ సత్తిరాడ్జమీందారునకున్. 159

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచితం బూనినమదాలసా విలాసం బనుప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన :—

తొల్లి నిజజనకుం డగుభార్గవుం డనువిప్రునకు జడుం డని యభిహితుం డగుపరమవిజ్ఞాని సకలసృష్టిక్రమంబు దెలుపుచుఁ బ్రసంగవశంబునఁ 'దండ్రీ! విను'మని మదాలసా మహామహిమంబు నిట్లు చెప్పం దొడంగె.

---

## కథాప్రారంభము.

క. సిరులకుఁ గాఁపురము, ధరా
తరుణీ మణిశేఖరం, బుదంచిత విద్యా
కర, మఖిల భోగనిర్జిత
సురపుర మయి రత్నపురము సొంపెసలారున్. 1

ఉ. క్రిందిరసాతలం బతకరించుచు మీఁదిద్యురాదిలోకముల్
పొందనిసర్వభోగములఁబొందు చజాండముమించి యప్పురం
బెం దుపమాన మొందక మహీపతిచంద్రుఁడు 'శత్రుజిత్తు'నాఁ
గం దనరారుఱేని భుజకాండ సురక్షితమై విరాజిలున్. 2

క. మానధనుఁడు శత్రుజిదా
ఖ్యాననృపతి యేలుకాలమందు క్షితియె స్వ
స్థానముగ సురలు విడిసి ర
మానాధ్వరహవ్యభుక్తి నోరూరంగన్. 3

గీ. వానినామమ్ము రిపువధూవారితగర్భ
పాత నారణ్యకశ్రుతి పాఠ, మాన్య
పాలు నెదిరించి బ్రదికినపాపి లేదు
శరణ మొంది కీ డొందినజనుఁడు లేఁడు. 4

ఉ. ఆనరపాలు పూర్వజననాంతర సంచిత పుణ్యరాశి నా
నూనుఁ డొకండు గల్గె నతిసుందరరూపుఁ డనాథలోకర
క్షానియమాశ్రయంబు జనసమ్మతుఁ డర్థిజనేష్టపూర్తిసం
తానమహామహీజము 'ఋతధ్వజ'నామమునన్ బ్రసిద్ధుఁడై

గీ. ఆర్త జనతావనైకదీక్షాభిరాముఁ
డమితవిక్రమవిజితాఖిలాభియాతి
వినయవిశ్రుతవిద్యావివేకశాలి
యగుచు జనకున కన్నింట నధికుఁ డయ్యె. 6

చ. మతిజితదేవతాగురుఁ డమానుషచారిమ దూరితాశ్వినీ
సుతుఁ డురువిక్రమోదితయశోహసితామరనాయకుం డుదం
చితనిగమాగమార్థ పరిశీలన ధూత చతు ష్షడాననుం,
డతిగవ దాన కేళి నమితామరపాదప, మాతఁ డారయన్.

తే. నగరబాహిరసుందరనందనమున
సరస జలపూరితాంబుజాకరముతటిని
నుల్లసిలుపైఁడిమేడయం దుండు నాన్నృ
పాలసుతుఁ డాప్తమిత్రనపాయి యగుచు. 8

సీ. ఒకనాఁడు రత్నకందుకఖేలనమ్ములు
నొకనాడు సముచితద్యూతకేళి
యొకనాఁడు నిగమచయోక్తి వివేచన
మొకనాఁడు శాస్త్రవాదోద్యమంబు
నొకనాఁడు మధురగానకళావినోదమ్ము
లొకనాఁడు సరసకావ్యోక్తిగోష్ఠి
యొకనాఁడు జవనఘోటకసమారోహణం
బొకనాఁడు రథగజాదికవిహార
మొక్కతఱిఁ జిత్రలేఖనాత్యుత్సుకత్వ
మొక్కపుడు మాలికారచనోత్సవంబు

నడపు సవయఃకుమారగణంబు గూడి
రాసుతుఁడు లోకసంబంధరహితుఁ డగుచు.

వ. అటుల గొంతకాలం బరుగ నొక్కదివసంబున నశ్వతరుం
డను నాగేంద్రుని నందను లిరువురు ధరణీసురకుమారాకా
రంబుల యదృచ్ఛావిహారులై భూలోకంబున కేఁతెంచి యా
ఋతధ్వజునివిద్యావైశారద్యం బరసి ముగ్ధులై స్నిగ్ధనివహం
బులోఁ దాము నొకళ్లై విహరింపఁ గోరి రా నారాకొమ
రుఁడు. 10

ఉ. వారలఁ బూపజవ్వనపుఁబ్రాయమువారల విప్రనందనా
కారుల దర్శనీయతనుకాంతివిహారుల గారవించి భూ
మీరమణాత్మజుండు హితమిత్రగణంబునఁ గూర్చి తేర్చు నా
హార విహార మజ్జన సుమాభరణాంబర చందనాదులన్. 11

శా. తద్వైదుష్య తదీయసూక్ష్మధిషణా తచ్చాటుహాసోక్తి సం
పద్వైదగ్ధ్య తదార్జితాఖిలకళాపారమ్య తత్సేవర
సాద్వ్యాలప్తి విశేషముల్ మదిఁగరంపన్ దత్ఫణీంద్రాత్మజా
తద్వంద్వమ్ము విడండు రాసుతుఁడు తాత్పర్యంబునన్
నిచ్చలున్. 12

క. పవళులు నృపసుతుతో క్షణ
మువలె వినోదములఁ బ్రొద్దువుచ్చి నిశ లథో
భువనమున కరిగి వత్తురు
భువి కహిపతిసుతులు ప్రొద్దుపొడువక మున్నే. 13

సీ. ఎపుడు వత్తురో భోజనం బెపు డొనర్తురో
యెపుడు నిద్రింతురో తండ్రి యెఱుఁగ కటమ

టించి యొకపుడు కొడుకులఁ గాంచి ప్రణయ
రస మసృణ మైనకినుక మీఱంగఁ బలికె. 14

క. మిము నరయ నన్నలార ! చి
రముగ రసాతలమునన్ నిరంతరవిద్యా
శ్రమ ముడిగి స్వైరగతి గా
లము పుచ్చుట బుద్ధిమంతులకుఁ దగు నయ్యా. 15

ఆ. పదను దప్పకుండ వెదవెట్టఁ గేదార
మునను బీజ మంటు మొలచుఁ బెరుఁగు
వయసు ముదురకుండఁ బడయువిద్యలు లేత
బుద్ధి హత్తి పురుషుఁ బుధు నొనర్చు. 16

గీ. అగ్నిఁ బడి కాలి కరఁగి చల్లాఱి సుత్తి
వేటులకు సాఁగి నలఁగి కాదొటు పసిఁడి
భూషణాకృతిఁ గను; నట్లె బుద్ధిమంతుఁ
డేని గురుశిక్షఁ గాదె విజ్ఞాని యౌట. 17

సీ. బహిరింద్రియస్వైరభావముల్ గుదుఁ జేరఁ
జనుముంద యరికట్టుకొనఁగ వలయు
నేకాగ్ర మగునంతరింద్రియస్థితి గురు
భయముచే నధిగమింపంగ వలయు
ద్వంద్వసహిష్ణుతాదర్శిమమ్ము గురుకుల
వాసశ్రమమునఁ జేపట్ట వలయుఁ
దెలివి మించ గురూపదిష్ట మాలించి య
ల్లన మనన మొనర్చుకొనఁగ వలయు

ధారణయుఁ జింతన మ్మవధాన మొదవఁ
దన్మయత గల్గ వలయు విద్యల గడింప
చదు వనఁగ శారదాకటాక్షపరిసార
ఫలక మగుదుష్కరోగ్రతపంబు గాదె. 18

చ. ఈయెలప్రాయమెల్ల నటునిట్టు వినోదములన్ భ్రమించుచున్
నాయతి యెల్ల నంధతమసావృతమై చెడు, మీకు నిట్టివై
ధేయత యెట్లు కల్గె? వలదే తలిదండ్రులమాట చొప్పునన్
జేయుట పిన్నవారి ? కిఁక నేనిఁ గనుంగవ విచ్చి కాంచుఁడా.

ఉ. ఎల్లపు డేరికై యెచటి కేఁగుదు రెవ్వరిసౌహృదంబు మీ
యుల్లము కొల్లలాడెఁ జదు వొల్లమి సేయుట చెల్లునే? వయ
స్సెల్ల వినోదరీతి గతియింపఁగ విద్యలు బుద్ధి కబ్బుటల్
కల్ల గదా! వృథా చనినకాల మిఁకన్ గనరానిదే కదా

క. అనునశ్వతరునిపలుకుల
కును గడగడ వడకిఁ పాఁపకొమరులు వినయం
బునఁ దత్పదముల కెఱఁగుచుఁ
వినిపించిరి తాము గానిపింపనిగాథన్. 21

గీ. ఔరగకులేంద్ర! విద్యావిహారబుద్ధి
భూతలమ్మున కొకనాఁడు పోయి నార
మెన్ని పురములొ గనినార మెన్నఁదగిన
దందు రత్నపురం బనునట్టి దొకటె. 22

సీ. ఆకోట లరయ బ్రహ్మాండంబు గబళించి
నిలిచినపగిదిఁ గాన్పించుచుండు

నాకందకము లధోలోకవాసులకు నా
కాశగంగాఝురీకల్పము లగు
నారాజవీథు లాయామమ్ము పరిణాహ
మమర సూత్రింపట్టినట్లు దోఁచు
నావిపణుల నలభ్యం బగువస్తు వేఁ
కెందుఁ జిక్కఁదు వెల యెంత యిడినఁ
దమతమ కులానుగతికధర్మములు విడక
నరులు నారులు సుఖజీవనమునఁ బుత్రి
పౌత్రియుతులై దలిర్ప నప్పట్టనంబు
వరలు వాగింద్రిరైకాధికరణ మగుచు. 23

ఉ. ఆపురి రాజధానిగ యథార్థసమాహ్వయుఁ డైనశత్రుజి
ద్భూపతి యేలు సాగరచతుష్టయవేష్టితవిశ్వధాత్రి బా
హాపటిమోద్ధతాహితమదాంధ్య నికృంతన పూర్వక ప్రజా
గోపన జాగరూక మతిగూఢ విరాగకళా విలాసుఁడై. 24

సీ. కన్ను క న్నట్లుండఁ గనుపాపనే తీయు
నీటిలోపలిజాడ నేని దెలియు
నీచెవిఁ జెప్పిన దాచెవి నెఱుగనీఁ
డావులించినమాత్రఁ బ్రేవు లెన్ను
నిద్రించుఁ బగఱగుండెలలో నజస్రమ్ము
నెలమి వీఁ పొగ్గు ఱా యెగుర నైచి
గాలినేనియు నాజ్ఞఁ గదలకుండ నొనర్చుఁ
గొండనైనను బిండిగొట్ట నేర్చు

సర్వతంత్రస్వతంత్రుఁ డాశతుర్జిన్మ
హీపవరుఁ డపర్తీపపర్తాపుఁ డయి యు
మాత్యమండలి నృపచిహ్నమాత్ర మొప్ప
నుర్విఁ బాలించుచుండు బ్రహోన్నత్తరముగ. 25

గీ. ఆమహారాజు భూతధాత్ర్యమరరాజు
కనె బుతధ్వజనామనందనుని సుగుణ
ఖనిని నిజధర్మపత్నియందున పితౄణ
భరవిమోచన కరణ తత్పర మనీష. 26

క. ఆనిసుఁగు వర్ధమానక
ళానిధియై పెరిఁగి గురుకులస్థితుఁడై నా
నానిగమాగమ సకలక
ళా నిపుణతఁ గాంచె నిస్తులం బగుశ్రద్ధన్. 27

ఉ. మారునితీరు గేకుసుకుమారతనూరుచి మేఱమీఱఁ గౌ
మారముదాఁటునాఁటికె కుమారనృపాలుఁడు వేదశాస్త్రవి
ద్యారుచిమత్కళావళులయందుఁ బఠింపని నేర్చుకొని నీ
హారలవంబు లేదఁట యహా యతఁ డెంతటిబుద్ధిశాలియో.

సీ. వలె నన్నఁ బులిమీసముల నేని మెలివెట్టి
నుయ్యాల లూఁగఁగా నోపువాఁడు
అగ్ని నొక్కడుగు నొక్కడుగు చందనమునఁ
బెట్టి న్యాయము తీర్చునట్టివాఁడు
అస్థిలోపల మజ్జ నంటి ప్రాణం బున్న
నాజి వెన్నీని శౌర్యంబువాఁడు

కొండ విఱిఁగి మీఁదఁ గూలుచున్నఁ దొలంగ
నట్టి యహార్యధైర్యంబువాఁడు
అర్థిజన కల్పకంబు, దయాంబురాశి
సత్యసంగరుఁ, డన్యాయకృత్య భీరుఁ
డార్జవాధారయష్టి, విద్యావ్యసనుఁడు
పరసతీ సోదరుం, డానృపతిసుతుండు. 29

చ. అమలవిహారుఁ డానతనియండ వసింప దివా నిశా విభా
గ మెఱుఁగరానిమైక మెదొ క్రమ్మినయట్లగు; రేలుతద్వియో
గమున రసాతలంబు నరకం బగుఁ దత్కథికోపచారవా
క్యములకు మామనంబు లవశాకృతిఁ దద్వశవర్తులై చనున్.

—♦ అశ్వతరుఁడు ఋతధ్వజుని శ్లాఘించుట. ♦—

ఉ. నాఁపుడుఁ బన్నగేంద్రుఁడు మనంబున మున్ గనునల్క యం
తయున్
బోవుటె కాక కౌతుకము మోదము నుత్కటమై జనింపఁ ద
ద్భావరసూను సద్గుణసముచ్చయ సీవన చిత్రితాంతరం
గావిలుఁడై, వచించుఁ దనయద్వయమున్ గవుఁగింటఁ గూ
ర్చుచున్. 31

ఉ. ధన్యులు మీరు, మీకతన ధన్యుఁడ నైతిని నే నలోకసా
మాన్యగుణప్రతానమహిమప్రథమాన నరేంద్రసూను సౌ
జన్యము గన్న మిమ్ముఁ గనఁజాలుట; దీనికి నేమి గాని యా
మాన్యుని గన్న ధన్యజనమాన్యుల దెంతటిపుణ్యమో కదా!

క. మిముబోంటి సుగుణులు పరో
క్షమునం దే పుణ్యశాలి సత్సుతు గుణబ్బం

దము నిటు కీర్తింతురొ యు
త్తముఁ డగునానందనుండె ధన్యుం డరయన్. 33

గీ. శాస్త్రవిదు నెడ శీలంబు సంశయము; సు
శీలు నెడ మూర్ఖభావమ్ము సిద్ధఘట్ట
మమరు నెవనికి శాస్త్రశీలములు సమత
ధన్యతరుఁ డాతఁ డండ్రు విద్వాంసు లెల్ల. 34

క. మిత్రము లెవ్వనిచెలిమి న
మిత్రు లెవనిబలిమికలిమి మెత్తురొ సత మా
పుత్రునిచేఁ గాదె వినుతి
పాత్రుఁ డగుం దండ్రి పుత్రవంతుం డనఁగన్. 35

వ. అది య ట్లుండె.

చ. అనవరతోపకారి యగునాన్నృపసూతి కభీష్ట మించుకై
న నొసఁగినారె మీరలు మనంబలరన్ సుతులార! యర్థులన్
దనుపఁగ-మిత్రువాంఛితమెదన్ దలపోసి ఘటింప-వెన్నుసూ
పనియతఁడే సుజన్ముఁ డని వానిదె జీవిత మంచు నెంచుఁడా.

క. హిత మొనరించెడిసఖునకుఁ
బ్రతిరూప మొనర్ప నట్టిపాపిని జీవ
న్మృతుఁ డన-నట్టిసఖున కప
కృతిఁ దలఁచెడుదుర్మతిని స్మరింపఁగ నగునే? 37

గీ. మిత్రములయెడ నుపకృతి శత్రులయెడ
నపకృతిని సజ్జనాంబుద మరసి కురియుఁ
బ్రాజ్ఞ లాపూరుషుని యనారత మహోద
యమ్ముఁ ద్రికరణశుద్ధిమై నభిలషింత్రు. 38

చ. అను జనకుఁ డనూజు లని రన్నిటఁ దాఁ గృతకృత్యుఁ డైనయా
యన కెది గూర్తు? మాతఁ డఖిలార్థులఁ దృప్తులఁ జేయ
కంపఁ డా
యనసుతు నింట నున్న మణి హేమమహాసన చేల యాన వా
హనములు లే,వహీంద్రజగమందు నె కాదు మహేజగంబునన్.

ఆ. అతని కున్న యుచ్చ మైన విజ్ఞానమ్ము
గాంచఁ డన్యులందుఁ; గడఁగి ప్రాజ్ఞ
జనుల కేసి సర్వసందేహములు వాపి
చక్కఁ దిద్దఁ జాలు జ్ఞానశాలి. 40

చ. కల దొకదుర్లభం బయినకాంక్షిత మానృపపట్టికిన్ వ్యథా
కులిత మనోఽతిజీర్ణగృహ కోణమునం, దది పూర్తి సేయఁ బో
వలఁతులు పద్మగర్భ మురవైరి గిరీశులు మాత్రమే; తద
న్యుల కది దుష్కర మ్మగుట యొక్కటె కాదు దురూహ
మున్ జుమీ. 41

వ. అనుటయు నశ్వతరుం డి ట్లను.

గీ. అయిన వినఁ గోరెద నసాధ్య మగును సాధ్య
మగును గాక వచింపుఁడా యతనికోర్కి
బుద్ధియును శ్రద్ధయును గల్గుపూరుషున క
సాధ్య ముందునె పదునాల్గు జగములందు. 42

మ. అమరత్వం బమరాధిపత్య, మమరాభ్యర్చ్యత్వమున్
గాంచ లే
దె మనుష్యుల్! దృఢదీక్ష నెల్లదియుసిద్ధించున్ దురాపం,బగ

మ్యము దుర్జ్ఞాన మటంచి హమ్మున దివంబం దైనను న్నే? దృఢో
ద్యములై సంయతచిత్తవృత్తు లగుమర్త్యశ్రేణి కూహింప
గాఁగన్. 43

చ. అరిగెడిచీమ యోజనసహస్రము వోవుఁ గ్రమక్రమంబుగా
నరుగఁడయేని యొక్కయడు గైన ఖగేంద్రుఁడు నేఁగఁ
జాలఁ; డు
ర్వ్యర యెట? నాకసం బెట? ధరాగతుఁ డయ్యు ధ్రువుండు
జ్యోతిరు
త్కరముల దాటి యంబరశిఖ ధ్రువ మౌపద మొందఁడే
ధృతిన్. 44

గీ. అంచు నాచేయ నగునసాధ్యంపుఁగార్య
మొలుక సేయుం డనిన యశ్వతరుని కొడు
ముని ఋతధ్వజుహితులచే వినినచరిత
కొడుకు లమృతం బొలుకఁ జెప్పఁ దొడఁగి రిట్లు. 45

వ. దేవా! యవధరింపుము. రత్నపురంబున వసించి శత్రుజిత్తు
సకలసద్గుణరాశియై, పుత్రవంతుండై యుండు నని చెప్పితిమి
గదా! 46

—◆ గాలవమహర్షి కువలయాశ్వమును దెచ్చుట. ◆—

శా. ప్రత్యర్థిక్షితిభృత్త్కశత్రి గళసూత్రవ్రాత విచ్ఛేదలీ
లాత్యుత్సాహ కృపాణ భూషితభుజాయత్తారిసీమాత్త వి
త్త త్యాగాచరి తాధ్వరప్రచయ నిత్యప్రీత శక్రాది కా
దిత్యస్తుత్య యశోభిరాముఁ డయి తత్పృథ్వీశుఁ డింపొందెడిన్

చ. అతఁ డొకనాఁడు నిండుకొలువై సచివుల్ బుధపుంగవుల్ నయాం
చితగతి శాస్త్రరీతుల వచింపఁ బ్రజావివిధాభియోగముల్
చతురతఁ దీర్చుచుండ; రభసంబు మెయిన్ బ్రతిహారి సేరి యా
నతుఁడయి యిట్లువల్కు జననాయకుతో భయభక్తు లేర్పడన్.

క. దేవా! గాలవముని యఁట
దేవరదర్శనమునకు నదే మోసలకున్
దా వచ్చి నిల్చినాఁడు మ
హావాజి యొకండు వెంటనంటి యరుగుదేన్. 50

శా. బాహాత్సేధము గల్గి నాల్గడుగు లెప్పన్ క్షితిన్ మోవనీ
కోహో మంగళదివ్యలక్షణచయాభ్యుల్లాసియై దేవతా
వాహంబున్ హరిదశ్వు నశ్వముల నవ్వాఁజాలి రంజిల్లు నా
వాహోత్తంసము గాంచితిఁ జవలెఁ జెప్పన్ శక్యమే భూవరా!

ఆ. ఏడుగుఱ్ఱములను నేకాకృతి నొనర్చి
భువికి డిగిన యుదయరవి యనంగ
నమ్మహర్షి దుస్సహబ్రహ్మవర్చసుం
డగుచుఁ దోఁచె నమ్మహాశ్వయుక్తి. 52

మ. అనుడున్ బార్థివుఁ డర్ఘ్యపాద్యముల హస్తాబ్జద్వయిన్ బూని, వె
న్నైన నర్హోల్వణలంబు, శీఘ్రగతిఁ బెక్కుల్ కక్ష్యలన్ దాఁటి,య
శ్వనిగాళంబున హస్తమూఁది యుదయత్సప్తాశ్వుఁడట్లున్న య
మ్మునిపాదంబులు మాళి సోఁక నతుఁడై పూజించె నర్హక్రి
యన్. 52

క. స్వారాజగస్త్యునింబలె
నారాజటు లుపచరింప; నాఋషిపాదాం
భోరుహ రాగములు పరి
వారము శిరసావహించె వరుస నెఱుఁగుచుర్. 53

గీ. పూజలు యథావిధి నొనర్చి రాజపూాళి
వేదసూక్తులఁ దన్ను దీవించుపూనిఁ
దానె మార్గము సూపు చాస్థానచత్వ
రమ్మునకుఁ దెచ్చె నశ్వరాజమ్ము గోడ. 54

క. ఖాణము గడ్డి జలము కం
ఖాణమునకు నిడఁగఁ బనిచి కరిచ్చుఁ దపసిర్
క్షోణిపతి నిలిపె సదమున
రాణించుమణీమనోహరం బగు గద్దెర్. 55

గీ. నిలిపి యటు చామరగ్రాహిణీకరంబు
నుండి వింజామరము గొని యండ నిలిచి
స్వయముగా వీచు చాసభాసదులు గూరు
చున్న యప్పాట నృపుఁ డిట్లు విన్నవించె. 56

చ. అనుకొన కుండ దేవర తమంతన నన్నుఁబవిత్రుఁ జేయఁ బ్రీ
తిని జను దెంచు టెంచఁగ మదీయమహాసుకృతానఁగా దె! పా
వన భవదాశ్రమస్థలికి భద్రమె ? మీతప మంతరాయముర్
గనదు గదయ్య? శిష్యులెసకంబుగ నేర్తురె వేదశాస్త్రముల్?

ఉ. సర్వసుఖంబులర్ విడిచి సంతతమాత్మము నాత్మఁజేర్చి, గం
ధర్వపురమ్ముగా జగ మెదర్ దలపోయుమహాత్ములైన మీ

కర్వ మి దెట్లు చేపడె? నహర్నిశ మీాతగులంబుతో మనః
పూర్వక మాతపంబు చెడఁబోలు నటం చన జంకెదన్ బ్రభూ!

గీ. ఏదియో కారణము లేనిదే తపంబు
విడిచి యీహాయమును గొంచుఁ బ్రేమమీాఱ
మాదృశులఁ జూడరారు భవాదృశు లని
తలఁతు శాసింపుఁడేమి నావలన వలయు. 59

చ. అని కరణత్రియంబు వినయామృతసిక్తముగా వచించున
జ్జనపతిఁగూరుచుండఁ గరసంజ్ఞ నొనర్చుచు మౌని యాసభా
జనము దదేకదృష్టి విన క్ష్మాపతివైపున నిల్పి చూపులన్
దనకథయున్ దురంగచరితంబునిటుల్ వినిపించె నొయ్యనన్

చ. విను మవధాన మూని పృథివీవర! యీతురగంబుపై వయా
ళిని నొనరింతునా? యతిమలీమసకృత్యుల దైత్యులన్ రణా
వని హయ మెక్కియేఁగి కెడపం గలనా? యదసీయలబ్ధికిన్
గనిన మహాపదం దెలుపఁగా సకలంబును నీక తెల్లమా. 61

—♦ గాలవమహాముని పాతాళకేతుని దుండగములు దెలుపుట. ♦—

క. పాతాళకేతుఁ డన నొక
దైతేయుఁడు శాంబరీవిధానమునఁ దపో
ఘాతుకుఁడై తాపస సం
ఘాతమునకుఁ గాలిముల్లు కరణిన్ మెలఁగున్. 63

సీ. ఘోరమత్తద్విపాకారుఁడై యొకపు డా
శ్రమభూజపాళి ధ్వంసం బొనర్చు
గర్భనిర్భేదంబుగా బొబ్బరించు చొ
క్కపుడు బెబ్బులి యయి యార్తిఁ గూర్చు

నొకనాఁడు హారిణమై యొద్దఁ జేరుతపస్వి
కన్యల గగ్గోలుగా హరించు
నలినలి సేయు వానరరూపుఁడై యొక
ప్డజిన కాషాయ దండాదికములఁ
దఱచు ఘోరవరాహమై నిరతిశయ స
మాధిసుఖ నిష్ఠు లైన సంయమివతంస
ములను బీడించుఁ గామరూపుం డగుటను
వానికృత్యంబు లరిది చెప్పంగ రాజ ! 63

క. తిట్టితిమా తిమ్మితిమా ?
నట్టడవుల నాకు నలము నమలుచుఁ గాలం
బెట్టెటొ గడపెదుమే మా
కట్టిఁడి కేకీడు సేయఁగలమో చెప్పుమా. 64

వ. అంతియ కాదు వింటివే యీ విపరీతంబు !

మ. మద మొయ్యారము టెక్కు నీటు మురువుం బైపై విజృంభింప నె
మ్మదిగా నవ్వుచుఁ బైఁట జార్చి యుదుటుం బాలిండ్లఁ గుల్కించుచున్
బదియాఱేఁడుల నిండుజవ్వనపుఁగాంతారూపముం దాల్చి యు
మ్మదముల్ వుట్టఁ గలంచు మానులఁ; దపో మానాదికిన్ హానిగా. 65

సీ. కులుకునెన్నడల ముంగల దోఁచి యొకమానిఁ
గౌఁగిలించి యలంచి కన్దొఱంగు

మీలితాక్షుం డయి మెదలనియొకఋషి
మోము ముద్దిడి ధ్యానమును మరల్చు
నదటున డాసి సంయమి నొక్కని నఖక్ష
తమున నుల్కించి వెన్నవులఁ జేయు
నాటపాటలతోడ నండఁ జేరి కరంచి
యొకమునిమనసు నుఱ్ఱూఁత లూఁచు
మరుకతలఁ ద్రిప్పు, రుప్పఁ గొ)ప్పిరులచెండ్లు
గదిసినవ్వును, జివ్వను హృదయములను
మునులు గనఁబడ నసుర సంపూర్ణయావ
నాంగియై తోఁచి డాసి; యే మందు భూప ! 66

చ. తపములు మాని ప్రాణములు దక్కినఁ జాలు నటంచు హాను లా
త్రపడుచు స్వాశ్రమంబులు దొఱంగి నలుంగడఁ బాఱిపోవఁగా
నపు డొకసప్తతంతునియమాంతరమందునఁ జిక్కియుంట న
వ్విపినమునంద శిష్యపరివేష్టితపర్ణకుటీర వసించెదన్. 67

చ. అంతట రక్కసుండు వివిధాకృతులన్ బెదరింప శిష్యు లొ
క్కింత చలింప కాటవికబృందముసాయముచే నదల్ప వాఁ
డంతన మాయమై తపసియై చనుదెంచి నిరీశవాదనన్
స్వాంతములం గలంపఁ, బ్రతివాద మొనర్తురు బ్రహ్మచారు లున్. 68

ఉ. నాస్తికవాదముల్ పెనిచి యందులఁ గొందఱుచిత్తవృత్తి వ్య
త్యస్త మొనర్చు, వైదికవిధాస్థఁ దొలంచి నిరీశతాగ్రహ

గ్రస్తుఁ జేయు, యజ్ఞియపరాయణతన్ బొరిపుచ్చి మత్క్రతూ
పాస్తికి విఘ్నకారులగునట్టు లొనర్చు మదీయ శిష్యులన్. 69

క. తిట్టును గొందఱుఁ, గొందఱుఁ
గొట్టును వాదింపలేక, కొందఱుఁ బొట్టం
బెట్టుకొను నొంటిగాఁ గను
పట్టిన, వానికి నదేమి పగయో మాపై. 70

శా. గోదావర్యమలాంబుగాహనము మాకున్ గల్ల; దాతీరమం
దేదండంబొ బ్రుసీకమండలువులో యేకావియోయుంచి య
స్మాదృగ్జనులు స్నానమాడి తటిఁ గాంచన్ సర్వమున్ బోవుటే
కా దాచోట్ల ముడింగి నిద్రితభుజంగశ్రేణి ప్రత్యక్షమా.

ఉ. ఇట్టుల మాయనాటకము లెన్నియొ యాడుచు వాఁడు పెట్టుని
క్కట్టులు చెప్పఁ బూనిన యుగంబులు పట్టు శమంబు డించి యా
కట్టెఁడి శాపపాతహతకాయు నొనర్పఁగలార; మైన మా
కెట్టుల ప్రాణమొప్పును వ్యయింపఁ దురాసద మాతపో
ర్థమున్. 72

క. కామక్రోధాదులఁ గనుఁ
బ్రామి మహాక్లేశమున దివారాత్రము లు
ద్దామగతి గడించు తపం
బేమెయి వ్యయపఱుతు మసుర యెంత పఱచినన్. 73

గీ. ఇంత రంధ్రము వడునంత నెంతగట్టి
శాంతిఘటినేనియును దపోజలము బిందు

మాత్రమైనను జిక్కునే ? పూనిజనుల
కరయఁ దపమెకదా ! ప్రాణ మగుధనంబు. 74

చ. 'ఇహసుఖముల్ త్యజించి పరమే పరమార్థముగాఁదలంచి యి
ట్లహరహమున్ మహర్త్రిని వనాంతరవాసులమై జగచ్ఛుభా
వహముగ మాయొనర్చెడితపంబును గాచెడిదిక్కులేమి ని
ట్లిహపరదూరవృత్తి నశియింపఁగ దైనమ! మిన్నకుందువే' ?

శా. అంచున్ దాపము గొంచు నాశలటు శూన్యంబైనమింటన్ గనుం
గొంచున్ దీర్ఘమహోష్ణనిశ్వసితముం బుచ్చంగ;నింద్రాయుధ
ప్రాంచత్కాంతి దివంబునుండి డిగె నగ్రక్షోణికిన్ రోదసీ
సంచారక్షమ మైనయీహయవతంసం బయ్యెడన్ జయ్యనన్

క. సప్తతురగైకతమ కమ
లాప్తాశ్వమొ? ధరణివిహరణాగత దివిష
త్సప్తిరొయొ? యని యరుదందు చ
తృపాక్షులఁ బొసకుక్త్వ మెసఁగఁ గనుతఱిన్. 77

క. చెవి సోఁకె నొక్కయశరీ
రవాణి దివినుండి మునివరా ! రవి సీకై
కువలయ మనఁ బరఁగినయీ
జవనాశ్వము నని పె, దీన శమియించు వగల్. 78

చ. దివి భువి సర్వదిక్కుల నదీనదసాగర భూధరంబులన్
దవు లోకయింతలేక వసుధావలయం బఖిలంబు నశ్రమం
బ వడిఁ బరిభ్రమింపఁగలపాటవమున్ గనుటన్ వహించెదాఁ
గువలయసంజ్ఞ; దీని కొనగూడును సాటి గతిప్రవీణతన్. 79

ఉ. ఈతురగంబు నెక్కి వధియించు నహర్నిశమున్ భవత్తపో
ఘాతుకు నాతతాయి దితిగర్భసముద్భవుఁ బట్టి శత్రుజిత్
ఖ్యాతలనేత్రపుత్రుఁడు ఋతధ్వజునాముఁ డవార్యశౌర్యవి
ఖ్యాతుఁడు; నాఁటినుండి కువలయాశ్వసమాఖ్య యతండు
చెందునున్. 80

ఆ. అనుచు గ్రీష్మభాస్కరాతపాహతి సొరు
గైన సస్యమునకు నమృతవృష్టి
కరణి, నసురపీడఁ గమరిపోయిన మదా
త్మకుఁ దదుక్తి ప్రాణదాత యయ్యె. 81

చ. అగుటయు నోత్రియీామయ! మహాఃఖని! భాస్కర! ఛాంధసోక్తిపా
రగు లగుమాపయిన్ ఘనతరం బగునీకృపఁజిల్కవేని యే
ది గతి? ధరిత్రి నైంద్రియిక దేవత వీవ యటంచుఁ బెద్దగాఁ
బొగడి,హయోత్తమమ్మును నభోమణినట్లభజించి యంతటన్

చ. వెడలితి నేతదశ్వసమవేతుఁడనై వనినుండి, చిత్ర! మీ
నడగఁడు తిన్నగా ధరణినాథ! భవత్పురమార్గ మూఁది వె
న్కడుగున నేనురా క్షణమునం దిటకున్ వడిఁదోడితెచ్చె నా
యెడఁద గ్రహించి; ప ల్కొకటియే కొదగాని యెఱుంగు
సర్వమున్. 83

క. ఇది రవిదత్తము, శ్రేయః
ప్రదలక్షణలక్షితం, బపార చతురిమా
స్పదము, భవత్తనయున క
భ్యుదయార్థ మ్మవతరించి యున్నది సుమ్మా. 84

క. కావున నీసుతు నిపుడే
నావెంబడిఁ బంపి యనుదినంబు తపోని
ష్ఠావిఘ్నకారి యగు నా
కావలుఁ గెడపించి మునులఁ గావు మితేంద్రా! 85

చ. అనుడు నృపాలుఁ డొజ్జలగృహంబున విద్యల నేర్చుచున్న నం
దనుఁబిలిపింప సంభ్రమమునన్ జనుదెంచి యతండు వంద్రికిన్
మునికి వినీతి మ్రొక్కెడును మోహనరూప వివేక విక్రమై
కనిధిఁ గుమారుఁ దండ్రి గని గాలవమౌని చరిత్ర విన్చినన్.

శా. ఉత్సాహం బెసకొల్ప రాట్సుతుఁడు శౌర్యోద్రిక్తుఁడై నేఁడుగా
మత్సర్వంకష చాపవిద్య ఫలియింపం గల్గె, మౌనీంద్రసం
సత్సంరక్షణపుణ్య మబ్బె, భవదాజ్ఞన్ బోయి వత్తున్ ననున్
వాత్సల్యంబున దీవనల్ సలిపి దేవా! యంపవే నావుడున్.

మ. పరిరంభం బొనరించి పుత్రకు మహీపాలుండు 'ధర్మావనం
బరయన్ తేండ్లకు యజ్ఞ'మం చెఱిఁగితో మమ్మా! యిమ్మనీంద్రాజ్ఞ ని
త్తురగం బెక్కి ఋషిప్రశస్యముగ దైత్యున్ మృత్యు వొందించి చె
చ్చెర రమ్మా' యనిపేర్మి చిప్పిలఁగ నాశీర్వాదముల్ సేయుమన్. 88

గీ. మణులు కాంచన కాంచనాంబరము లోలిఁ
నాత్మజునకు సురాళించి యవుల వైచి

భద్రమని హెచ్చరించి శుభంబు పలుక
వినయధనుఁ డాబుధధ్వజుండును జెలంగి. 89

ఉ. పొంగుచు మంగళాచరణపూర్వక మర్వము మ్రొక్కి మౌనియా
జ్ఞం గొని, తండ్రి సమ్మతి యొసంగఁగ నెక్కి, గతిప్రవీణతా
సంగతి నెల్లరుఁ బొగడఁ జాటుచు, నమ్మునివెంటఁ గానకేఁ
గెం గరవాలపాణి శరకీలితతూణి ధనుష్కపాణియై. 90

సీ. రత్నకిరీట నిర్యత్ననిర్యత్కాంతి
పటలిమార్గము బరాబరులు సేయఁ
గండె గట్టినబాహుదండమ్ము లత్తుకొ
న్నంగదంబులు మొల్చినట్లు వెలయఁ
బీనవక్షస్సింహపీఠస్థ జయరమా
ప్రతినిధు లగుచు హారములు నెఱయఁ
గట్టినకాసె కంగముగ రత్నసువర్ణ
మయశృంఖలము మధ్యమమును మాట
విమత నృపవర్గ విగ్రహావృత సువర్ణ
కలిత మగు పెండెరమ్ము డాకాలఁ గ్రాలఁ
జనియె రాచూలి కువలయసాది యగుచు
మునియడుగులోన నడు గిడుకొనుచు వెనుక. 91

గీ. ఘోటకారూఢు నారాచకోడుకుఁ బెండ్లి
కొడుకునటువలె మునియుఁ దోడ్కొనుచు నరిగె
నశ్రమమున వనస్థనిజాశ్రమమున
కచటిమునులు ప్రత్యుత్థాన మాచరింప. 92

క. వారలకుఁ గువలయాశ్వకు
మారుఁడు మ్రొక్కుచును నిరుపమానధృతిశ్రీ
రారజ్యమాన శౌర్యో
దారుండై పలుకు దేవతలు మెచ్చకొనన్. 93

ఉ. మీ రకుతోభయంబున సమీహితయజ్ఞయకర్మకాండ మిం
పార నొనర్చుకొం డని మహాభుజుఁ డానృపసూతి కౌతుకం
బారఁ దపస్వికోటి కభయంబు నొసంగి నిషంగియున్ దను
ర్ధారియునై దివానిశ మతంద్రతఁ గావఁగఁ బూనె నవ్వనిన్.

క. మును కాందిశీకు లయి పో
యినమును లాకువలయాశ్వుఁ డిచ్చినయభయ
మ్మును విని ప్రాణమ్ములు కుదు
టను బడఁ జనుదెంత్రు తమయుటజముల కల్లన్. 95

శా. ఆకర్ణింపఁగ నయ్యెఁ బూర్వమున కైచ్చె 'హవ్యకవ్యంబులున్
గొం'డం చుటజాంతరంబుల మునీంద్రుల్ సల్పు నామ్నాయవా
చాకోలాహల మెయ్యెడం; గువలయాశ్వం బెక్కు ప్రత్యూహముల్
రాకుండన్ నృపపుత్రుఁ డాయసవువర్మంబొంచు శర్మంబిడన్.

శా. కర్ణాకర్ణిక గాలవాచరిత మాకర్ణించి, నేత్రాంచలా
కీర్ణ క్రోధశిఖిస్ఫులింగవమి దగ్ధీభూత భూతాశ్రయా
భ్యర్ణారణ్యముగా వరాహతనుఁడై పాతాళకేతుండు దాఁ
దూర్ణం బంచెలఁ దోఁచె రానుతు మునీంద్రుం ద్రుంచి
భక్షింపఁగన్. 97

క. 'అదె యిదె! రక్కసి పైఁబడె
మదకరియై తాపసాశ్రమమ్ములు నేటన్
బద డగు' నని యదవదలై
పదటున నాక్రోశ మొనరుపన్ మునిశిష్యుల్. 98

—♦ వరాహరూపుఁడైన పాతాళకేతుని కువలయాశ్వుడు వెంబడించుట ♦—

క. చని కాంచె ఋతధ్వజుఁ డ
వ్వనిఁ గాటుకకొండ నాల్గుపాదములఁ జరిం
పను వాంఛించినదో యనఁ
దనరువరాహంబుఁ బీనతర దేహంబున్. 99

ఉ. క్రోలవన్యసత్త్వములఁగూల్చుచుఁ బోత్రఖనిత్రమూఁదియు
ర్వీరుహముల్ పెకల్చుచు ధరిత్రి భయంకరఘుర్ఘురధ్వనిన్
నీఱొనరించుచున్ గనుల నిప్పుక లుప్పతిలన్ వరాహ మా
వీరకుమారుపై దుమికె వీతిఖురాహత మయ్యె దారునన్.

క. మాటలు నేర్చిన దాటం
ఘోటకము భువిన్ దివిన్ గకుప్పంక్తి నిరా
ఘాటముగ దుముకు చక్కటి
క్రోట జనింపం జరించుచుండె జవమునన్. 101

ఉ. శంబరవిద్యఁ గట్టెదురుచక్కటిఁదోఁచుచు మాయపూచువా
హంబుఁ గుమారునిన్ గలఁచు చంతలపొంతల వింతవింతరూ
పంబులఁ జిక్కి వెట్టెడుక్షపాచరుఁ ద్రుంపఁగ నర్ధచంద్రబా
ణంబున నేసె నానృపతినందనుఁ డెక్కిడి పంది యక్కునన్.

క. కాఁడినబాణముతో డనె
క్రోడము శరవేగమున గిరుల్ దరులు ఝరుల్

సూడక వెఱచి పఱవ వె
న్నాడె హయారూఢుఁడై నృపాత్మజుఁడు త్వరన్. 103

మ. మృగయాక్రీడఁ బ్రవీణుఁ డౌట నతఁ డొక్కింతేని యాయాసమున్
దగయున్ లేక తదేకలక్ష్యముగ భూదారంబు వెన్వెంటఁ బా
ఱఁగ నాఘోణియు వేగ యోజనసహస్రం బేగి దాఁడిగ్గె జి
హ్మాగలోకంబున కంధకారనిబిడం బౌభూమిరంధ్రంబునన్.

గీ. సూదితో దారమట్లు క్రివ్వాదుతోడఁ
గువలయాశ్వాధిరోహణకుశలుఁ డౌచు
రాకుమారుండు భూవివరంబు సూచి
భేద్యతిమిరచ్ఛటాపటీవృతము సొచ్చె. 105

ఉ. చొచ్చి తదంతరాళ మెటుసూచిన నాకిటి గానరానియా
పొచ్చె మొకండె కా; దెటుల పోవను త్రోవ నొకింత గానలే
కచ్చట నట్టు నిట్టు తడవాడి యెటో సన ముందు గానఁగా
వచ్చెఁ బ్రకాశలేశ మొకవైపుననుండిఁ గలంక వాయఁగన్.

క. క్రమముగ డిగి వసుధావివ
రముననె చనఁ జీఁకటులు దొలంగి వెలుంగుల్
దెమలనిగతిఁ బెను పొందుచు
రమణీయము లగుచు గోచరం బగునంతన్. 107

ఉ. పార్థివసూనుఁ డట్లు కనుపట్టు వెలుంగులవెంటఁబోవ న
త్యర్థపరార్థ్యరత్నకిరణాంచిత కుట్టిమ వప్రభిత్తియై
యర్థపతి ప్రసిద్ధనగరాధిక వైభవశోభియై సమ
స్తార్థ సమృద్ధమైనొకమహాపురి గోచరమయ్యె, నొటయున్.

శా. కాంచెన్ డాసి హరిన్మణిస్ఫటికలప్రాకారంబుశృంగార, వీ
క్షించెన్ దుస్తరవారి నిమ్నపరిఖాసృష్టి ప్రకృష్టిన్, సమీ
క్షించెన్ నిస్సరణార్గళవాదులఁ, బరీక్షించెన్ లసత్స్వర్ణహ
ర్మ్యాంచ చ్ఛిల్పవిచిత్రముల్ నృపసుతుం డశ్వోత్తమారూ
ఢుఁడై. 109

సీ. కుముదకోకనదాదికముల హంసాదుల
గోమరొందు కమలాకరములఁ గనుచుఁ
బల్లవఫలపుష్పభరిత శాఖల
తాంచి శోద్యానవాటిక లారసికొనుచు
స్థగితమాణిక్యోత్థిత స్థిరసాంధ్యరా
గము లైన రాజమార్గములఁ జనుచు
జందాశ్రిస్మరచితాశ్వశాలల నిందాశ్రిస్మ
విరచితగజశాల లరసికొనుచు
విపులచప్పరములు కేళిగిరులు గరిడి
సాలలును నాట్యశాల లాస్థానమంట
పాదు లరయుచు రత్నపురాధినాథు
తనయుఁ డనుపదవిభ్రాంతిఁ జనుచునుండె. 110

క. భ్రమపడుచు నిజము దెలియుచు
విమర్శమున నతఁడు వాయువేగమనోవే
గముల నగుతురగ మెక్కి పు
రము నెల్లం దిరుగుఁ గానరామి నెవండున్. 111

క. అలయిక యెట్టిదో యెఱుఁగని
యలజవనాశ్వమును సొగియ నఖిలము పురమున్

గలయఁ దిరిగి తిరిగి వెఱన్
నిలిచి యొకచతుష్పథమున నెమ్మది నెంచెన్. 112

చ. నగరము లెన్ని కాంచ నవనాగరకత్వము మూర్తమైన య
ట్లగపడునట్టి? వింతటిమహాద్భుతశిల్పము లెందు నున్నె! య
చ్ఛగ మణులే యిటుల్ మలిచి సొన్నము సున్నముగా
బిగించి సొం
పుగఁబురి నిన్నిసౌధము లపూర్వగతిన్ రచియించి రెవ్వరో!

క. ఇది యేలోకమొ, దేశం
బెదియో, యీనగర మెదియొ, యెవ్వరిదో, యీ
మదసూకర మెటు సనెనో
మదిఁ దలప ని దెల్ల దైత్యమాయగఁ దోఁచెన్. 114

సీ. పాడువాఱదు హర్మ్యపంక్తి క్రొత్తగ నవే
ముంగిళ్లఁ దీర్చినరంగవల్లు
లడుగుజాడలు మాయ వంగణమ్ముల రత్న
సోపానములఁజూడ సూక్ష్మఫణితి
ధూళి బ్రింగవు గృహాదులవేదికావిటం
కచ్ఛదివలభు లగ్గలము మెఱయుఁ
బూసినపసు పింత మాసిపోవదు దేహ
ళులఁ గాంచ నూత్నదీప్తులఁ దనర్చు
శిల్పి లీపత్తనంబు ననల్పపటిమ
నిన్ననో నేఁటనో కట్టి చన్నయట్టు
లున్నదియు; కాని నిద్రించుచున్నపగిది
యిటుల నిశ్శబ్దముగ నుండ హేతువేమొ? 115

ఉ. ఒట్టిడినట్లు కంటఁబడఁ డొక్కఁడు నెక్కడ కేఁగువాఁడ నం
చ ట్టిటు రాచపట్టి కలయం గనుచుండఁగ దూరమందుఁ గ
న్పట్టె వివర్ణదీనవదనంబున సంభ్రమసంభృతాంగి యై
నట్టిపడంతి యొత్తు హృదయంబున నాసలు మోసులెత్తఁగన్

చ. ప్రభుహృదయం బెఱుంగుటఁ దురంగమ మంగనమ్రోల
బాణస
న్నిభముగఁబోయి వ్రాలధరణీపతిసూనుఁడు కాంతఁజేరి యే
ప్రభుపుర మిద్ది? యేల కనుపట్టఁడెవండును నీవెవర్తవి
ట్లభయముగాఁ జరింతు వనితా! యని యొంతగఁ బృచ్ఛ
సేసినన్. 117

క. వెనుదిరిగి సూడ కుత్తర
మును జెప్పక మెలఁత శీఘ్రముగఁ జని చని య
త్యనుపమ శిల్పాంచిత కాం
చనసౌధ మొకండు సొచ్చెఁ జంచలకరణిన్. 118

ఉ. శోడన వచ్చునాన్నృపసుతుం డను దందుచు నీమెలంత నా
శోడ నొకింత పల్కక యెదో మది నెంచి కలంగుచున్నటుల్
సూడక యేఁగుచున్న దిది చొచ్చినచోట నెవండు గానఁగా
రాఁడె యటంచు వెంబడిఁ దురంగముతోఁ జని మేడపొంత
కున్. 119

మ. వరణద్వారమునొద్ద నక్కువలయాశ్వంబున్ వెసన్ డిగ్గి యొ
వ్వరిప్రాసాదము యిద్ది? లోనికిటుపోవన్ వచ్చునో లేదో యా

త్తర మీా కచ్చెలి యేఁగె నెందొ యని చిత్తం బుత్తలం
బొందఁ గొం
తరుగుల్, నిల్చి, దెసల్ గనున్, మలఁగు, నల్లాడున్, జనున్,
గొంకుచున్. 120

సీ. మొదటి కక్ష్యాంతరమ్మున ఫలరసపుష్టుల్
పఱుప వర్ధిలువృక్షపాళి మసలి
యవలికక్ష్యాంతర మలరించుసురభిళ
సుమపరిష్కృతనికుంజములఁ జొచ్చి
వివిధమణిగ్రావవిరచితకృతకాద్రు
లమరుకక్ష్యాంతర మవుల నరసి
యమృతసరోంచితం బైనతురీయక
క్ష్యాంతర మ్మాశ్చర్య మంది దాఁటి
విప్రతీపరసాంతరావిలము గాని
శుద్ధశృంగారరసము నచ్చునను బోసి
నట్టు లింపొందునిష్కుటంబం దొకంట
నిలిచెను వసంతుఁడో యన నృపతిసుతుఁడు. 121

క. నిలిచి తలయెత్తి యెదుటం
గలసౌధము మీాఁదినిలువునన్ గనె ను
జ్జ్వల కనకపుత్రిఁ వలెఁ జూ
పులకున్ మిఱుమిట్లు గొలుపుపొలతుఁక నొకతెన్. 122

ఉ. భావజురాణియో కుముదబాంధవునంతిపురంబొ మోహినీ
దేవతయో ప్రచేతసుసతీతిలకంబొ యనంగఁ జారిమ

శ్రీవృత యౌవనోదయవిశేషనిషేవిత కోమలాంగియా
నావనజాక్షి యెవ్వతెయొ యాత్మఁ గలంచు నటంచు నెం
చుచున్. 123

సీ. మును లేమయిరొం వనమ్మున నంచుఁ బ్రితినిమి
షమ్ము డెంద మ్మెచ్చనుమ్మలమ్ము
నెగచి వరాహంబు నేయుట తఱుఁపునఁ
బాఱఁ దెలెక్కునిబ్బరపువేడ్క
తిమిరనీరంధ్రధాత్రీరంధ్రమునఁ గూలు
టెంచఁ జేతన వో జనించువణఁకు
వనదమ్ము విడిచి వచ్చినమించు నుపమించు
నువిదఁ గాంచ జనించువివశవృత్తి
సంతసమొ చింతరొూ చెప్పఁజాలని దుర
వస్థ శబలితమైన భావంబు క్రిమము
గా మరుం డేకరాగముగ్ధం బొనర్ప
రమణిఁ గా కన్య మెఱుఁగఁ డారాజసుతుఁడు. 124

క. హరిణాక్షి రామణీయక
మరసి తనివిసనక ఱెప్ప లడ్డుపడెడి నం
చురవడి నొరయు చతనిచూ
పరుగుఁ దరుణియెడకు; వలపహా! యెంతటిదో. 125

వ. అట్టియెడ.

ఉ. మేలికడాని కుందనపుమేడ విరాజిలుగాజుటోవరిన్
బాలకురంగలోచన కవాటము నోరఁగఁ ద్రోసి దృక్తటి

న్మాలికఁ గాన్కఁ జేసి నృపనందనుపైఁ జిఱునవ్వుఁ గ్రొవ్విరుల్
రాలఁగిఱుకున్ దొలఁగి క్రచ్చఱ సోరణగండ్లలోఁ గనున్.

క. మందస్మితామృతస్ని
గ్ధేందుముఖీశితకటాక్షదృగ్విదళితమై
డెందము దవవృతమృగమై
కందఁగ నృపసూతి తలఁపఁ గడఁగెం దనలో. 127

చ. నెలకొని మేడయందు, రమణీతిలకం బమృతంబునన్ హాలా
హలమునఁ దోఁచి తోఁచి హృదయంబున నాటుకొనంగ
నేసెఁ జం
చలపుఁగటాక్ష మద్ది వరుసన్ సుఖదుఃఖము లీయ కేక మా
నలఁతయు కూర్చెఁగాని సుఖ మక్కట! తోఁచెనె యెండ
మావులై. 128

క. అని తలఁచుచుఁ గళుకు కళు
క్కని మదిలో మెఱుముచంచలాక్షిచలకటా,
క్షనిరీక్షణము నిగాఢము
గ నిఖాతం బగుట నవవికారము పొడమన్. 129

గీ. చిత్రి మగువాగతీతని శ్చేష్టతయును
నుపశమిల్లనిమాత్న తాపోద్గమంబు
పొడము చణఁగుచు మెఱపులై పొదలుకోర్కె
లలఁప ని ట్లని తలఁచు భావాంబరమున. 130

సీ. చెమటచిత్తడి లలాటము నంటుభ్రమరకం
బుల నొత్తఁగా నేల కలఁగకున్న

వాతెఱ చిగురాకురీతిఁ గంపిల నేల
లేనవ్వువెన్నెలల్ విరియకున్న
గబరీభరము నఖాగ్రమున నల్లన దువ్వ
లేల యించుకయుఁ గైపెక్కకున్న
నెడకేలఁ గుచ్చెళుల్ కుడికేలఁ బయ్యెద
చక్కసేయఁగ నేల జాఱకున్న
నళికి తనలోనఁ దా నోలమాసగొనుచు
నటు నిటు మొగంబు మలఁచి న న్నరయ నేల?
మఱుపడియు సోరణమునుండి తొంగ కరయ
నేల నాయున్కి లజ్జావతీలలామ? 131

ఆ. శితకటాక్షహేతిఁ జిత్తమ్ము విదళించి
యకరుణముగఁ జాటునకు నెలంత
యరిగెఁ; గుసుమకోమలాంగులై తోఁచి రా
గుండె నబల లెంతకును దెగింతు?! 132

గీ. అనుచు నాక్షణ మామేడ కరుగ నెంచి
ఘోటక మ్మచటన డించి కొంత నడచి
యట్టె నిలుచుండి యారాచపట్టి సంది
హాన మగుమానసమున ని ట్లని తలంచు. 133

ఉ. 'ఆచిఱునవ్వు లాచలదపాంగనిరీక్షలు నామరాళయా
నోచితలీల లెల్ల వల పొందియ నాయెడ' నంచు నేఁగఁ జ
న్నే! చెలి కవ్వి నైజములయాఁ దలు పోరఁగఁజేసి వింతగాఁ
జూచుటయున్ నవీనపురుషుండెవఁడో యనుబుద్ధినే యగున్.

మ. అటు గాకున్నఁ దఱ్ఱపన్ ద్యజింపదె? వయస్యంబంపదే? వేగ స
న్నటకున్ దెమ్మని; కంతుధాటి కభయంబాసింపదే? యెంటి యే
నెటులో పజ్జకు లజ్జ డించుకొని తానే రాదె? యేతెంచి ము
చ్చటగాఁ బల్కదె? చిల్కదే ప్రణయ? మాశల్ పుట్టఁగాఁ
జేష్టలన్. 135

క. పరపురుషుఁడఁ గన్యాంతః
పురము చొర నధర్మ, మిట్టిబుద్ధి పొడమె, దు
స్తరపాపహేతు వౌఁగద
హరహర! నాకంటెఁ జపలుఁ డన్యుం డున్నే. 136

చ. మునిజనకార్యముల్ మఱచి మోహవిదాహము నొంది యిమ్మెలం
తనుగడియన్ వృథాభిలషితంబునఁ జిక్కటఁ దండ్రియుఁ దపో
ధనులు నెఱుంగ మోసముగదా కికురింప ననున్ సురారి మా
యను వనితన్ సృజించెనొ తదాకృతిఁ దానె ధరించెనోకదా!

క. అనుచు లలనానురక్తము
మనము తెటుక్కన విరక్తమము గన నృపనం
దనుఁ డీక ముందటి కరుగక
వెనుకకుఁ జన కట్టె నిలిచి వీక్షించు దెసల్. 1ʼ8

—• ఋతధ్వజుఁడు కుండలతో మదాలసను సమీపించుట •—

చ. అయ్యోడఁ దొల్తఁ దాఁగనినయావరవర్ణిని ఖిన్నవక్త్రయై
చయ్యన మేడమెట్లు డిగి సన్నిధి సేరి నరేంద్రచంద్ర! మా
నెయ్యుఁడుగా నినున్ బరిగణింతు మకారణమూర్ఛమున్గి న
ట్లయ్యెను మావయస్య యెటులైన సచేతనఁ జేయుమాదయన్..

క. మం దిచ్చియొ మదికుందున్
డిందించియొ బ్రిదుకఁ జేయుటే వలయు, రయం
బందఁ జనుదెమ్ము సంవియ
మొుండక సౌధమున కనుచు నుగ్మలి వేడన్. 140

మ. భువనాధీశ్వరపుత్రుఁ డాత్రమున నాబోటింగనుంగొంచయో!
యెవ రామూర్ఛిత నీకు నే మగును? మున్నే నెంత ప్రశ్నించినన్
వివరం బేమియుఁ జెప్ప కేఁగుదువు, తన్వీ! వేగ మీమీఁకతల్
వివరింపందగు నన్న నన్నెలఁత 'రావే త్రోత్త న్నావెంబడిన్.

చ. మదవతి మూర్ఛఁ దేఱిన సమస్తము నీ కెఱిఁగింతు జాగొన
ర్పఁదగదు లె'మ్మటంచుఁ దనపజ్జన యజ్జనపాలుఁ దోడుకొం
చుఁ దెఱవ మేడమీఁదియుఱఁ జొచ్చి విచేష్టిత యైనచాన న
మ్మదనమనోజ్ఞమూర్తికి భ్రమం బుదయింపఁగఁ జూపెఁ
జూపినన్. 142

శా. దైత్యాపాదితమాయ గాదుగద! యీతన్వంగిమానోజ్ఞకం
బత్యబ్జాసనసృష్టికౌశలము సత్యాశ్చర్యధుర్యంబునై
సత్యంబున్ దెలియంగనీక విచికిత్సన్ ముంచెఁ, గానీ శరీ
రత్యాగంబుననేని యాఁడుకుయి దీర్పన్ నీతి నా కీతఱిన్.

చ. అని మది నిశ్చయించుకొని యానృపసూతి యనంగుచేయిజా
ఱినగుణవల్లి నా, మృదుపరిచ్ఛద మంజుల గంధిల ప్రసూ
ననిబిడశయ్య మోహపరిణాహ వగాహితదేహ యైనయం
గన దరిఁ జేరి 'తేఱుకొని కాంచుము చంచలనేత్రి న'న్ననన్

గీ. చిత్రముగ నమ్మృదూక్తి సంజీవన మయి
యేడుపాతాళములక్రింద నింకిపోయి
యంశమాత్రమ్ము మినుమిను కనెడుప్రాణ
మెత్తుటయుఁ గన్ను విచ్చెఁ బూర్ణేందువదన ! 145

సీ. భావజ పావకోజ్జ్వాలనార్థమువోలె
నుస్సురం చొక్కనిట్టూర్పు పుచ్చి
యాయాసపిశునోన్నతానతకుచపాళి
జాటినపయ్యెద జక్కఁ జెక్కి
యాజానుసంశ్లిష్టమై జంఘ లింపొందఁ
బదములు విజ్జోడుపడఁగ నిలిపి
కొంఁదీఁగ నులియు వేగఁ గపోణి యొకప్రక్క
నూఁది యించించుక యుబికి లేచి
చెలియ యనుభ్రాంతి మెడ యెత్తి చెంత మెఱసి
పోవుపున్నమచందురుఁ బోనివాని
దృష్టచరు నమ్మనోహరాకృతి నృపసుతు
నరసి స్వప్నము కాదుగదా! యటంచు. 146

క. ఉలికిపడి లేచి చేలాం
చల మెడమబుజమ్మునుండి చరమాంగగతిన్
వలకే ల్గ్రమ్మఁగఁ దివుచుచుఁ
గలఁగుచుఁ గుచ్చెళులు కాళ్లఁ గ్రమ్మఁ దివియుచున్. 147

చ. అజ్జలజాక్షి యూర్పుసెక లంటి మహోష్ణములైనయశ్రువుల్
కజ్జలరేఖలన్ గరఁచి క్రమ్మఁగఁ జెక్కుల, నొయ్య డిగ్గఁబో

సెజ్జకుఁ బజ్జ నిల్చి నృపసింధురుఁ డాపవమన్మథుండు దర్‌
బుజ్జవ మొప్ప మాన్పినను బోయెను జాటున కిగ్గి సిగ్గునన్.

గీ. శయ్య డిగి కొంత యరిగి, యచ్చటను నిలిచి
నటుల గాకుండ నిలిచి సోం పలర నృపతిఁ
దటుకున మెడన్ మలంచి కస్తనియ నరసి
కొమ్మ వలిపంపుఁదెరమఱుంగునకు నరిగె. 149

వ. రాజనందనుండును గంధర్వగోచరుండై కొంతవడి దిగ్భ్రమ
మందియుఁ జెలిమికత్తెయునికిం దెలివొంది కన్యావృత్తాం
తంబు నెఱుంగం గోర నాచెలి యిటు పలుకు. 150

—♦ కుండల మదాలసావృత్తాంతము గుణలయాశ్వసకీర్తింగించుట. ♦—

క. ఇది పాతాళజగము దు
ర్మదుఁ డగుపాతాళకేతురక్షఃపతి కా
స్పద, మసురేతరులకు యమ
సదన మగు; నతండు చండశాసనుఁ డగుటన్. 151

క. ఈమెలఁతుక విశ్వావసు
నామక గంధర్వరాజనందిని, సుగుణ
శ్రీమతి మదాలసాఖ్య, మ
హామతి విజ్ఞానవతి సుమా! బాల్యాదిన్. 152

శా. తారుణ్యంబున లోకమోహనకళాధారాకృతిన్ మీఱురం
భోరూరత్నము దీని ఫుల్లకుసుమామోదాసవాసారహృ
ద్యారామాంతరకేళిలోలనొకనాఁ డాక్రూరుండీక్షించి మా
యారూపంబునఁ దెచ్చి యిం దునిచెఁ బెండ్లాడంగ నున్నాఁ
డిఁకన్. 153

ఉ. విన్ననె గుండె బ్రద్ద లగు; వన్నెలకే వడగొట్టునట్టి యి
కన్నియ దంష్ట్రికాక్రకచ కర్కశఘోరముఖుండు నాయసా
భిన్నకళేబరుం డసుర పెండిలి యాడఁటె నేఁటిరేయి న
న్నన్న! వసంతమల్లిక దవానలకీలపరీత యయ్యెనే! 154

మ. గతరాత్రిన్ దితిజుం డొనర్పఁగల యాఘాత్యంపుఁగృత్యంబు విం
చతిభీతిన్ మతిపోయి యియ్యతివ సౌధాగ్రంబునందుండి సం
పతనంబొంది నశింప నున్నతఱిఁ బ్రేమన్ గామధుగ్ధేను వూ
ర్జితకారుణ్యము మించఁ దోఁచి వచియించెన్ వాంఛ రే
కెత్తఁగన్. 155

మ. వలదమ్మా! యిటువంటిసాహసము, లీపాతాళకేతుండు దాఁ
గలనైనన్ బతి కాఁడు నీకు, నిదినిక్కం, బుర్వికిన్ బోవ నీ
ఖిలు నేజిత్వరుఁ డేయు సత్వరము త్వత్కాంతుండు వాఁడే యగున్
గలుగున్ శ్రేయములున్ జిరాయువును గాంతా! యూఱడిల్లంగదే. 156

క. నమ్ము భవత్కళ్యాణది
న మ్మసురకు మరణతిథిగ నవలా! రేపే
యమ్మంగళపర్వదివస
మమ్మా! యని దేర్చి సురభి యరిగెన్ దివికిన్ 157

క. ఉవిద తెలివొంది మరణ
వ్యవసాయ నివృత్త యయ్యె నయ్యా! యింకన్

వివరింతుఁ గరుణభరితం
బవు నాచరితంబు వినుమి యవహితమతివై. 158

ఉ. ఈయమబోటికత్తె ననియెంచుము 'కుండల' యంద్రునన్ను న
న్నా! యలవింధ్యవంతునకు నాత్మజఁ బుష్కరశాలిభార్య;నా
నాయకుఁడాజిలో మృతిగనంగను శుంభసమాఖ్య దైత్యుచే
నాయన పుణ్యలోకములకై తిరుగాడుదు సర్వతీర్థముల్.

గీ. పత్యహము దివ్యగతిని తీర్థముల నెల్లఁ
దిరిగి యీచెలిచెలిమికై మరలివత్తు
నటులె వచ్చుచు నేఁటిమధ్యాహ్న మొక్క
యడవి వినఁగంటి నొక్కవృత్తాంత మనఘ. 160

ఆ. పందిరూపు నొంది పాతాళకేతుండు
ఋషుల మిగ్రింగ రాఁగ నేసె నర్థ
చంద్రసాయకమున జగదేకవీరుఁ డొ
క్కం డటంచు మదిని ముదము గదుర. 161

శా. 'ఆవాక్యామృతమీవెలంది చెవిఁ బోయన్ గల్గుచో,హృద్గతం
బై విస్ఫారితతాప మార్చి పరిశుష్యత్ప్రాణసంజీవనం
బై వేడ్కల్ గురియించు, నంచుఁ ద్వర డాయన్ వచ్చుచుం
డంగ నీ
వేవో పల్కితి, వానుడుల్ మదికి రానేరావు చూడన్ నినున్

క. ఆవేగమ్మున సంతో
షావేగమ్మున నసంఖ్య మగుసోపనముల్
మై వణఁక నెక్కి హర్మ్యము
లో వేడ్కం జొచ్చి యట విలోకింతుఁగదా. 163

సీ. చెలియఁ గనఁబడ, దెలుఁగెత్తి పిలువ నెవ్వ
రేని యాలింతు రేమొ యం చీరెలుంగు
తోడ నందందుఁ బిలువ మాటాడకుండె
వణఁకిపోయితి క్షణ, మగపడదె యనుచు. 164

ఉ. అంతట నాకు నేన హృదయంబున ధైర్యము నొంది, సౌధభూ
మ్యంతరముల్ గనుంగొనుచు నాత్రముతోఁ జని, గాజుటోవరిన్
గాంత గవాక్షమార్గగమనప్రవణేక్షణఁ గాంచి నెమ్మదిన్
సంతసమొంది పొంతకుఁజనన్ ననుఁ జూడనెచూడ; దేమనన్

క. అఱచేత వెన్ను చఱవఁగఁ
దెఱవ యెఱుఁగ కుంట కేమి? తెక తెక మనుమై
జుఱుకు మని కేలు, పులకలఁ
గిఱికొనుచిఱుచెమటఁ జెమ్మగిలి డిగఁజాఱెన్. 166

సీ. ఎట్టకేలకు నారాక యెఱిఁగి తిరిగి
చూచి సిగ్గునఁ దలవంచి చూపులందు
దైన్యము నురోజయుగపతత్కజ్జలాసి
తాశ్రుకణములుఁ దులకింప ననియె నిట్లు. 167

ఉ. 'అక్కరో! దైవదుర్లలిత మాఱద, కామగవీవరంబు నే
మిక్కిలి నమ్మియుండ బలిమిన్ బెడదోవకుఁద్రిప్పినైచె! నే
చిక్కులఁ జిక్కి దిక్కఱి నశింపఁగ నుంటినొ చూడు' మంచుఁ దాఁ
గ్రిక్కిన జాలమున్ గదియఁగాఁ ననుఁ దార్చుచు నిన్నుఁ జూపుచున్. 168

మ. మగువా ! చూచితె యీప్రఫుల్లతరుణామ్రక్ష్మోణిజచ్ఛాయ సో
యగపుంతా వగుమోహనాంగు ? నతఁడే మచ్చిత్తవిత్తంబు చూ
ఱగొనెన్ ఖేచరభూచరోరగ కుమారశ్రేణిలో వీని కీ
డగునాసేచనికాంగుఁ డొక్కఁడు గలండా నిక్కముల్ జెప్పుమా. 169

ఉ. కాంతరో ! సుందరత్వపరకాష్ఠకు నెక్కినకోడెకాండ్రలోఁ
గంతువసంతులన్ వినుటెగాని, జయంతు నెఱుంగమా? నిశా
కాంతుని గాంచమా? ధనదుగాదిలిబిడ్డని జూడమా? తనూ
కాంతిని వీనిమించుటకుఁ గా; దుపమించుటకున్ వలంతులే?

క. ఇంతటిచారువపుః
శ్రీమంతు నుడిగి సురభిసూక్తి మత్తాసురకా
లాంతకుఁ డని వేఱొకనికిఁ
గాంత నగుచు నెటుల బ్రదుకఁగలనో లలనా? 171

సీ. జనకపాదుల యంకమున నెక్కి యాడుచు
నేకొన్ని నాళ్లుంటినో కదమ్మ
బ్రిదికియుండియు లేనిపగిది నైతిఁ గదమ్మ
కన్నమ్మ కడుపుశోకమునఁ బొగుల
మాయసౌందర్యసంపద నా కిదేలమ్మ
కఱకురక్కసికి నగ్గమ్మైనర్చె
నాప్తబాంధవ దవీయసి నైతినిగదమ్మ
యీరహోవాస మిం కెట్లుతప్పు ?

నకట ! వలచినపతిఁ జేతులార విడిచి
సురభివరలబ్ధపతికిఁ గాఁపురముసేయు
దొసఁగు విధి వ్రాసె నమ్మ నెన్నొసఁట నాకు
నెవరి నే మందు ? నాకు ది క్కేది ముందు? 172

చ. అని భరియింపరానివ్యసనానలకీలకలాప ముస్సు రం
చనుశ్వసితంబులన్ గెరల, నందపువాతెఱ కంది పేటు లె
త్త నిదురఁ గూరినట్టుల నధస్థ్సలి మూర్ఛిలికూలుచుండఁ జ
య్యన నిరుగేలఁ బట్టి శయనాధిశయాన నొనర్చి చెచ్చెరన్.

క. మెల్లగఁ గౌఁగిటఁ బొదిఁగియుఁ
జల్లఁగ ఘనసారగంధసారమ్ములఁ బైఁ
జల్లియు నౌశీరవ్యజ
నోల్లస దతిశీతవాత మొలయ విసరియున్. 174

ఆ. ఫలము గానలేక చలియించి పలవించు
చబల కుసుమకోమలాంగి యేమి
యగునో యని చికిత్సకై వెజ్జ నరయ రా
నీవు కంటఁ బడితి దేవుఁ డట్ల. 175

చ. అడిగినమాత్రవె న్నిడివియ కంగనపాలిటి కశ్విసీకుమా
రుఁడ వయి తోఁచి వాక్సుధలఁ బ్రోచిననీపదసేవ యెన్నినా
ళ్లుడుగక మావయస్య యను వొప్ప నొనర్పఁ దొఱంగు నీఋణం
బుడుగర లేమి యీఁగల మయో! బ్రదు కిట్టు లయోమయంబుగాన్. 176

శా. నీవృత్తాంతమశేషముం దెలిపి, సందేహంబులం బాపి, యా
తీవంబోణికి దిక్కుచూపి, హృదయార్తిం మాపి, పుణ్యంబునం
బోవే; దైవము తెచ్చె నిన్నని ముదంబున్ గందు, మీపుత్రరకా
రావాసంబు దొలంప కున్న వృథసుమ్మీ నీశ్రమం బింత
యుం. 177

క. సుర గరుడ కింపురుష కిం
నర చారణ సిద్ధసాధ్య నాయకులం దో
క్కరుం డగుదు; వరయ నరులం
దరయం దరహూనె యింత యంద మ్మొందుం? 178

క. అని పలుకుకుండలకు ని
ట్లనె నృపతిసుతుండు చేడియా! శతృజిదా
ఖ్యను మించుధరాపరివృఢు
తనయుండ ఋతధ్వజాభిధానమువాఁడం. 179

ఉ. అంతియ కాని నీపలికినట్టిసురోరగఖేచరాదులం
దింతి! యెవండఁ గా, నుడుగుమీ మది సందియ, మింక
దేవతా
సంతతి నాకుఁ బూజ్యు లనిశంబు; తదీయదయావిశేషసం
క్రాంత నిరంతరాయజయరాజివిరాజితకీర్తిఁ గానొకో.180

వ. అదియట్లుండె.

ఆ. జనకునాన పూనిజనులఁ గావఁగ గాల
వాశ్రమమున నుండ నసుర యొకఁడు
పంది యగుచుఁ గంటఁ బడ నర్ధచంద్రేషు
వంది యేయ గాయ మొంది పఱచె. 181

మ. అనుచుఁ రాజసుతుండు సెప్పునిజవృత్తాంతంబునన్ దైత్యునే
సినశూరుండ నటన్న పల్కమృతవృష్టిఁ మించి విన్పింప జ
ల్లన మేనుల్లము పల్లవింపఁ, దెరచాటై యున్న యన్నాతియా
తని గాంచెన్ బ్రితిసీరఁ ద్రోసి వదనార్ధం బొయ్యనన్ గాన
రాన్. 182

చ. మది శతకోటిశంప లొకమాఱు తళుక్కనె, నింద్రచాపముల్
పదులును వేలు చూపులను బర్వెఁ, దనూలత నారుమళ్లసం
పదగనెఁ,జన్నుదోయి దెరమాటున నూర్పులపుట్టలయ్యె, నా
సుదతిస్వరూపమిట్టు లతిచోద్యముగాఁ బరిణామము గనెన్

గీ. కడఁక నునుసి గ్గపాంగవీక్షల మరల్చి
మగువఁ దెరఁ జొన్పుటయు రాకుమారుఁ డల్ల
లాడిపోయెడిమది నెట్లొ కూడఁగట్టి
కొని ప్రసంగాన శేషమ్ము వినిచె నిట్లు. 184

వ. మగువా! యట్లు పఱచుభూదారంబు వెంబడిఁ దురగారూ
ఢుఁడనై నేను బహుయోజనంబు లనుధావింప నయ్యది
యొక్కెడ భూవివరంబునఁ డిగ్గఁబాఱ నేనును దురంగంబు
తో నందుఁ జొచ్చి, యందుఁ బందిం గానఁ జాలక కా
వొ్కన్నయిర్లం బడి త్రోవ గానక కలగుండుపడియు దిట
వూని యెట్లో నిర్జనం బగు నిప్పురంబుం జేరి నిన్నుం గాంచి
పలుకరింతుఁ గాదె? మీఁదియుదంతంబు నీ కవగతంబకదా
యనుటయు. 185

ఉ. కుండల పొంగిపోయి చెలికోర్కులు పండినవంచుఁ జెచ్చెరన్
గాండపటంబుద్రోసికొని కామినిఁగౌఁగిటఁ గూర్చియక్క! వే

క్రొం దగునమ్మ యాసురభిసూక్తికి, నాతపముల్ వ్రితంబు
లుగా
బండిన వంచుఁ బల్కె వరవర్ణిని సమ్మదముగ్ధచిత్తయై. 186

వ. దితిజునిమాయయా ? యిది మతిభ్రమయా? కలయా ?
యటంచుఁ గొం

తతడవు చేష్ట దక్కి లలనాతిలకం బపరంజిబొమ్మయా
కృతిఁ గనుపట్టెఁ గాని చనుఁగేవల గ్గుఱుపాటుతోఁ దరం
గితశిశిరాశ్రుపూర మెఱిఁగించెఁ దదాంతరవృత్తిమర్మముల్

క. అత్తఱిఁ గుండల తెర యు
వ్వెత్తుగ నెత్తంగఁ గినుపు భీతియుఁ దిరపయుల్
గుత్తుకబంటిగఁ బైకొన
బిత్తఱి తత్తఱము నొంది వెనువెనుకకుఁ బోల్. 188

చ. కదలనిచూపు లందొకవికారపురాగము రేఁగి యాఁగి నె
మ్మది నెవియేని జిత్రముల మాటికి సృష్టియొనర్పఁగా రసా
స్పదమయి లోకమంతయు నవంబుగఁదోఁచె విలాసినీ శుభా
స్పదమగు రూపముల్ గనినపాటున రాజకుమారుదృష్టికిల్.

ఉ. నవ్వుచుఁ జూచుకాంతరదనంబులు మల్లెలఁజల్ల జల్లునల్
జివ్వునఁ నొక్కవడ్డనునుఁ జెక్కులు క్రొత్తగులాబిపువ్వులల్
రువ్వఁగ విప్పవాఱిన కనుంగవ యుత్పలపంక్తిఁ జిమ్మ న
ప్పువ్విలుకాని ముద్దినుసుముల్కులు గాఁడెఁ గుమారు
నాత్మలో. 189

వ. అయ్యవసరంబున.

చ. అరయు ముఖంబు వంచియు కటాక్షనిరీక్షలఁ జల్లఁగా మనో
హరు నొకవంక; నొక్కదరి హాస్యమొనర్చు వయస్యయాస్యముఁ
జూచుచుఁ జూచు; మాటువడఁ జూచు మృగాక్షి, ధరిత్రిఁ బడ్డవా
శ్చర మటు మిట్టిమిట్టిపడు చంచలదృక్కుల నెల్లదిక్కులన్

సీ. ఏటికే మందాక్ష మిన్నినాళ్లం దేఁగెఁ?
జలపాది యయ్యెనే సమయమునకుఁ
గంప మెందులకే తపింపవే? యిమ్మనో
జ్ఞాకారుకే ల్వట్ట ననునిమేష
మేల వైవర్ణ్య మిం దేమి క్రొత్తలె? ప్రియుల్
ప్రియులకు హృదయ మర్పించు టరుదె ?
గామధేనూక్తి మోఘం బౌనె? యూడఁ బో
యినతీర్థమే యెదురేఁగుదెంచె
ననుచుఁ జెలి కేలువట్టి ధైర్యంబు గొలుప
సహజలజ్జాలసత్వభీసంభ్రమములు
వాయలేక ప్రత్యుత్తరం బీయలేక
గండరువు వోలె బాల నిల్చుండె నంత. 191

గీ. అతిథి నిను వెదకికొంచు గృహంబు చేర
నేల యాతిథ్యమొసఁగ కి ట్లోడఁబోవ
ర మ్మని వయస్య గొనినకరమ్ము విడక
తిగిచి రాసుతుకడకుఁ దోడ్తెచ్చి నగుచు. 192

ఉ. 'భూతలనాథ! మాచెలియ పూర్తిగ నమ్మకయుండెఁ జూ
మనో
జాత సురాగ భీతిఁ, బెలుచన్ దొలఁగింతు నటంచుఁ జేతిలోఁ
జేతిని వైచి చెప్పు;మటు సిగ్గిలుదే మగవాఁడ వయ్యు'నం
చాతరుణీకరం బతనిహస్తముతోఁ గదియించి యి ట్లనున్.

క. సురభి నుడివినమహాత్ముఁడ
వరయఁగ నీ వొట నిమ్మృగాక్షి మనం బె
ట్లొరుఁ గోరు? నీవు గాకెవఁ
డటిమినపాతాళకేతు నమ్ముని నేయున్. 194

క. దైవబల మిటు ఘటించెం
గావున రవి దీప్తి, చంద్రుఁ గాంతి, గుణశ్రీ
సేవధి భూతి యెనసిన
ట్లీవెలఁదుక నిన్ను నెనయ-నెనయము శుభముల్. 195

—♦ మదాలసా కువలయాశ్వుల వివాహము ♦—

గీ. ఇపుడ యీయమపిత్రుపురోహితునిఁ దెత్తు
నగ్నిసాక్షికముగ వివాహమున నీమె
పాణి గ్రహియించి యెలమి నీపట్టనమున
కరిగి నిత్యాభ్యుదయముల నందుమయ్య. 196

చ. అనవుడు మందహాసరుచిరాననుఁడై నృపసూనుఁ డట్లె కా
కని తలయూఁపఁ, గుండల నిజాత్మఁదలంచుకొనన్ మదాలసా
జనకపురోధ తుంబురుఁడు సన్నిధిసేసి విధిప్రకార మ
గ్నిని బ్రణయించి మాంగళికకృత్యపురస్సర మందు వేల్పు
చున్. 197

క. ముదమునఁ 'దదేవలగ్నం
సుదిన' మ్మనునప్పురోధసునినుడిబడి న
య్యది సుముహూర్తం బై
కుదుర నృపతికొడుకు పెండ్లికొడుకై యమరెన్. 198

క. తరుణి మదాలస పాణిం
బరిగ్రహించెను వినూతనస్పర్శసుఖాం
కురితపరస్పరచేతః
స్ఫురణముగా సురలు గురియఁ బూవులవానల్. 199

ఆ. మఱి గృహీతయైనకరము గృహీతహా
కరము నొప్పె ఘుర్మకంకణాంచి
తమ్ము లగుచుఁ గంకణమ్ములు దొల్తఁ దా
ల్చినగృహిత్వదీక్ష యినుమడింప. 200

ఉ. దాతృ గృహీతృ ధర్మములు దాన వహించుటఁ దుంబురుండు ముష్
దాతగనై త్రివర్గము నిదంసహచ ర్యనతిక్రమంబుగాఁ
బ్రీతిఁ భజింపు మన్నఁ బృథివీవరసూనుఁడు నగ్నిసాక్షిగా
'నాతిచరామి' యంచుఁ బ్రతినన్ బచరించెఁ దదర్థవేతృతన్

సీ. అట్లు లయ్యిర్వురకు వివాహం బొనర్చి
తుంబురుం డేఁగె స్వతపోవనంబునకును
గుండలయు గుండెబరువు డిగ్గుటను దీర్ఘ
సేవకై యేఁగఁ గోరి నెచ్చెలిని జేరి. 202

క. కృతకృత్యరాల వైతివి
శతపత్త్రదళాక్షి ! నీయసాధారణసు

వ్రతముల పరిపాకమ్మై
పతి యనుపమ సుగుణశాలి ప్రాప్తించెఁ గదే. 203

సీ. అత్తమామలసపర్యల నేమఱక యింత,
తలలోనినాల్కచందమున మెలఁగు
మాఁడుబిడ్డలకు నైదోఁడవై యెలమిఁ బూ
సలలోనిదారమ్మువలెఁ జరింపు
మతిథివర్గముల కిష్టార్థప్రదాత్రివై
కన్నతల్లియ యనం గణుతి కెక్కు
మధినాథు నానుకూల్యముఁ గాంచి పాలఁ జ
ల్లిననీ రటు లభిన్నతను దలిర్పు
జ్ఞానరత్నాకరం బనుఖ్యాతి వీర
మాతవై రాజమాతవై పూతచరిత
భూతలము పావన మొనర్పు మాత తాయు
రఖిలసుఖసంపదాఢ్యవై యలరుమమ్మ. 204

క. అనుచు మదాలస కేవో
తనియక చక్కట్లు శతవిధంబులఁ బ్రేమం
బునఁ జెప్పి చెప్పి నృపనుతుఁ
గని నతయై యిట్లు వినయగరిమం బలుకున్. 205

శా. ధర్మాధర్మవిదుండ వుత్తమకులోత్పన్నుండ వంచత్కలా
మర్మజ్ఞుండవు నీకు బోధ మొనరింపన్ బ్రాజ్ఞులే జంక నీ
నర్మాజీవలు కాంత లోపుదు రె యైనన్ బోటినై గల్గునా
కూర్మిన్ సుద్దులు మీకునిద్దరకు వాక్రుత్తున్ గుమారాధిపా!

క. భరించువాఁడు భర్తయు
భరియింపఁదగినమగున భార్యయు నగు సం
చెఱఁగి యవిపన్న మగుగతి
భరియింపగ వలయుఁ బత్నిఁ బతి యత్నమునన్. 207

క. దారానుకూలతనె పతి
కారూఢిఁ ద్రివర్గసిద్ధి యగుఁ బాణిగృహీ
తీరహితున కడుగంటక
మూరునె ధర్మార్థకామముల నొకటేనిన్. 208

చ. పతి నెడఁ బాసినట్టిపతివత్నికి ధర్మము నర్థకామముల్
సతి నెడఁబాయుభర్త కటు సర్వము వ్యర్థమ యంచెఱింగి దం
పతులు పరస్పరాశ్రయ సమార్జిత తత్పురుషార్థ లబ్ధ సం
తతసుకృతాత్తమోదరస తన్మయులై విలసిల్లు టొప్పగున్.

గీ. అనుచు దాంపత్యధర్మంబు లాల్మగలకుఁ
బలికి యాయుర్యశస్సుత వైభవాదు
లంద దీవించి కుండల యరిగె దివ్య
గతిఁ దపము సల్పి తనపతిఁ గలియుకోర్కి. 210

వ. అని జడుండు మదాలసాపాణిగ్రహణంబు చెప్ప జనకుండగు
భార్గవుం డారాజు మదాలసతో నెట్లునిజపురికినరిగెననుటయు.

ఆశ్వాసాంతము.

శా. నిష్కాపట్యమనస్సరోరుహుఁడు క్షోణీదేవదేవార్హణా
విష్కారాచ్ఛయశఃప్రసూనసురభిప్రేయోఖిలాశుండు, శ్రో

చిష్కృశప్రతిమప్రతాపవిజితాశేషప్రతిస్పర్థిదు
ర్మాపకృద్యుండును రంగమాహ్వాయసతీరత్నార్పితాంతర్యుఁ
డుఁ. 212

క. పాత్రాపాత్రవివేచన
పాత్రవితీర్ణప్రభావభాజనుఁడు సుధీ
స్తోత్రార్హోత్తమశీలప
విత్రితజగతీతలుండు విమలయశుండుఁ. 213

మాలినీవృ. ధరణితలవతీర్ణోద్దగ్గిశానాఘుఁ డుర్వీ
భరణనిపుణమేధార్వాక్సు రేజ్యుండు నేనో
హరణకరణదక్షప్రత్యక్షసేవారతుండుఁ
జరణపతితవిద్విట్చక్రుఁ డొప్పారు నెంతేఁ. 214

గద్యము. ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ 'కవితాభూషణ, విద్వత్కవిశేఖర' వెంపరాల సూర్యనారాయణ నామధేయ ప్రణీతం బయిన 'మదాలసావిలాసంబునఁ' బ్రథమాశ్వాసము.

---

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమద్భాస్కర పూజా
సామాన్యమహత్త్వ లబ్ధ సతతోదయుఁ డౌ
శ్రీమంతుఁడు శ్రీకారో
ద్దాముఁడు శ్రీసత్తిరాజు ధర వర్ధిల్లున్. 1

వ. జ్ఞాననిధి యగుజడుండు జనకుఁ డగుభార్గవున కిట్లను, నట్లు మదాలసాకువలయాశ్వులం బరిణయ శ్రీభాసమానుల నొనర్చి తుంబురుండు నిర్గమించుడుం గుండలయు యథేష్టం బరిగెనని చెప్పితినిగదా! జనకా! తదుపరివృత్తాంతం బాలింపుము.

—♦ కువలయాశ్వుఁడు పాతాళకేతుని జంపుట ♦—

ఉ. అంత ఋతధ్వజుండును మదాలసతోఁ దురగంబు నెక్కి య
త్యంతధృతిన్ రసాతల మతందరితె వెల్వడుచుండ, దైత్యులం
తంతన చూచి యేచి యహాహా! మన యేలిక దెచ్చికొన్నసీ
మంతినిఁ గొంచు నొక్కనరమాత్రుఁడు పోయెడి నంచు
నార్చుచున్. 3

ఉ. పట్టుఁడు కొట్టుకొట్టుఁ డని పర్వుల నాజగజెట్టి ముట్టుచున్
బట్టిస ఖడ్గ కుంత శర పాశ గదాద్యమితాయుధంబులన్
గొట్టుచుఁ గొంద ఱడ్డుకొనఁ గొందఱు తొందర మీఱఁగా
జగా
జెట్టి దితిపుత్రసూతిఁ గని చెప్పిరి యప్పటిముప్పు చొప్పడన్. 4

చ. అది విని క్రోధరక్తనయనాంచలసీమల విస్ఫులింగముల్
సెదరఁగఁ జూచుచున్ సకలసేనలఁ జీరు చుదాయుధంబులై
గొదకొని "పొండ"టంచుఁ బురికొల్పుచు దైత్యుఁడు వర్మ కార్ముక
ప్రదర నిషంగధారి యయి క్రన్నన మార్కొనె నన్నృపాత్మజున్. 5

సీ. ఎటు వోదు నిలునిలుమీ యంచు వెనుకొంచు
ముసలగదాదుల విసరువారు
కదల నిత్తుమె యొక్కపదమాత్రమే నంచుఁ
గినిసి యంపఱఁ బ్రయోగించువారు
మానినీచోర ! చంపక నిన్ను విడ మంచు
శితశూలతతుల వర్షించువారు
నరమాంససంతర్పణ మ్మబ్బె నేఁ డని
పృథుఖడ్గములఁ గాఁడ నేయువారు
నగుచు యోద్ధలు క్రుద్ధులై యఖిలదిశలఁ
గముఁదురీఁగలు రేఁగినగతిని గవియ
విడుతొ గంధర్వసుత ? మేను విడుతొ ? యనుచు
వెనుకఁ బాతాళకేతుండు మొనసి దాఁకె. 6

శా. ఆరీతిన్ దిదశారిసైనికులు శస్త్రాస్త్రప్రవృష్టిన్ దనున్
గారాకూర మొనర్ప; లేనగవునల్కన్ జిమ్మనెమ్మోముతో
నారాట్పూతి గుణధ్వనుల్ సెలఁగ శాతామోఘనానా మహా
నారాచంబుల నొక్కవ్రేల్మిడిన ఛిన్నాభిన్న మున్ జేయుచున్

ఆ. దానవప్రయుక్త దారుణదుర్ఘణ కుం
తాసి పరశు తోమరాదిశస్త్ర
ఖండతతిఁ దదీయమండనధూళిఁ బా
తాళ మెల్లఁ గప్పి తనివిసనక. 8

చ. తలఁచినచోట రివ్వున నదాటుగ దాఁటు హయంబు నెక్కి వే
వెలుఁగటు తేజరిల్లు, చరివీరు లులూకము లై తొలంగి పో
నలికులవేణి వేఁగనుల నారసికొంచును సొంయుగీనతా
కలనము వేలుపుల్ పొగడఁగా విహరించెఁ గుమారుఁడాజిలో

మ. వడి నొక్కమ్మడి ముట్టి కాద్ముకకళావైశారదీసార మే
ర్పడఁ జూపన్ దలపోసియున్ జెలి భయభ్రాంతాత్మ యౌ
నేమొ? యం
చెడఁ జింతించి 'సవాహనాయుధబలాన్వీతంబు పాతాళకే
తుఁడు భస్మం బగుఁగాక' యంచు ధనువందున్ గూర్చెఁ
ద్వాష్ట్రాస్త్రమున్. 10

శా. కంపించెన్ ధరణీతలంబు సహరిత్కం,బంబరం బూఁగె, నై
లింపశ్రేణి వణంకె, నింకె జలధుల్, దిగ్దంతు లల్లాడె, ఘో
షింపం జొచ్చెను జంతుసంతతు, లిలాభృత్సాతి సింగాణిసం
ధింపన్ ద్వాష్ట్రమహాస్త్రమున్ దదుదితాగ్నిజ్వాలమాలా
హతిన్. 11

సీ. రథదారవాయుధప్రతతు లభ్రంలిహ
పవనధూతక్షారపటలి గాఁగ
దంతావళాశ్వాశ్వతరపంక్తి యొండొండు
రహిచెడి భస్మమై రాశిపడఁగ

రత్నసువర్ణదుర్వర్ణభూషాశ్రేణి
రవిలి ద్రవం బయి నిప్పుగాఁగ
పటపటధ్వనులఁ గపాలాస్థిరదనాళి
తూర్ణంబ చూర్ణమై ధూళి రేఁగఁ
గాలి బూడిదయయ్యెఁ బాతాళకేతుఁ
డనవశేషమ్ముగా స్వసైన్యంబుతోడఁ
బార్థివకుమార ముక్త తత్త్వాష్ట్రబాణ
జనిత జాజ్వల్యమాన కృశానుధాటి. 12

ఆ. కపిలతాపసేంద్రు విపులకోపాగ్నిచేఁ
గ్రాఁగి భస్మమైనసాగరులటు
భస్మరాసు లయ్యెఁ బాతాళకేతుఁడా
దిగ సురారు లెల్లఁ దిక్కుకుండ. 13

సీ. అపుడు జయలక్ష్మితోడ నర్ధాంగిలక్ష్మి
తోడఁ గూడి కుమారుఁ డామేడితప్ర
భాయుతుం డౌచుఁ గువలయాశ్వంబు నెక్కి
యతలనిర్గంతయై వచ్చెఁ గుతలమునకు. 14

మదాలసాసహితంబుగ గాలవునియాశ్రమంబునకుఁ గువలయాశ్వుఁడు వచ్చుట

చ. క్రమగతిఁ గాలవాశ్రమము గానఁగరాఁ దురగంబు నంతదూ
రమునన డిగ్గి భార్యకుఁ గరం బవలంబ మొసంగి డించి సం
భ్రమము వినీతియున్ వెలయఁ, బాదగతిన్ జని, మానిపాదప
ద్మములను వ్రాలి మ్రొక్కెఁ బ్రమదంబున నమ్మునియున్
దటాలునన్. 15

గీ. తననుశాసనమునకు నుద్దవిడిఁ దిగిచి
గాఢపరిరంభణమ్మున గారవించి
దీవనలు సల్పి మానుషీభావ మూని
వచ్చుజయలక్ష్మిఁ బోలునవ్వనితఁ గాంచి. 16

శా. వత్సా! నీ వసహాయశూరుఁడవె కావచ్చున్ 'సురారాతిమా
యోత్సేకంబున నేమి సేసెనొకదా యొంటిన్ జనెన్ రాట్సుతుం
దుత్సాహంబున' నంచుఁ గొందలముతో నుండన్ సమీపింతు వి
ద్యుత్సామ్యాంగిని దీనిఁ జేకొనుచు మత్ప్రఖ్యాతిరేకంబునన్.

చ. ఎవ్వతె తండ్రి యీసరసిజేక్షణ? యెక్కడఁ జిక్కె? రక్కసుం
డెవ్వలనన్ దొఱంగె? వధియించితివో? బెదరించియేని దా
దవ్వుగఁ దోలి వత్తొ? విశదంబుగఁ జెప్పు మనన్ ఋతధ్వజుం
డవ్వశినేతకున్ దమయుదంతము సాంతము సెప్పునయ్యెడన్.

చ. అడఁకువ సిగ్గు దొట్టిల మదాలస మౌనిపదాబ్జధూళిఁ గ్రొ
మ్ముడిఁ బడఁ జాగి మ్రొక్క మునిపుంగవుఁ డర్మిలిఁ బెక్కు దీవనల్
నొడువుచు నీకతనంబున మనుష్యజగంబు పవిత్రమయ్యెఁ జూ
పడతుఁక యోగిమాత వయి భాసిలుమా పరమార్థవేత్రివై

వ. అని దీవించి కువలయాశ్వుం గాంచి యిట్లను.

మ. పరపీడాకరుఁ బాపవర్తను వధింపన్ —సాధుసంచారత
త్పర శోకాపనుదోపకార మొనరింపన్ —విప్రుఁడై నీకుఁ జే

కులపుణ్యాంబులపంటయేకద యిట్టుల్ కూర్చెఁ ద్రిలోకై
కసుం

దరి నీ వీరపతివ్రతఁ దెలియు మన్నా! కర్మవై చిత్ర్యముల్

సీ. మునిరక్షకై దానవుని జంపు బీభత్స
కృత్యమ్మునకుఁ గాద యేఁగుదెంతు
ఘోణి యాదితిజు వెన్కొని తమోనీరంధ్ర
బిలమునఁ బ్రాణార్తిఁ గలఁగఁబడవొ
బిలము వెల్వడఁ బోవఁ జెలియ దక్కదె జగ
న్మోహనాకారమ్ము మూరిఁబోవ
వెనువెంట వైరశుద్ధిని గాంతుఁగాదె ర
క్కసుల రౌద్రమ్మునఁ గసిమసంగి

యిప్పు డీస్వయంవరతోడ నేఁగుదెంచి
నాకనుంగవ కిటు విందొనర్తు వదిర!
యేటి కరుదెంతు? తుదిఫల మేమి యబ్బెఁ
గర్మవైచిత్రి యిట్టిదిగా నెఱుంగు. 21

మ. అని కర్మంబు తెఱంగు సెప్పి-మదమోఘాశీర్వచశ్శక్తి సం
దన సంపత్పురుషాయు షానుపమవిద్యా భూరిసామ్రాజ్యరం
జనముల్ సేకుఱ మీరు దంపతివిలాసప్రస్థతఁ విశ్వమం
దున దృష్టాంతములై కొనుండు సతతానోన్యానపాయిత్వ
ముఁ. 22

క. అంచుఁ బ్రియ మార దముని దీ
వించి యనుప వెలఁదితోడ వెస హరి నధిరో

హించి నిజపురవరంబు గ
మించెఁ గుమారుఁడు జనుల్ సమీపించి కనన్. 23

—♦ కువలయాశ్వుండు పురమునకు వచ్చుట ♦—

గీ. మదను గెల్చి తదీయసామ్రాజ్యలక్ష్మి
నాచికొని వచ్చెనో యన రాచపట్టి
నగరివీథుల నయ్యెలనాగఁ గూడి
రాఁ గని పురీజనంబు వెఱఁగుపడుచు. 24

శా. ఈలజ్జావతి, యీనవీనచపలాహృద్యాంగి, యీ యౌవన
శ్రీ లీలాస్పద, యీసుధాంబుధిచలోర్మిస్వాదుమందస్మిత
వ్యాలీఢేక్షణ, యీపరిపుల్లదరవిందానందకృత్పాణి, యీ
నాళీకానన, మాకుమారనృపపుణ్యస్ఫూర్తి గా కింతియే. 25

సీ. అది చంద్రబింబమే యగు వెన్నెల తొలంకె
మీఁద నీలాంబుదోర్మిక లెసంగె
నవి పరిఫుల్లావదాతాంభోజములె యగు
గండుఁదుమ్మెద లందుఁ గదలుచుండె
నది శంఖమే యగు నాతిరేఖలు పరిక్రి
మావాప్తకార్శ్య మయ్యాదె తనర్చె
నవి రథాంగమ్ములే యగు మీఁదినునుచేల
నెగఁజిమ్ముకొని జంట నెగయఁజూచు

గీ. నవె కుసుమమాల. లదియె మి, న్నవియ సైక
తము, లవె యనంటు, లవియ పొందమ్ము, లనుచు
నమ్మదాలసమానోజ్జ్కకమ్ము గాంచి
పొగడి రప్పౌరజనులు గుంపులుగఁ గూడి. 26

గీ. ఇటు ద్వితీయాద్వితీయుఁడై యేఁగుదెంచు
నందనునిరాక వించు నానంద మొంది
మాంగళికవాద్యములతో సమాత్యభృత్య
సహితుఁ డౌచు నెదు ర్వచ్చె జనవిభుండు. 27

వ. అంత నాఋతధ్వజుండు సకళతత్రింబుగాఁ గువలయాశ్వంబు నవరోహించి వృద్ధానుపూర్వకంబుగా గురుజనంబులకు వందనం బాచరించి, వారలయాశీ రాలింగన దరహాసపరిహాస కుశలానుయోగంబుల నలరి, వివిధమంగళ మహావాద్య ధ్వనుల దిక్కులు పిక్కటిల్ల నాస్థానమండపమ్ము దరియం జొచ్చి నిజవృత్తాంతశ్రవణకుతూహలచిత్తు లగుయావజ్జనంబులు వినఁ దనచరిత్రమ్ము సాంగోపాంగ మ్మొకయింగం బల్కం బొంగి శత్రుజిన్నృపపుంగవుండు కొడుకుం గవుఁగిలించుకొని శిరంబు మూర్కొనుచు ని ట్లనును. 82

—♦ శత్రుజిత్తు కొడుకుం బ్రశంసించుట ♦—

చ. మునులభయంబుదీఱఁ దితిపుత్రతతిం బొరిగొన్న ధర్మమూ
ర్తిని నినుఁ గాంచఁ గల్గుటఁ దరించితిఁ; బూర్వులు మత్కులుల్ గడిం
చినయశ మేను సుస్థిరము చేసితి, నప్రతిమప్రతాపపూ
ర్తినిదదుపాత్తకీర్తి నొనరించి తహో బహుళీకృతంబుగన్. 29

సీ. జనకుఁ డార్జించినధనయశోవీర్యముల్
మలఁప కోమెడువాఁడు మధ్యముండు
తనశక్తిఁ దండ్రికంటెను గడించిన యశో
విత్తాది గల్గువాఁ డుత్తముండు

తండ్రినాఁ డెఱుఁగనిధనవిక్రమాదు ల
త్యూర్జమూవాఁ డుత్తమోత్తముండు
పిత్రార్జిత ఖ్యాతి విత్త శౌర్యములు రూ
పఱఁ జేయువాఁ డధమాధముండు
తాన ప్రథ కెక్కునాతఁ డుత్తముఁడు, పితృపి
తామహఖ్యాతుఁ డరయ మధ్యముఁడు, తల్లి
చేతఁ దద్బాంధవులచేత ఖ్యాతుఁ డైన
యాతఁ డధముఁ డటందురు నీతివిదులు. 30

గీ. మాసిసంతాన పాతాళయాన యాతు
ధానహానమ్ములను న న్నధఃకరించు
టను నరోత్తముఁ డో, దిట్టనినుఁ గనుటను
ధన్యుఁడను నేనుఁ బుత్రివర్గణమునందు. 31

గీ. పుట్టుకను మర్త్యజగము, చేపట్టినట్టి
గరితకతన నమర్త్యజగంబు రిపు ని
శాతనంబునఁ బాతాళజగము, కీర్తి
చంద్రికల ముంచితివె యొక్కసారి నేఁడు. 32

గీ. అనుచు నృపుఁ డన, సభ్యు లత్యద్భుత ప్ర
మోదముగ్ధాత్ములై సుఖంబుగఁ గుమార !
యిమ్మదాలసఁ గూడి వేయేండ్లు మనుమ
టంచు దీవించి యంచిరి యంతిపురికి. 33

క. రమణీయుతుఁడై శుద్ధాం
తమున జననిఁ గాంచి తత్పదద్వయికిఁ బ్రణా

మము సేసి తత్పరీరం
భమునఁ గోడలును దాను బడసి రవశతఁ. 34

వ. అప్పుడు జననియు శుద్ధాంతవర్తిను లగుముత్తైదువలును నమం
దానందమ్ము నొంది.

క. అవిరతసుఖసంపద గను
మవినాభావమున నివ్విధయచ్చరతనయా
పరివరం గూడి పృథుయశో
దరివిణ్ణులు సెలఁగ ధర్మతత్పరమతివై. 35

వ. అని యాశీర్వదింపఁ గువలయాశ్వుం డుపల్లజ్జావనతవదనుండై
యలరారె, మదాలసయు సమ్మదాలసయై యంతిపురంబున
కభినవశోభం గూర్చె మఱియు. 36

ఉ. వేకువ సత్తమామలపవిత్రపదాంబుజపాళికిఁ నమో
వాకము సౌఖశాయనికభావమునఁ బచరించి, దేవతా
నీకము సాటి భర్త కననీయప్రభక్తిని మొక్కి కాని యా
కోకిలవాణి యెద్ది గనుగోఁ దలపోయ డొకప్పుడేనియుఁ. 37

ఉ. నీరరుహాస్య కాల్యకరణీయము లొయ్యనఁ దీర్చి, మై నలం
కారము లెల్లఁ దాల్చి, యలకల్ సరి దువ్వి, లలాటమందుఁగా
శ్మీరతమాలపత్త్రము రచించి, కనుంగవ మిన్కుఁగాటుకఁ.
దీఱిచి, చూడఁలాడు రతిదేవి యనఁ బతిభావసేవధిఁ. 38

ఉ. ఐహిక పారలౌకిక విధావసరంబు లెఱింగి యవ్వరా
రోహ దనంత భర్తకు గుణత్వము పూనియుఁ బాదదాసియై
యూహల కందనట్టిపను లోర్మి నొనర్చి యలచ్చ చాత్మలీ
లాహసితంబునఁ మదిఁ గలంకలు వాయఁ జరించుఁ జెంగటఁ

శా. శుద్ధాంతవ్యవహారముఀ జననియుఀ క్షోణీమహారాజ్యముఀ
శ్రీద్ధాళుండయి తండ్రియుఀ గనుచు నుండఀ బ్రేయసీ విభ్ర
మా
బద్ధాంతఃకరణప్రవృత్తియయి భూపాలాత్మజన్ముం డనా
విద్ధప్రక్రియ నింద్రభోగముల సేవించుఀ సదానందుఁడై. 40

సీ. ధవళాతిమసృణసుధాలిప్త మణిసువ
ర్ణద్వితిభూమహర్మ్యములయందు
నవనవోదిత సౌమనసవాసనాసవ
మంజులోద్యాన నికుంజవీథి
నవరత్నమయదరీసువిశాలసానుర
మ్యాప్రాంశుతరకృతకాద్రులందు
గిరిఝరీసలిలశీకరసముత్తాల్ప శీ
తలిమ లాలితసైకతములయందు
సరసమధుపాన, మృదుగానే, చాటువచన
రచన నర్మానులాప సప్రణయకలహ
లాల నోల్లాస సుమశర కేళి లోల
మతుల విహరింత్రు సతత మప్పతియు సతియు. 41

వ. అట్లమ్మదాలసాకువలయాశ్వులు తృతీయపురుషార్థనిష్ణమా
నసులై యిష్టవిహారంబులఁ కాలమ్ము మధురాతిమధురంబు
గఁ గడపుచుండ నొక్కనాఁడు కుమారునారసి శత్రుజన్మహీ
రమణుండు సానురాగంబుగ ని ట్లను. 42

—♦ మునులయాశ్రమముల రక్షింపఁ గువలయాశ్వుని దండ్రి నియోగించుట ♦—

శా. అన్నా ! నీవిననట్టిధర్మములు లే, వైనన్ వయోవృద్ధ నౌ
టన్, నేఁ జెప్పకతప్ప, దీవునవి వింటన్ దప్పు, దెప్పాట న
చ్చిన్నం బోగతి సర్వధర్మములు రక్షింపన్ విధాతృండు రా
జు న్నిర్మించుఁ దదాత్తరక్షమయి ప్రోచున్ ధర్మమప్పార్థివున్

క. అంబుజభవాండములు సత
తంబు నిరాలంబ సురపథంబునఁ గృతసీ
మంబుగ ధరించుటన 'ధ
ర్మ'ంబనఁబడుఁ గాన దాని రక్షింపఁ దగున్. 44

క. పంచమహాభూతముల ధ
రించి యథోచితముగాఁ జరించెడు నటు గా
వించెడి యాధర్మము జని
యించునిదానమ్ము శ్రుతిసుమీ యరయంగన్. 45

గీ. అట్టినిగమమ్మునకు ద్విష్టులై యధీతి
బోధనాచరణైధనములను దాత్రి
లగుట నామునిజనుల నిరంతరంబు
గాచుకొనవలెఁ గన్నిడి రాచవారు. 46

గీ. ప్రజలయాదాయమున షష్ఠభాగ మవని
పాలునకుఁ బాలువడునట్టిపగిది మునులు
సలుపు వివిధతపంబులఫలములందు
షష్ఠభాగంబు వసుమతీజానిఁ జెందు. 47

చ. మునులు కలంగుచో నిగమముల్ చెడు, రూపఱుధర్మ, మంతఁ బె
ల్చనఁ బరమేష్ఠిసృష్టి యఖిలంబును మేరలు మీఱిపోవుఁగా

వ్రున మహీభర్త లోకహితముం దలపోసి మునీంద్రరక్షకై
మనసిడి ధర్మసమ్మతి సమస్తజగంబు భరింపఁగాఁ దగున్. 48

ఉ. కావునఁ దత్త్రియీతను నఖండదయన్ లభియించినట్టి సం
భావిత సర్వలక్షణసమంచిత మానలతేజి నెక్కి భూ
మీవలయంబు నెల్లెడ భ్రమించుచు నిచ్చలు రాక్షసాది బా
ధావిధురంబుగా మునివితానముఁ జూచుచుఁ గాచు
చుండుమా. 49

వ. అని జనకునిచే నాజ్ఞప్తుండై, ఋతధ్వజుండు కువలయాశ్వంబు నెక్కి దివసముఖంబున యావత్కువలయంబునం బరిభ్రమించి మధ్యాహ్నము నిజనివాసంబు సేరి మజ్జన, నిర్జరపూజన, భోజనాదికంబుల నిర్వర్తించుకొని మదాలసా సహాయుండై వాసరావశేషంబును యామినులును క్షణకల్పంబుగఁ నిష్ట విహారంబులఁ బుచ్చుచుండు. 50

చ. అతఁ డనయంబటుల్ కువలయాశ్వము నెక్కి మరుజ్జవంబునన్
క్షితిఁ గలయన్ భ్రమించుచు ఋషిప్రవరాశ్రమపాళులన్
సుర
క్షితముగఁజూచు చొక్కపుడు చేరె ఖరాంశునిదీప్తికిన్ బిపా
సితుఁ డయి శీతలామలరుచిప్రచురాంబు కళిందజానదిన్. 51

—♦ కువలయాశ్వుండు కపటమునిచే వంచితుండగుట ♦—

క. చేరి హయముఁ దానును గడు
పార జలము ద్రావి కువలయాశ్వుఁ డపుడు త
త్తీరమునఁ దపోవన మొకఁ
డారసి వెఱఁగంది డెందమం దిటు లెంచెన్. 52

శా. నిచ్చల్ వచ్చుచుఁ బోవుచుందు నెపుడున్ వీక్షింప నియ్యాశ్రమం
బిచ్చోఁ; నచ్చెరువయ్యె! నేతపసిదో యీక్షింప కే న్నెల్లుపో
వచ్చున్, లచ్చిధరామహోక్తిగతయై భద్రాకృతిన్ వెల్గు నం
డిచ్చున్ వారలమెచ్చుదీవనకు నీడే కామధేన్వాదులున్?

ఉ. కాన వినీతవేషమునఁ గ్రిచ్చఱ నియ్యుటజంబు చేరి య
స్థానులసేమ మారసి క్రమంబుగఁ బోవుదుఁగాక యంచు భూ
జాని హయంబు డిగ్గి భయసంభ్రమయుక్తత నేఁగి కాంచె ని
ష్ఠానిధియైమఖంబెదియొసల్పుచునున్న మునీంద్రునొక్కనిన్.

వ. కాంచి యంతర్గతంబున.

క. మదిమఱపున నెంతటి త
ప్పిదమొనరించినాఁడ నిట్టిభీకరనియమా
స్పదు నిమ్ముని నిన్నాళులు
గదిసి విచారింప నితనికష్టసుఖంబుల్. 55

చ. అనుకొనుచున్ ఋషీశ్వరు పదాబ్జములన్ గయి వ్రాలి మ్రొక్కి ని
ల్చిన నృపసూనువంక దయ చిల్కు కటాక్షనిరీక్షఁ గాంచి, దీ
వన లొనరించి యర్ఘ్యమును బాద్యము నిచ్చి స్వయంబుగాఁ గుశా
సనమిడి మౌని యాధరణిజాని వచించు నిమీలితాక్షుఁడై.

శా. వత్సా! శత్రుజిదాత్మజాతుఁడవుగావా? క్షేమమాయాధరా
భృత్సింహంబున? కన్వహంబును దపస్విశ్రేణిఁ గావంగ యా

వత్సర్వంసహా చుట్టివత్తువె? యహో పాతాళకేతుఁడ జగ
త్కృతాన్సపాత్రుఁ వధించి తీవకద? నీదోశ్శక్తి కీడున్నదే ? 57

చ. తనయొనరించుదుష్క్రియకుఁ దగ్గఫలంబునువాఁడె పొందె దు
ర్జను నశుభంబుగాక శుభసంపద పొందునె? కంటినిండ ని
ద్రనుగనఁగల్గినారము, దురాత్ముఁడు వాఁ డెపుడేఁగుదెంచి చం
పునో యనుప్రాణభీతిఁ దపముల్ బొనరించుట యెట్లొ
చెప్పుమా 58

క. నీవంటిభవ్యునిల్లా
లై విశ్రుత గాఁదగినమదాలస నాఘో
రావిలమతి పెండ్లాడం
గా వాంఛించెనఁట కన్నుగానక తమిమై. 59

సీ. నవమాలికాలతాంతములమంజరి ధరి
యింప మర్కట ముత్సహించినట్లు
లభినవామృతధార నాస్వదింపఁ దలంచి
నీచుపా ముర్వీళులూరు కరణి
సుకుమారమలనియానిలకుమారసమితి నా
సించెడు గంధమూషికమువోలె
ఘనసార గంధిలగంధసారస్థాస
కము గోరుగ్రామసూకరముపగిదిఁ
దరుణిమాకీర్ణ పూర్ణ సౌందర్యసౌకు
మార్యసుషమావిశేషసంపన్న భువన
మోహనాకార గంధర్వపుత్రిఁ గోరె
నట్టి మాంసాశి క్రిందు మీఁ దరయకుండ. 60

ఉ. కోరుటమాత్రమే సఖులఁగూడి నెలంతుక పూపుఁదోఁట నిం
పార విహారమున్ సలుపు టారసి వంచనమించఁ గొంచు స్వా
గారము చేర్చి మన్మథవికారము చూపి నికార మొంది యా
క్రూరుఁడు దారుణంబుగ నిరుద్ధ నొసర్చి యపార్థుఁ డయ్యెనే.

క. 'ఆఁడుకోల యెంతవారికిఁ
గూడునె కులనాశనమునకున్ హేతు'వనన్
వాఁ డెటుల దక్కు నీచే
బూడిద గాకుండ సైన్యములతో నాజిన్. 62

ఆ. అనుచుఁ గువలయాశ్వు వెనుకటివృత్తంబు
పూసగ్రుచ్చినట్లు మునుము వెట్టి
పలుక మదిని నబ్రపడుచు నారాసుతుఁ
డనియె వినయవినమితాంగుఁ డగుచు. 63

క. దేవా! మీసంటి ఋషుల
దీవనలబలంబునన కదే దితిజు మృతున్
గావింపఁ గల్గినాఁడ శ
చీవిభు నుఱనట్టిశౌర్యసింధు మదాంధున్. 64

ఆ. అనుచుఁ గనులు విచ్చి యనె ముని వత్స! పా
తాళకేతుతమ్ముఁ దాళకేతు
మఱచినాఁడ వకట! మాపాపమున నేమొ
పలుకఁ దరమె వాఁడు పఱుచుపాట్లు. 65

ఉ. నాయొనరింపఁ బూనుసవనంబును ముమ్మఱు వమ్మొనర్పఁగా
నేయెడ దిక్కుగాన కిట నేకత మొక్కఁడ నెట్లొ పూర్ణమున్

జేయఁగఁ బూనితిన్ బెదరుచిత్తముతో నెపుడేఁగుదెంచి దై
తేయుఁడు మాయసేసి మఖదీక్షఁ గలంచునొ యంచు
భూవరా ! 66

చ. ఒకతఱి నార్పు నగ్నులు, మఱొక్కపు డధ్వరశాల యెల్లని
ప్పుకలను గప్పు, నొక్కపుడు బూది యొనర్చును సుస్రుక్స్రు
వాదులన్,
వికల మొనర్చుఁ బాత్ర, లొకవేళను బశ్వవదానముల్ హరిం
చి కలఁచు, నే మనన్ దితిజుచేష్ట లసహ్యము లెట్టివారికిన్.

క. నాపాలిదైవ మిపు డవ
నీపాలక! నిన్నుఁ దెచ్చె నేఁ డొకదినమే
కాపాడ నవభృథం బగు
నాపని యగు నీవున్న్ జనన్ వచ్చుఁజుమీ. 68

చ. మఱచితి యాగదక్షిణ సమార్జనసేయుట దుష్టుఁ డొమహా
సురుకతనన్; గుమార! నినుఁజూడ స్మృతిన్ దవిలెన్ భవద్గళా
భరణ మొసంగుచోఁ గ్రతువుపారముచేరు, శుభంబునీకుఁ జే
కుఱుఁ బృథుకీర్తితో వృథ యగుంగద దక్షిణ లేని యాగ
ముల్. 69

చ. అన ననహాయశూరుఁడు మహాసుకలుండగు నాఋతధ్వజుం
డనయము నాత్మఁబొంగి ధనువంది యధిజ్యముసేసి టంక్రియా.
ఘన మొనరించి నిర్భయముగాఁ గ్రతుపూర్తి నొనర్చు
కొమ్మి కా
తొను మఖమున్ నిశాచరుని దున్తుఁ దొలంతుఁ దదంత
రాయమున్. 70

క. ఇదె మణిహారము గొని స
మ్మదమున దక్షిణగ నొసఁగి మఖము సమాప్తం
బొదవించికొను మనుచు నృపుఁ
డెద వ్రేలు సనర్ఘ హార మిడె ముని కేలన్. 71

వ. అప్పు డప్పరమహర్షి హర్షంబు నొందుచు నాశీర్వదించి.

ఉ. ఆరయుచుండు మాశ్రమ మిలాధిప! భూప్రజపుష్టికై నదీ
వారి మునింగి యవ్వరుఁడు వైదికవారుణమంత్రపంక్తి నే
పార నభిష్టుతించి సరయుం బరుదెంచెడిదాఁక; నెవ్వఁ డా
క్రూరుఁడు నాసవంబు చెడఁగొట్టఁగఁగన్నిడి యున్నవాఁడునూ

గీ. అనుచు హారంబు గొనుచు నమ్ముని నృపాల
పుత్రి ననుమతి యామునాంబువులఁ జొచ్చి
క్షణముననె వత్తు ననువాఁడు జాముసేపు
చనిన రాఁడాయె సాయాహ్నసమయమాయె. 73

ఉ. శూరుఁడు రాచపట్టి వెనుచూడ కధిజ్యశరాసుఁ డౌచు న
శ్వారసపాదియై శమధనోటజముల్ వలగొంచతంద్రుఁడై
యారయుచుండెఁ బశ్చిమదిశాంగనకై యనురాగ మూని యం
భోరుహమిత్రుఁ డాత్రమునఁ బోవుచు నున్నటు లయ్యె నయ్యెడన్. 74

క. రక్కసుఁడు గానఁబడఁ డే
దిక్కున నని తురగ మెక్కి తిరుగుచు మదిలో
నక్కువలయాశ్వుఁ డాత్రము
దక్కి యొకట నిలిచి యాత్మఁ దలపోసె నిటుల్. 75

మ. తలిదండ్రుల్ ప్రియయున్ విలంబమునకై త్రాసంబు గం
దే్రమో? ని
చ్చలు నీపాటికి నిల్లుసేరి సురపూజాపూర్వ మృష్టాన్నభు
క్తులఁదన్పొంది మదాలసామధురసూక్తుల్ వించునానందడో
లలఁదూఁగాడుదు నేఁటిదుశ్శకునముల్ భావింపభీ వుట్టెడున్.

ఉ. సప్తభుజలోచనము లిటు
లవ్యవధిగ నదరుచున్న వక్కట యితిక
ర్తవ్యత్వవిమూఢతఁ జే
తోవ్యథ వర్ధిల్లఁ దొడఁగె దుర్భర మగుచున్. 77

చ. అలకలు నెన్నొసంట గునియన్ జనుఁగవ్వ దొఱంగ, వా
తెఱన్
దొలఁగ విడెంపుజొత్తు, కనుదోయిని నిద్దురమంపు ముంపఁ గు
చ్చెళులు పదంబులన్ దవులఁజెల్వ ప్రభావమునందు సిగ్గుచే
నలయుచుఁబాన్పుడిగ్గు మధురాకృతి నాస్మృతిబింబితంబగున్.

శా. ఆజానేయుము నెక్కనున్నతఱి 'నాథా'యంచు నర్థోక్తిలో
రాజీవాక్షి స్మితద్యుతిన్ సుధలు జాఱన్ గంపమోష్ఠంబునన్
రాజిల్లన్ గనుఁగొంచుఁ బల్కకయ ద్వారప్రాంతసీమన్ మణీ
రాజీ రాజితసాలభంజికక్రియన్ రంజిల్లుటే తోఁచెడున్. 79

క. ఈపాటివిరహమున కిటు
తాపము గనుచుంటి నెట్లు తాళుదురో దీ
ర్ఘాపాయప్రియు లగుజా
యాపతులు వియోగవహ్ని కగ్గం బగుచోన్. 80

చ. అని యిటు ప్రేయసీ ప్రణయ మాత్మ గరంప జగంబ దెల్లఁ ద
ద్వనజముఖీమయంబుగ వివర్తమునొంద మనుండు ధ్యానతం
తునిబిడసీవనంబున మనోగతఁగాఁ బచరింప లోవెలిన్
వనితయ కానరా; ధరణినాథుఁడు తన్మయుఁడై కలంగుచోన్

క. తటుకున నాముని యామున
తటమున నిలువెల్ల నీరధారలు గాఁగన్
దిటవునఁ దోఁచిన రాసుతుఁ
డటుసని తోడ్తెచ్చి చూపె నాశ్రమ మెల్లన్, 82

ఉ. చూచిమునీందుఁ డాన్నృపతిసూనువచించె 'భవత్సహాయతన్
మాచిరకాలవాంఛలు సమగ్రముగా ఫలియించె, దిగ్జయ
శ్రీ చెలువార దీవనలు సేయుదు, మీపురి కేఁగి మమ్ము నీ
రాచటికంబునన్ మఱక రమ్మెపు డైనను సేమ మారయన్'

క. అని మాట మాటఁ బ్రేమము
దొనఁకఁగ నాశీర్వదించి యోడిఁదోడిఁ జన నెం
చినక న్నెఱింగి త న్న
మ్మునిని సెలవిడి యనుప నృపతి మొక్కి వినీతిన్. 84

◆— కువలయాశ్వుఁడు తనపురంబునకు వచ్చుట ◆—

ఉ. న్యాసము గొన్నయట్టిదివిణంబు తదీశిత కప్పగించిన
ట్లాసుగుణుండు గుండెబరువంతయు డింద, హయాధిరూఢుఁడై
వాసరనాథుఁ డస్తగిరిపై నొకజేనెఁడుదాలనుండ, ను
ల్లాసముతోఁ బురంబున కలంతమువేగయుతంబుగాఁ జనున్.

సీ. మది మదాలసకున్న పొదలునిజానురా
గము మించు సాంధ్యరాగమ్ము గనుచు
దయిత చెంగటికి ముందరఁ బొఱితనయిచ్చ
వలె గూండ్లఁ కఁగుపక్షులను గనుచు
దుర్నిమిత్తము లెంచఁ బొడరెడుతనహృత్త
మముఁ బోలునవతమసమును గనుచు
నభినవంబుగఁ దనయాత్మ దోఁచెడుచింత
లనఁ దోఁచుతారాచయంబు గనుచు
నలసి యాఁకలిదప్పులఁ గలఁగి మనసు
చెదర శర వేగమునఁ బురిఁ జేర నరిగి
పౌరశూన్యత కాశ్చర్యపడుచు హయర
యంబు గుదియించి నృపసూతి యాత్మఁ గలఁగె. 86

ఉ. అక్కట! పాడువాఱెనకొ యర్ణ బురిశోభ దొఱంగె, వీథియం
దొక్కఁడు తోఁపఁ డేమి కతమో ? యిరుసంజ ధ్వనించు కోటలో
ధక్కయు మాన మూనె, నికటంబున కేపరిచారకుండు రాఁ
డెక్కడ నెట్టిసద్దు విన, నేమి యుపద్రవ మయ్యెనోకదా?

క. తల్లియుఁ దండ్రియుఁ బ్రియము
చెల్లినవా రింతదనుకఁ జేరని నాకై
తల్లడిలి యే మయిరో యని
యుల్ల మయో! పల్లటిల్లు చున్నది పెల్చన్. 88

ఆ. అనుచుఁ గళవళమునఁ జనుచుండఁ గొంద ఱ
పైదురువడియుఁ బలుక కేఁగుచుండ్రి

కొంద ఱరసి రాచకొడుకు పిశాచమై
వచ్చె ననుచు భీతి విచ్చి చనిరి. 89

క. కనుచీఁకటి నొక రొకరిం
గనక జనము చెదరి సూటిగాఁ గోటవలం
కునకుఁ బఱచుచు నయో! నృప
తనయుం డిదె వచ్చుచుండెఁ దొరంగికుఁడై. 90

మ. అని యాకోశ మొనర్పఁ బార్థివనిశాంతాభ్యంతరాళస్థుఁడౌ
జనముల్ మంత్రులు శత్రుజిన్నృపతియుం సంభ్రాంతులై కోట పై
డ్కొని దివ్యత్కరదీపికావళులవెల్గుల్ తోఁవ చూపింప గ్ర
బ్బున ఘంటాపథ మూని యేఁగి కని యాభూమీశసంజా
తునిన్. 91

సీ. ఎటు బ్రదికితి తండ్రి! యేవేలుపే నడ్డు
పడెనె నీ కని చేరి యడుగువారు
ముని తపస్సును ధారవోసి జీవింపఁజే
సెనె ని న్నటంచుఁ బ్రశ్నించువారు
దితిపుత్రు నాజి వధించి వచ్చితొ మిగి
ల్చితొ యంచు మూఁగి పృచ్ఛించువారు
నయ్య! చిరాయుష్య మంది వర్ధిల్లుమా
యంచు నెత్తె దీవించువారు
మాపురాకృతసుకృతసంపత్తిఁ జేసి
కనులఁ బడితివి గ్రమ్మఱ ననెడువారు

నగుచుఁ దురగముఁ గదలనీయక జనంబు
క్రిందు గాపింప యువరాజు కళవళించె. 92

చ. దరియఁగ వచ్చునజ్జనులతత్తఱ మచ్చెరు వార్తిఁగాంచి భూ
వరసుతుఁ డశ్వమున్ డిగి చివాలున మంత్రుల నొత్తగించి యు
బ్బురపడి చూచుతండ్రిపదముల్ దల మోవఁగ మ్రొక్కి పార్థివుం
డిటిగవుఁగింటఁ జేర్చి యెలుఁగెత్తి విలాప మొనర్చి మూర్ఛిలన్.

శా. ఆశ్చర్యంబున నాఋతధ్వజుఁ డమాత్యవ్రాతమున్ బల్కుఁ జే
తశ్చింతన్ జనకుండు నాకునయి సంతాపించి యీతీరునన్
నిశ్చైతన్యము గూల హేతు వెది? నానేరం బదేనున్నఁ బ్రా
యశ్చిత్తంబు విధింపుఁడీ విడిచి సాధ్యాసాధ్యతాధ్యాసమున్.

చ. ఎటు బ్రదుకంగఁ గంటి వని యీజనముల్ వలగొంచు బ్రశ్న సే
యుట కెవ రేని నేను మృతినొందినటుల్ వచియించిరా? విశం
కటభుజశక్తియుక్తు ననుఁ గర్భురుఁ డెవ్వఁ డెదిర్చె? నల్లెదు
ర్పటయు తటస్థమైన నసురున్ వెసఁ ద్రొత్తును గాక చత్తునే?

ఉ. ఆమునియాగరక్షకట నాఁగఁగ నెంతలు పుట్టె నిచ్చటన్?
నామరణపరివాదము వినంబడఁగా ననుఁ గన్నతల్లి దా
నోమెనె ప్రాణ? మాపె యెట నున్నదొ చూపరె, ప్రేమ వాహినీ
ధామము నామదాలస ధృతశ్వసితానిలవృత్తి నున్నదే? 96

—♦ మదాలసా మరణవార్త మంత్రులు కువలయాశ్వునకుఁ దెలుపుట ♦—

క. నావుడు మంత్రులు వెలవెలఁ
బోవఁగ జనులెల్ల డిల్లవోవ నచటు నీ
రావముగ నున్న యెడ నా
ధ్మానవరుఁడును మూర్ఛ దేటి కన్నులు దెఱచెన్. 97

సీ. తోడన ముఖ్యమంత్రులు చేరి నరపతిఁ
బల్లకి నెక్కించి పరిజనంబుఁ
బౌరులు తోడ రా నారూఢవాజియై
కువలయాశ్వుఁడును వెన్వెనిలి రాఁగ
మాట మంతును లేక కోటకుఁ జనుచుఁ గ
న్నీరు నించెడుయామవారణంబు
లున్న మోసల దాఁటి సన్నగిల్లినదీప
కళికల లేఁజాయఁ గొలువు సొచ్చి
యచ్చటచ్చట సద్దుసేయక సమస్త
జనము గూర్చుండ, నంచితాసనములందు
నుర్విభుఁ దత్కుమారుఁ గూర్చుండఁ బెట్టి
రవు డిటు ప్రధానుఁ డనియె నృపాత్మజునకు. 98

ఆ. ఒకరిపలుకు లొకరి కొక్కింత యర్థంబు
గాక యున్న దీవు గనిన దవులఁ
దెలుప నౌను గాని తొలుత నిచ్చటివృత్త
మవహితుండ వగుచు నాలకింపు. 99

క. పితృవాక్పరిపాలనరతి
సతత మటుల నేఁటిప్రత్యుషమ్మున సూర్యా

ర్పితహాయము నెక్కి నీ వేఁ
గతి క్రమగతి మింటినడిమికిని రవి యెక్కెన్. 100

వ. అట్టియెడ.

మ. ఒకమౌనీంద్రుఁ డిలాతలాధిగతసూర్యుండో యనన్ వెల్గువాఁ
డొక కేలన్ భవదీయకంఠమణిహారోత్తంసమున్ గొం చురం
బకటా! యంచును మోఁదికొంచు జను 'లేమా'యంచు వెన్కొఁగ జాం
ఘికుఁడై రోఁజుచు వచ్చె నశ్రులహరీక్లిన్నాననుండైయిటన్.

క. దద్దరిలిపోవఁ గొలు వటు
లుద్దవిడిం డాయుతాపసోత్తముఁ గని తేఁ
జోద్దిక గద్దియ డిగి ముని
యొద్ద కరిగి 'యేమి వచ్చెనో తెలుపు' మనన్. 102

గీ. నోరు నెత్తిని గొట్టుకొం చాఋషీంద్రుఁ
డయ్యయో! యెంతపాపి నే నైతిఁ జేతు
లార నారక్కసునకుఁ గుమారు నప్ప
గించి యవ్వార్త దెలుపఁ దెగింతు ననుచు. 103

చ. వలవల నశ్రులోర్చు చిలపైఁ బడి పెద్దగ గుద్దికొం చెదన్
విలవిలఁ దన్నుకొంచుఁ బలవించు 'చయో! నృపపుత్రి' యంచు నూ
ర్పులు నిగుడించు నామునికి మ్రొక్కుచు 'నాసుతుఁ డేమి యయ్యెనో
కలఁగక తెల్పి నావెతపోకాలుపుమా' యని తేఁడు వేఁడఁగన్.

ఆ. ఎట్టకేలకుఁ దేఱ్కొని ఋషియుఁ జెమటఁ
దోఁగుచును నోటఁ దెగుడు సాఁగ నెక్కు
లఱముకొనినట్టి గద్గదస్వరము మీఱ
నిలఁ గనుంగొంచు మొగ మెత్తి కిట్టు లనియె. 105

క. ఓరాజేంద్ర వచింపఁగ
నోరాడదు నీసుతుఁడు మనోజ్ఞాకారుం
డారూఢభక్తి యమునా
తీరస్థము చేరుకొనె మదీయాశ్రమమున్. 106

క. రెండు దివసముల క్రిందట
నుండి యొకమఖం బొనర్చుచుండెడునాకున్
దండ మిడి నిలువ, నాశీ
ర్మండితుఁ గావించి మోదమానుఁడ నగుచున్. 107

ఉ. పాద్య మొసంగి యర్ఘ్యమిడి పార్థివనందన! యజ్ఞపూరుషుం
డుద్యతభక్తి ని న్ననిపి యుండఁగఁ బోలును నేఁటితోడ నా
యుద్యమ మెల్లఁ బూర్ణమగు, నొక్క నిశాటుఁడు వేచియుండె న
స్మద్యజనంబు గూల్ప; దివసద్వయ మెట్టిటో పుచ్చనైచితిన్

చ. అవబృథవాసరం బిది సమాప్తమె కానో యటంచు రాత్రి క
న్గన నటు మాయ నమ్మ్ర క్రితుఘాతుకుఁ డాదితిసూతి
యెప్పు వె
న్దపులునో యంచు నుంటిని క్షణంబిట నీవు వసించి కాచినన్
సవనము నేకతాయనమనంబునఁ బూర్తియొనర్తుఁ జెచ్చెరన్.

మ. అని వేఁడన్ భవదాత్మజుండు వినయంబారన్ మునీశాన! మ
జ్జనకాజ్ఞన్ మునిరక్షకై సతము భూచక్రప్రచారంబుఁ బూ

నిన నన్నింతగ నేఁడఁ జన్నె? యెవఁడేనిఁ ద్వన్ముఖధ్వంసనం
బునకై యెత్తునె? చూతుఁగా కని భయంబుల్ దీర్చి కా
పుండెం దార్. 110

ఉ. అంతటఁ గొంతసేపటి కనంతమునుండి సురారిరాట్చమూ
సంతతి డిగ్గి భూస్థలికి జన్నపుసాలను గ్రమ్మ, నీసుతుం
డంతకుఁ డట్ల రేఁగి వివిధాస్త్రములన్ నిగుడించి తచ్చమూ
కాంతుఁడు దక్కఁ దక్కబలగంబుల నన్నిటిఁ జేసె జూర్ణ
ముల్. 111

మ. అది గన్గొంచు నిశాటుఁ డుత్కటరుషావ్యాఘూర్ణితస్వాం
తుఁడై
మదిరాపాన మదోదితారుణిమసంపన్నోన్నతాక్షుండునై
కదిసెన్ నీతనయున్ గరాళశితఖడ్గప్రాసశుంభద్గదా
ప్రదరాద్యాయుధవర్షమగ్నునొనరింపం బూని పెల్లార్చుచున్.

వ. ఆసమయంబున.

సీ. చొచ్చు మింట నవాయిచువ్వ నా రివ్వన
నభియాతి మబ్బుల కవుల డాఁగఁ
బగతుండు కెరలి నభంబునఁ బొఱచో
సాళువం బన వెన్ను చఱచి పఱచు
వైరి నీట మునుంగ వైళంబ లకుముకి
వలెఁ దోన చొచ్చి వెల్వడును హేల
గుహలఁ దూఱిన మిఱుంగురుఁబుర్వు వలెఁ దూఱి
కలగుండువడ సూడుకాని నలఁచుఁ

గ న్నటుల మూసి విచ్చినకాలమున జ
గంబు గలయంగఁ దిరుగు రక్కసుఁడు బెదర
నదిర ! నీసుతుఁ డెక్కినయశ్వరాజుఁ
గాంచవలెఁ గాక! తరమె తద్గతులఁ దెలుప? 114

ఉ. దొంగగతిన్ దొలంగుపగతున్ గెడపన్ నృపసూతియున్ శిఖా
సంగతపావకాస్త్రపటుపత్రిహతిన్ దశదిక్కు లేర్పఁగా
నింగిని నేలఁ గాల్నిలుపనేరక దానవుఁ డింగలంపుఁబె
న్మంగలమందుఁగూలి నటు మాడఁగ వేఁగినమేనితోఁబడెన్.

క. పడి పుడమి మూర్ఛిలియు న
ప్పుడ తెప్పిఱి లేచి 'రాచపురుగా!' యెం దేఁ
గెడివాఁడ వింక నిదె నిను
మడియింతు నటంచు మరల మార్కొనునంతన్. 116

శా. క్షోణీనాథ! భవత్తనూభవుఁడు నక్షుద్రాస్త్రవిక్షేపణా
క్షీణక్రీడ విపక్షు మూర్ఛిలునటుల్ శిక్షింప నెట్టెట్లొ స
ప్రాణుండై సురవైరి శూలమునఁ గ్రివ్వన్ ఱొమ్ము,రక్షాదరి
ద్రాణుండై పడె నీసుతుం డశనిధారాపాతితాద్రిక్రియన్.

గీ. అట్లు తననాయకుండు రూపఱినఁ దేజి
హేషితార్తారవంబుల నేడ్చుచుండఁ
బట్టె యప్పాపజాతి దైవత విరోధి
తోలుకొనిపోయె వెసఁ దనప్రోలి కధిప ! 118

ఉ. హయచరమాంగ విచ్యుత గతాసుకుమారశరీరమున్ దయా
శయు లగుతద్వనస్థ మునిమండలి కొందఱు చేరి ఛిచ్చునన్

రయమున భస్మసాత్కృత మొసర్చి యథావిధిఁ బారలౌకిక
క్రియ లొనరించుచుండఁ బరికించెడిపాపము నాక చేకుఱెన్.

క. అని ముని చెప్పఁగ విని గొ
ల్లున నిండలిమంది యమ్మలును పొమ్మలు పై
కొనఁ గూలి తేఱుకొని బో
రన వగవం దొడఁగి రంబరము దిశ లగలన్. 120

శా. ఆవృత్తాంత మెఱింగి రాజులును శుద్ధాంతమ్మునం దేడ్చు చున్
భావంబుల్ వికలంబులై ధరణి నిశ్వాసావశేషంబుగా
ద్యోవీథీచ్యుతతారల ట్లొఱగఁగా నూరాఱుపం జొచ్చె నా
దేవీలోకము నీమదాలస యతంద్రీభూతచేతస్కయై. 121

క. పాతాళకేతుఁ జంపిన
ఖ్యాతపరాక్రముని నాదుపాశ్రేశు నెవం
డో తుచ్ఛదైత్యుఁ డాజిని
పాతిత నొనరించె నను టబద్ధము గాదే. 122

క. అను నెవ రాజాజ్ఞ సటకుఁ
జను నే నది వినుచుఁ దల్లి! సంయమములు వృథా
యునృతము చెప్పదు రే చె
ప్పిన వారల కిచట నెది లభించు సరయుమా! 123

ఉ. నావుడు నాపె పల్కె 'మునినాథులె కాదు త్రిమూర్తులేని యున్
నావిభుఁ డాజిఁగూలె ననినన్ మదిసమ్మ! నటే ఘటిల్ల, నా

జీవము పోదు దేహముఁద్యజింపదొకో' యన మానిఁగాంతు గా
నావెనువెంట రమ్మని మనస్విని దెచ్చితి వానిచెంతకున్.

గీ. అట్లుగొని రా మదాలస యమ్మునీంద్రుఁ
గాంచి 'నాకాంతు వధియింపఁగాఁ ద్రిలోక
ముల నొకఁడు గల్గునే? నీవు మునివ యయ్యు
ననృత మెటు లాడితి? తనుడు సంయమి చలించి. 125

ఉ. అమ్మ యిటాడెదే? కువలయాశ్వుని గేహిని వే కదమ్మ! స
త్యమ్మనె నమ్మకుంటి, వతఁడాజిని బ్రాణము వాయునప్పు హా
ర మ్మిది నీకు ని మ్మని కరంబునఁ బెట్టెను నాకి దేల? యం
చమ్మని నీగళాభరణ మందఱు చూడ ధరిత్రి నైచినన్.126

ఉ. నాలుక రాకయుండె నృపనందన! చెప్పఁగ—మృత్యుదేవతా
లోల యనన్ ధరాతలవిలుంఠిత తన్మశోకంఠమాల నా
లోలతరాక్షి రెండుకనులున్ విడఁబాఱఁగఁజూచెఁ జూడదో
కూలె నిలన్ బరాసువయి గొబ్బున' నంచుఁబ్రధాని తెల్పె
చోన్. 127

గీ. హా! యనుచుఁ గేక వైచి యపత్యాధిపసుతుఁడు
మొదలు నఱికినతరు వనఁ బుడమిఁ గూలఁ
జనకులును భృత్యజను లుపచారములను
సలుపఁ గొండొకతఱికిఁ గన్నులను విచ్చె. 128

చ. అటువలె నెట్టకేలకు ధరాధిపసూనుఁడు దేఱి 'నాకునై
తటుకునఁ గూలి నట్టిదయితామృతకోమలదేహమేని నె

చ్చోటఁ బడియున్నదో యకట! చూపరే'యంచు శిలల్
దప్రవింపఁగా
నటమట మొందుచుండ సచివాగ్రణి యి ట్లనె గొంతు
రాల్పడన్. 129

క. ఆపాటిపుణ్య మొనరుప
నోపము నాతండ్రి! తాయి యొనరిచి డెందం
బాపయి చరిత వచింతు, వి
లాపింపక వినుము, విధి యలంఘ్య మెవరికిన్. 130

ఉ. హా! కొడుకాయటంచు భవదంబయు నబ్బయుఁ బుత్రశోకనీ
రాకరమందుఁ గూలి యడుగంటెనయత్తటి గోరుచుట్టుపై
రోఁకటిపోటుగా నరిదికొత్తడిమానిక మైనకోడలున్
శోకము గూర్చుటన్ గడుపుచుమ్మలు చుట్టఁగఁ దూలి
రెంతయున్. 131

గీ. అటు మదాలస మరణించు టాలకించి;
మహితరాజన్య సౌధసీమలనె కాదు
పురము నలువంక సకలమందిరములందు
నేడుపుటెలుంగు లెసఁగె మి న్నిలను బడఁగ. 132

వ. అంతట నెంతయు సంతాపించి యాశోకం బప్రతీకారం బని
యెఱింగి యిమ్మహీకాంతుం డుత్థితుండై. 133

క. కరికరహతబిసినీక్రియ
స్వరుదళితమణిశలాకవలెఁ బవనహతా
మరలతగతిఁ బతిశోకా
తురయై మృతయైన యవ్వధువుఁ గనుఁగొంచున్. 134

చ. శిలవలె నిష్ఠురం బయినచిత్తము శోకమహాగ్నికీలలన్
బలుచగ నీరుగాఁ గరఁగి బాష్పమునై పరమాణురూపమై
విలయమునొందియేమొ,పృథివీపతియయ్యఖిలవ్యథల్ మదిన్
దొలఁగఁగఁద్రోచి ధీరత ననున్ బరివారముఁగాంచి యీ
గతిన్.

—• కువలయాశ్వుని తలిదండ్రుల వైరాగ్యము •—

చ. సతత మదర్చనోత్సుకుఁడు సౌమ్యుఁడు నాసుతుఁడేనుబంపఁగా
క్షితిసురరక్షకై చని నశించుశరీరము నొడ్డువెట్టి సం
తతయశ మొంది వీరశయనంబును బొందఁగఁ గుందఁజెల్లునే
యతఁడుకృతార్థుఁడయ్యెను ద్విజార్థసమర్పితదేహుఁడౌటచేన్

గీ. ఈమె సత్కులజాత ప్రాణేశుఁ డట్టు,
లగుట కనుయాన మొనరించినట్టిధన్య
శోచ్య యగునొకో? యరయ నశోచ్య గాక
సతికిఁ బతికంటె వేఱు దైవతము గలఁడె? 137

ఆ. పతివియోగ మంది సతి యీపె శోకాగ్ని
నవయుచుండెనేని నాకె కాదు
బంధుసంహతికిఁ గృపావంతు లైనజ,
నావళులకు శోచ్యయగును గాదె? 138

క. పతి యహితనిహతుఁ డైనటు
శ్రుతిఁ బడుక్షణముననె వెనుకఁ జూడక యీసు
వ్రత యతని ననుగమించిన
విత మెఱిఁగియు వగవఁజనునె విద్వాంసులకున్. 139

ఆ. అకట! పతివియుక్త నై కష్ట మనుభ్రాంతి
ననుగమనపరాఙ్ముఖాత్మ నైన
చెలులు తమకుఁ జుట్టములకుఁ గులమ్మున
కును వ్యథాభరంబు గూర్చువారు. 140

చ. ఇహపరలోకలభ్యవివిధేష్ట సుఖప్రదుఁ డైననాథుదు
ర్వహవిరహం బొకింత పడఁబాఱక మున్నకృతజ్ఞ కాన ని
మ్మహిళ దొలంగెఁ బ్రాణ మసమానధృతిన్ బతి నేసతీలలా
మ హృదయసీమఁ బంచజనమాత్రునిగాఁ దలపోయు నెం
చుఁడా. 141

ఉ. మాతపతివ్రతాత్వమును మామకవంశవిశిష్టతన్ స్వశౌ
ర్యాతిశయంబు నెంతయు బయల్పఱఁ గయ్యమునన్ ద్విజవ్రజ
త్రాతగ నిల్చి, ప్రాణము లరాతి కొసంగి సుతుండు పేర్చడెన్
బైతృక దైవ తార్ష ఋణబంధ విమోచన సిద్ధహస్తుఁడై. 142

ఆ. ప్రాణములు ద్విజార్థ మర్పించుసుతుఁడుఁ, ద
త్సతియు, నతనిఁ గన్నతల్లి, యేను
వగవఁ దగినవార మగుదుమే? తరియించి
నార మిందఱముఁ గుమారుకతన. 143

చ. అనుటయు నీమె నీజనని హర్షమునొందుచుఁ బుత్రశోకమున్
మనసున కంటనీయక కుమార! భవజ్జనకున్ వచించె ని
ట్లని—హృదయేశ! మానులకునై యని నీల్గినపుత్రు వించు నేఁ
గనియెడిప్రీతి నాజనని కాని సహోదరి కాని కాంచిరే! 144

క. వందురు ద్విజబృందమునా
క్రందము విని వ్యర్థులై దురామయపీడల్

క్రిందుకొన నింట డించెడు
పందను గన్నట్టితల్లి వంధ్యయె కాదే. 145

గీ. భీరు లగుగోద్విజులఁ గావఁగోరి యాజి
శస్త్రధారల కెర యైనజనుఁడె జనుఁడు
హీతుల కరుల కర్షులకు వెన్నినివాని
పితయ యగుఁ బుత్రి, మాత యే వీరమాత. 146

క. అరి గెలుచుటొ, యరిచే నని
మరణించుటొ గలుగు నక్కమాటుఁ గనినయా
గరిత మును గాంచు నాదు
ర్భర గర్భక్లేశ మప్పుడ ఫలవంత మగుౕ. 147

ఉ. అంచును వీరసూత్వము బయల్పడ నీజనయిత్రిపల్కటా
లించి, విరక్తి మించఁగఁ జలింపక, నీజనకుండు ధైర్యముౕ
గంచు, మదాలసాంగలతికౕ దహనక్రియ సంస్కరించి యే
మంచు వచింతు నీకును దిలాంజలులిచ్చెను బాష్పవారితోౕ

గీ. ఆసతీదేహలత చితియందుఁ బెట్టు
దాఁక వెన్నాడి యమ్ముని శోక మెసఁగ
నాస్మశానమునం దుండి యరిగె వనికి
నేము నిలు సేరుకొంటి మీనృపతిశోడ. 149

క. అని యిటు జరత్ప్రధానుఁడు
కనుఁగొలుకుల నశ్రులోడికలు గట్ట వచిం
చిన రాకొమరుండు 'హాప్రియ
కనఁబడవా' యనుచు ముక్తకంఠుం డయ్యెౕ. 150

—♦ మదాలసకై కువలయాశ్వుఁడు విలపించుట ♦—

క. తటుకునఁ దలిదండ్రులు చెం
గట నుండుట గాంచి లజ్జఁ గన్నీ రురలన్
బటుశోకపరవశుం డయి
యిటు కుములును మదిని జీవితేశ్వరిఁ గనుచున్. 151

ఉ. ఆహుతి యయ్యెనే మధురమై సుమమంజులమైన నీజగ
న్మోహనరూపధేయము విధూమితవహ్నికరాళకీల? క
య్యో! హతభాగధేయుఁడఁ దలోదరి! నీగుణనామధేయముల్
నాహృదయంబునందు రసనన్ మణిదీపములయ్యెఁగాల్చెడిన్

చ. చూపులఁ జేతలన్ మధురసూక్తితతిన్ బ్రణయంబు మూర్తమై
తోఁపఁగ నామనం బమృతతుందిలమై కయిపొంది పూర్ణిమా
దీపితచంద్రికామరనదిన్ బులకింపఁగఁ గోటిస్వర్గముల్
దా పొనరించు నీకరతలప్రసవం బిఁక సోఁకదా ననున్? 153

శా. నిర్వేలం బగుప్రేమసాగరమునన్ బెల్లుబ్బుకల్లోలముల్
పర్వన్ స్వాంతము లల్లనల్లన ద్రవీభూతంబులై యేకమై
యర్వాజ్మోదసుధానుభూతి మధురంబై వెల్గ నీవిచ్చునా
సర్వాంగీణదృఢానుసంధితపరిష్వంగంబు నాకే దిఁకన్? 154

క. లే దిఁక సుఖంబు, జగమే
లే, దిదె నీ లేని నేను లేను, బ్రతికినన్
బో దీవగ, నీపొడ గన
రాదు గదా! నామనోహరప్రణయమయీ! 155

క. అని తనలోఁ దా నిటు భా
వనసేసి యణంపరానివగలఁ బొగులుచున్
జనకులు విన జనములు గన
ననె సి గ్గెడపడఁగ నవనతాస్యం డగుచున్. 156

గీ. అనృత మగునామరణవార్త యాలకించి
నిజముగా నవలా మరణింప వినియుఁ
జావ కుంటి మాయందు వాస్తవపుఁబ్రేమ
మామదాలసదా? నాదియా తలంప? 157

క. నా కుపకృతిగా సుదతి య
పాకృతనిజజీవ గాఁగఁ బ్రత్యుపకృతిగా
నీకాయ మూడ్చి ప్రాణము
లీకుంట యధర్మ మగుఁ గదే గనుఁడు గురుల్. 158

మ. అట స్వర్గంబున నుంటి నన్న భ్రమ నాకై యాకలాలాప యి
చ్చట దేహంబును డించి యేఁగెనఁట, నాజాడన్ గడన్ లేక య
క్కట! యిక్కట్లవి పొందుచున్నదొ? గనంగాఁ బోక నే నిందె యుం
డుట ధర్మ్యం బెటు? మీయనుజ్ఞ కయి వేడ్కొందున్ వడిం బంపుఁడీ. 159

ఉ. దూరముగాక మున్నె సతితోఁ గలియన్ బనుపుండు నన్ను, మ
ద్వీరపతివ్రతామణి ప్రతీక్ష యొనర్చుచు నుండు స్వఃపురిన్

మీ రటు పంపరేని నను మించు నృశంసుఁ గృతఘ్ను మూర్ఖు నెం
దారయ నేర్తురే సదయులార! విచార మనర్హ మిత్తఱిన్.

గీ. అని యెలుఁగు రాల్పడఁగ నృపాలాత్మజుండు
కేలుఁగవ శేఖరమున సంకించి వేఁడ
గంటఁ దడిపెట్టుకొంచు మొగంబు లెత్త
లేక గురుజను లెల్ల రవాకు లైరి. 161

క. ఆరీతిఁ గొంతతడవు స
భారంగము మానముద్రఁ బడి వెచ్చనివి
ట్టూరుపులఁ బుచ్చుచుండఁ గు
మారస్మృతి యిటు తలంచె మానసమందున్. 162

చ. చెలియ ననున్ దలంచియ త్యజించెను జీవితమంచు నేను న
చ్చెలువ స్మరించి ప్రాణము త్యజింతునయో నుపకారలేశ మున్
గలుగునె నాకుఁ గాని కలకంఠికిఁ గాని? పతుల్ గతింపఁ బ
త్నులనుగమించు టెన్న జననుత్య మగున్ విధిదృష్టమాట చేన్. 163

క. దీనత దోఁపఁగ సారెకు
హా నాప్రియురాల! హా ప్రియా! యని యడలం
గా నది శ్లాఘ్యతమం బగు
నా? నేముం బురుషులము గదా యరయంగన్. 164

ఆ. మఱియు శోకమునను మాంద్యమ్ము దైన్యము
పొడమి నెత్తు రెల్లఁ బొడ వడంగఁ

బల మొకింత లేక పాప్రిల్మాలు నను శత్రు
తతి పరాభవించుఁ దప్పకుండ. 164

క. తొలఁగు టెటు? నాదుజీవిత
మరయ జనకహ స్తగతమ యగుఁ గాన రిపూ
త్కరశాతనమున రా జై
పరఁగునితని కెపుడు చేయవలె శుశ్రూషల్. 165

ఉ. అంతియ కాదు 'నాకునయి ప్రాణ మొసంగినసాధ్వి మేలి కై
కాంతలభోగముల్ విడిచి కాలము పుచ్చెద' నన్నమాత్ర న
కాంతకు నేమి మే లగును? గావున నెంతయు నాన్నృశం
స్యముఁ
గాంతు నెలంతకద్ది యపకారియుఁగా,దుపకారి కా,దెటుల్.

చ. అని మది నిశ్చయించుకొని యప్పుడ యాదరదానికాదులఁ
బనివడి సేసి యెల్లరు వినఁ బ్రతినఁ గొనె నాబుతధ్వజుం
డనితరసాధ్యసద్గుణసమంచిత, సుందరి నామదాలసాం
గన లభియింపఁ గన్నయెడఁ గల్గుత నాకు గృహస్థధర్మముల్

గీ. అమ్మదాలస లభియింప దయ్యెనేని
నాకు నీజన్మమందుఁ గాంతాసుఖంబు
లింతతో సరి, ప్రతిన వహించినాఁడ
దైవతములాన! జనకుపాదములయాన! 168

శా. అంచుఁ గొంచుఁ గఠోర మాప్రతిన నాఁడాదిఁ గలా
విత్స్త్రీ
లాంచత్తుల్యవయస్సహ్రుత్తతియుతుండై భోగసంపర్కముఁ

గించిన్మాత్రముఁ గాంచ నెంచకెపుడుం విద్యావివిక్తిం వినో
దించుం, ద్రుంచు విరోధిసంచయము, సాధించుం బ్రజా
క్షేమముం. 169

గీ. ఇది సుమా యాఋతధ్వజువృత్త; మాల
కించితి గదయ్య! యతనికాంక్షిత మసాధ్య
మగుఁ ద్రిమూర్తులకే నని యంటె; మొరుల
కెటు సుసాధమొ యిప్పు డూహించి చెపుమ. 170

చ. అని యిటు పావనంబు హృదయంగమముం దయనీయముం దులాం
చన రహితంబు బుదాత్త మగుశత్రుజిదీశ్వరుపుత్రవృత్తముం
దనయులు సెప్ప నశ్వతరనాగకులేంద్రుఁడు విహ్వలించి క్ర
న్ననని టు వల్కుఁదర్జనిని నాసపయిం గవియించివారితోం.

—♦ కొడుకులు పలుకులువిని యశ్వతరుఁడు తపంబునకరుగుట ♦—

శా. ఆహా! ఏమిపతివ్రతాత్వధృతి, యే మాయేకపత్నీవ్రతం !
బూహాతీత మహామహత్త్వనిధులై యుల్లాస, ముద్వేగ. ము
త్సాహం, బుమ్మల, ముమ్మదంబు యుగపజ్జాతంబులం జేసి పె
ల్లీహావల్లుల నాటుచున్నయవి నాహృద్వీథిఁబుష్పింపఁగం

వ. అనుచు నశ్వతరుండు హృదయావేదన భరింపంజాలక కువల
యాశ్వమనోరథంబు దలంచి కన్నుఁగవ విప్పార నందను
లతో నిట్లను. 173

ఉ. ఘోరతపంబుసేసి యిటకుం దోడిదెచ్చి మదాలసం బతిం
గూరుప కేనిఁకం గుడువఁ,గూరుకుఁ గాంచఁ,దలంపనన్య, మా

సారసనేత్రి తొంటివయసన్ బడుచై జనియించి, నాకుఁ జే
కూరుచుఁగాక యాఁడునిసుఁగున్ గడుపారఁగఁ గన్నమోద
మున్. 174

వ. అని ప్రతినఁగొనఁ దత్తనయులు నివ్వెఱం గందుచు ‘భస్మీ
భూతం బగుదేహంబు మరలఁగలుగుట యెందుంగానము.
దైవనిర్ణయం బెవ్వండేని దొలంగింపం గలండే? పౌరుషము
దుర్బలమ్ము. దైవంబు ప్రబలంబుగాదే’ యనుటయు ఫణీం
ద్రుం డల్లన నవ్వి యిట్లను. 175

ఉ. ముందె యశక్యమంచుఁ దలపోసి నిరుద్యముఁడైన హానిఁదాఁ
జెందును గానఁ బౌరుషము చేకొని, దైవము నమ్మి, కర్మ మ
స్పందమతిన్ నరుండు సలుపందగుఁ; దత్ఫలసిద్ధి పౌరుషం
బందును దైవమందు నరయంగ వ్యవస్థితమై తనర్చుటన్.

ఉ. దైవ మదృష్టశబ్దకథితం బగునర్థము గానఁ దద్గతుల్
భావనసేఁత వ్యర్థ మని పౌరుషమున్ ఫలసిద్ధిదాఁక దీ
ర్ఘావిధి వీడఁడేని దగుకాలమునం దలపౌరుషంబుతో
దైవముగూడి మానవుని ధన్యునొనర్చు నటంద్రుకోవిదుల్.

శా. ‘జన్యం బెట్లగుఁ బౌరుషంబున కదృష్టం?’ బంచు ‘దైవానకున్
జన్యం బెట్లగుఁబౌరుషం?’ బనుచుఁ జర్చల్ చేసి విద్వద్వ్రజం
బన్యోన్యాశ్రయ మొప్పియున్ బురుషకారాధిక్యమే చెప్పె
మూ
ర్ధన్యం బైనది దైవమేనియు వికర్మత్వప్రహాణార్థమై. 178

ఆ. అదియుఁగాక సుతులయభిలాషఁ దీర్పంగఁ
దలఁప నట్టితండ్రి తండ్రి యగునె?

సాధ్యమగునో యది యసాధ్యమే యగునో య
త్నింపకయ వృథాకరింపఁ జనునె ? 179

క. వృత్తులకోర్కులు నిజజన
యిత్రియొ జనకుండొ తీర్ప కెడసినను వృథా
పాత్రుల వారల జగము ల
పాత్రు లని యొనర్చు హాస్యపాత్రులు గాఁగన్. 180

గీ. ఎంచ నిది యశ్రుతచరం బదృష్టపూర్వ
మగున; యత్నింప కెటు సాధ్యమో యసాధ్య
మో యెఱుంగుట? పంచత్వమొంది భస్మ
మైనతను వొందు టన గగనాబ్జ సమము. 181

గీ. ఔను గాక ప్రత్యక్షానుమానములకుఁ
దెలియని యుపాయమేనియుఁ దెలుపు శబ్ద
మట్టి శబ్దస్వరూప బ్రహ్మణి మామ
కేప్సితం బెట్టిదేని యీడేర్ప కున్నె. 182

క. అటు గాన నిపుడ పౌరుష
పటిమ విడక భారతీకృపం గని దానన్
నిటలాక్షుని దనిసి సుదు
ర్ఘట మగునాకోర్కి వడసి క్రమ్మఱి వత్తున్. 183

— సరస్వతీదేవి నుద్దేశించి యాశ్వతరుఁడు తపమొనర్చుట —

వ. అని పలికి హిమవత్పర్వతంబున కరిగి ప్లక్షావతరణం బనుతీర్థ
రాజంబున సరస్వతీదేవి నుద్దేశించి. 184

చ. ఒకనెలనీరుమాని, మఱియొక్కనెలన్ గడిగూడమాని, యిం
కొకనెల వాయువేని గొనకుండ నచంచలచిత్తవృత్తిఁ బా

యక, కరుణాంబురాశి జగదంబిక శారద సంభజించె ఘో
రకఠినదీక్ష నాభుజగరాజవరుం డమదొంద లోకముల్. 185

శా. వర్షన్ స్థండిలశాయియై హిమఋతుప్రత్యగ్రతిన్ శీతలో
త్కర్షోపప్లుతకంఠదఘ్నసలిలాంతస్సంస్థుఁడై గీష్మకా
లోష్మం బెంచక,పంచవహ్నివృతిస్థేయుండై ఋషిస్తుత్యుఁడై
భీష్మప్రక్రియఁ జక్రిచక్రపతి గావించెన్ దపం బెంతయున్.

వ. అట్లు కొన్ని నెలలు తపియించి తనమనంబున నద్దేవిని సన్ని
ధానంబు సేసికొని యాఫణాధరవిభుండు సభక్తికంబుగ శిరం
బున నంజలిం గీలించి యిట్లు నుతింపం దొడంగె. 187

దండకము:—జయజయ! జగదంబ! త్రైలోక్యసంపూజ్య! మూర్తి
త్రయారాధిత శ్రీపదాంభోజ! నిన్నున్ భజింపంగ వాం
ఛించి సద్భక్తి నీశక్తిఁ గొండాడెదన్, దారువం దగ్నిపోలెన్
భువిన్ బీలువుల్ కైవడిన్ బ్రహ్మముల్ లోకముల్ గూడ
నీయంద యంతర్గతంబుల్ గదా చూడ నో దేవి! నీస్థాన
మా నందు రోంకారవర్ణాత్మకం బైనమాత్రాత్రయంబుల్
స్థిరం బైనస త్తస్థిరం బౌజగంబుల్ త్రయీవాక్చయంబుల్
ద్రిమూర్తుల్ త్రివిద్యాళి త్రేతాగ్నులున్ ముజ్వేలుంగులున్,
ద్విధాభూతధర్మాదివర్గంబులున్ ముత్తెఱం గౌగుణంబుల్
త్రిదోషంబులున్ ద్వ్యాశ్రమంబుల్ త్రికాలం బవస్థాత్రి
యంబున్ బిత్రు శ్రేణి రేలున్ బవళ్లున్ మొదల్గాఁగ వెల్గొం
డుమాత్రాత్రయంబెల్ల నీరూపమే కాదె—వాణీ! పరబ్రహ్మ
భిన్నంబుగా విశ్వమున్ గాంచు నవ్వారిలో నాద్యులౌ బ్రహ్మ
వాదుల్ త్వదుచ్చారణం బూఁదియే కాదె యేదేడుభేదంబు

లానాహావిస్సోమసంస్థల్ మతీఁ బాకసంస్థల్ సదా చేయుచుం దగ్రింబరో ! తానకం బానని ర్దేశ్యమై ధర్మమాతాశ్రితంబై, పరంబై, వికారోజ్ఝితంబై, క్షయాపేతమై, దివ్యమై,నిష్పరిణామమై వెల్గునీయద్వితీయద్వితీయాకృతిఁ దెల్పఁగా నాతరం బానె యోదేవి! యాస్యంబుచేఁ గాని జిహ్వోష్ఠతాల్వాదులన్ గాని పేర్కొఁదరం బానాకో, యిందువస్వబ్జగర్భుల్ రవీంద్వాదికజ్యోతులుఁ దానయై విశ్వముఁ దాల్చుచుఁ, దాననే నిల్చు చవ్విశ్వముఁ బ్రోచుచుఁ సాంఖ్యవేదాంతవేదోక్తమై యాదిమధ్యాంతశూన్యంబునై—యెన్న నిత్యం బనిత్యంబు నయ్యుఁ సదా నిత్యమై—జన్మభేదంబుచే నేకముఁ నైకముఁ నైత మయ్యుఁ సదా యద్వితీయంబయై—యాఖ్య లేకుండియుఁ షడ్గుణాఖ్యంబునై, తద్గుణశ్రియ్యపేతంబు, నానామహాశక్తిమద్వస్తుబృందంబునం దేకశక్తిస్వరూపంబ యై—ఘోరభేదావృతిఁ గాంచియుఁ సచ్చిదానందమూనీపరాకార మేవేళ భావింతు మాతా ! కళాపూర్ణముఁ నిష్కళంబౌచు నద్వైతసంస్థంబు ద్వైతవ్యవస్థంబునౌనీజగంబెల్లఁ ద్వద్వ్యాప్తమై దీప్తమౌఁగాదె-నిత్యంబనిత్యంబుస్థూలంబు సూక్ష్మాతిసూక్ష్మంబు,భూమ్యంతరిక్షాన్యదేశాశ్రియంబౌపదార్థౌఘమెల్లఁ భవత్సృష్టమేకాదె? మూర్తంబమూర్తంబుగాఁ దోఁచుచున్ సర్వభూతంబులన్ గించిదాకారితేకాంశమై సర్వలోకాశ్రియం బైనసంబంధ మెన్నం ద్వదీయస్వరవ్యంజన శ్రేణిచేఁ గల్గుఁగా యం చవాఙ్మానసం బైననీవైభవం జెంచి వైవశ్యముం గందుఁ గాకేమి యందుఁ

ద్రయీవహాళీ చూడామణీ భూత పాదద్వయీ! వాఙ్మయీ!
శ్రీపరారూపిణీ! తే నమస్తే నమస్తే నమః—

ఆ. అని యనేకగతుల నహిరాజు వాగ్దేవి
వినుతిసేయ నలరి విష్ణుజిహ్వ
యగుసరస్వతీమహాదేవి ప్రత్యక్ష
మై వచించె ఫణిధరాధిపతికి. 189

క. ఉరగేశ్వర ! యేకోరిక
నరు దగుతప మిటుల సల్పు దని కరుణయు నా
దర మొలుకఁ బలుక నతఁ డీ
సరణి నను వినీతి భక్తిసంభృతమతియై. 190

శా. అమ్మా ! నాకును గంబళుం డనుసమాఖ్యన్ మించునా భ్రాత క
బ్రిమ్మాసుస్వరగీతతాళలయపూర్ణమ్మైనసంగీతశా
స్త్రమ్మిమ్మా! సతతమ్ము నండ వయి మద్యత్నంబు సాఫల్యపూ
ర్ణమ్ముఁ జేసి నన్నుఁ గృతార్థుని నొనర్పఁ జూడు వాగ్దేవతా!

వ. అని మదాలసా పునర్జననకాంక్ష నెఱింగించి పరమేశ్వరు
గానకళచేఁ గరంగింప నెంచుతనతలంపు సూచించుటయు
దయాళువయి యద్దేవి యాక్షణంబ.

సీ. స్వరసప్తకంబు సప్తగ్రామరాగముల్
సప్తగీతములు మూర్ఛనలు నేడు
నేకోనపంచాశదాకార మాతాన
ములును గ్రామత్రితయంబు మఱియు

నాలుగువిధము తాళముల్ త్రిప్రకా
రంబౌ లయత్రితయంబు నొలఁ
ద్రివిధగతుల్ చతుర్విధ మైనకాలంబు
లమర సాంగోపాంగ మైనగాన
మిచ్చితిని నీకు నీభ్రాత కితరు లెఱుఁగ
నట్టిపరిపూర్తి; గానవిద్యాదిమప్ర
ణేతలుగ ముజ్జగంబున నీవుఁ గంబ
ళుండుఁ గాంతురు గాక యలోలకీర్తి. 193

క. అనుచు వర మొసఁగి భారతి
గనుచుండనె మాయ మయ్యెఁ గంబళుఁడును వ
చ్చెను విద్యాస్ఫురణంబునఁ
దను మించుట నెఱిఁగి యశ్వతరుఁ డుప్పొంగెన్. 194

వ. అంత నయ్యురువురుఁ దదానీంతనకర్తవ్యము దెలిసికొని తత్క్ష
ణంబ కదలి. 195

—♦ కంబళాశ్వతరులు శివుని గానముచే సేవించుట ♦—

చ. తమకు స్ఫురించినట్టిపదతాళలయస్వరలక్ష్యలక్షణ
క్రమగతగానవిద్యకు నఖండముదంబునఁ దేలి, కోటిజ
న్మముల నొనర్చుపుణ్యమహిమంబునఁ గాని కనంగరాని వెం
డిమలకు నేఁగి గంగను మునింగి గణంబులఁ గొల్చి వెంబడిన్

సీ. ఉపనిషల్లలనాసముల్లసత్సీమంత
సిందూరితాంఘ్రులఁ జెలఁగువానిఁ
గృతకేతరోక్తిసన్నుతిసమాకర్ణన
సంభృతపారవశ్యంబువాని

గంధర్వకాంతావికస్వరవల్లకీ
కలనాదమగ్నుఁడై కరఁగువాని
గాఢపరిణయసూచకగ్రావపతిసుతా
క్రాంతనైజార్ధగాత్రంబువానిఁ
గలితగంగాఝరోత్తమాంగంబువాని
శేఖరీకృతబాలేందురేఖవాని
నురగపతిరాయగండపెండెరమువానిఁ
గనిరి మృత్యుంజయుని బ్రేమ దొనఁకువాని. 197

మ. అకలంకంబగుభక్తిఁ జేరి గని, సాష్టాంగంబుగా మ్రొక్కి, యిం
దుకళోత్తంసు మనంబు లోఁ గొనఁగ సద్యోజాతముఖ్యాస్యపం
చకసందర్శనపూర్వగానరచనాసక్తి బన్నగుల్ భోగవం
చకయుగ్మోర్తులఁ బాడఁగాఁ దొడఁగి రంచద్వల్లకీసంగతిన్.

క. వేకువ మధ్యాహ్నము సం
ధ్యాకాలద్వయిని రాత్రి నవిరతగాన
శ్రీకలితస్తుతుల భజిం
త్రీకాకృతి విడువ కష్టణీశ్వరు లభవున్. 199

సీ. ప్రమథులు కృతివిస్మరణముఁ బొందుచు వెఱ
బొమ్మల ట్లుండంద పొలుతు రెలమి
నందికేశ్వరుఁడు సానందుఁడై జాపడి
శ్రవణముల్ ఱక్కించి తపెలి వినును
లంబోదరుండు శ్వాసంబేని విడువ కే
కాగ్రచిత్తంబున నాలకించు

బర్హిధ్వజుఁడు పారవశ్యసంపద 'హాయి
హాయి' యంచొడల రోమాంచ మెనయు
మొదలె సగమైనగౌరి ప్రమోదజలధిఁ
గరఁగి, సగమున సగమయి తుఱఁగలించు
నై దెలుంగులుఁ దమలోన నైక్యమొంద
నైకకంఠ్యమ్మున ఫణీంద్రు లాలపింప. 200

క. బహుతిథ మగుకాలం బిటు
లహిరాజులు పాడిపాడి యభవునకు ముదా
వహ మిది గాలేదో యని
బహువిధసాహితుల సంస్తవము సేసి రిటుల్. 201

శా. సంసారాంబుధిఁ బ్రుంగి యెందు దరిగాంచన్ లేక దుర్వాంఛలన్
హింసన్ జెందెడిప్రాణికోట్ల కొకనీవే కాద యుద్ధర్త? పు
త్తంసీభూతసుధామయూఖ! విలసత్కారుణ్యవార్ధీ! మఖ
ధ్వంసోల్లాస! మఖక్రియాఫలితభావా! దేవ!మృత్యుంజయా!

మ. నిగమారణ్యవిహార్త్రపంచముఖ! సందీప్తాలికస్థాన! ప
న్నగకేయూర! గిరీంద్రమందిర! వియన్నద్యంచితాపీడ! య
క్షభగవా హాబ్జభ వామకేంద్ర పరిమృష్టస్తూయ మానాకృతీ!
నిగృహీతేంద్రియమానిలక్షిత! భవానీనాథ! మృత్యుంజయా

మ. తురగీభూతసమస్తవేద! ఫణభృద్భూషాధృతిహ్లాద! సం
హారణోత్పాదవినోద! జృంభితమహాహాలాహలాస్వాద! ని
ర్భరకారుణ్యపయఃపయోద! త్రిపురధ్వంసక్రియామోద!భూ
ధరభూసేవితదివ్యపాద! హితమిత్రశ్రీద! మృతుంజయా!.

—♦ శివుఁడశ్వతరునకుఁ బ్రత్యక్షమగుట ♦—

సీ. అనుచు సంగీతసాహిత్యఘనము గాఁగ
రా ల్గరంగఁగ మోళ్లిగుర్పఁగ ఫణీంద్రు
లన్నదమ్ములు విడువక సన్నుతింప
నభవుఁడు కరంగి యిగ్రిచి దయార్ద్రుఁడయ్యె. 205

చ. అగుటయు భోగిరాజులు ఫణాంతరదంతురరత్నదీపికా
ధగధగలన్ మహేశ్వరుపదద్వయి కర్థి నివాళిసేయుచున్
విగతసమగ్రమోహు లయి వేడ్క విపంచి కలస్వనాంచితం
బుగఁ బాగడం గడంగి రతిమోహనగానకళాధురీణతన్.

క. నిగ మాగమ ధని! పాపా
పగమ సమాగమ! నిధానిపా! మాగధసా
మగ! గరిమధారి! ధామా
పగాప! గరిధారి! ధామపాధాని! సమా!. 207

వ. అని మఱియును.

శా. దేవా! తావకదివ్యదర్శన మహాదృష్టంబునన్ గోటి జ
న్మావిర్భూత దురంత దుష్కృతిచయం బామూల మున్మూ
లమై

అర్థము:—నిగమములచేతను, ఆగమములచేతను ధనికుఁడా! అఁగా వేదశా స్త్రములనెడు ధనముగలవాఁడా అని భా. పాపములను దొలఁగించు సమాగమముగలవాఁడా! మాగధులయిన సామవేదగాతలు గలవాఁడా! గొప్పఁదనము దాల్చినవాఁడా! శౌర్యమునకు సముద్రమైనవాఁడా! సర్పములను దాల్చువాఁడా! కాంతుల కధిపతియగుసూర్యుఁడు స్థాన మగాఁ గలవాఁడా-సూర్యమండలవర్తి-అనిభా, సమా=పరమాత్మమా.

యావద్దృశ్యము నాష్టమూర్తికమహంబై దోఁచి దిగ్దేశకా
లావచ్ఛిన్నము గాకయున్న దెటు లయ్యా! వాక్కులన్
దేరోఁకున్. 208

శా. ఉద్యత్కోటిసహస్రరశ్మి నిబిడద్యోతప్రతిచ్ఛాయ మై
విద్యుత్పుంజనిగ్గిర్ణధుర్య మయి నిర్వేలోంకిరీయాసాంద్ర మై
విద్యోతించు భవన్మహఃపటలి నుద్వీక్షింప శక్యంబె? వి
శ్వాద్యా! విశ్వవిలీన; విశ్వలయ! విశ్వాతీత; విశ్వేశ్వరా!

మ. అమితం బౌక్రపచే నవాఙ్మనసగమ్యం బైన తేజోమయా
త్మమునన్ సత్త్వరజస్తమోవికృతి సంధానించి బ్రహ్మాదిరూ
పములన్ దోఁచుచు మాదృశాల్పమతులన్ బాలింప భా
వించునీ
యమలాంతఃకరణప్రవృత్తికిఁ బ్రణామానంత్యముల్ గూ
ర్చెదన్. 210

మ. జగదుత్పాదన రక్షణక్షరణచేష్టాలోల యామాయ శీ
తగిరీంద్రాత్మజయై జనించి తపముద్యద్దీక్షఁ గావించి నీ
సగమై జగదంబయై జనకతాసౌభాగ్యముల్ నీకుఁగూ
ర్చెఁగదా యామమ వాయ నిష్క్రియుఁడవై చెన్నారుదా
యొంటిమై. 211

సీ. అలర మేచకధవళాంగదీధుతు లర్క
జాస్వర్ణదీపూరసంగ మట్ల
నెఱయ నిర్వంక వేణీజటాపరిభలు నీ
లాభ్రసౌదామనీ విభ్రమ మటు

గాలిలంగ నిరుగేల లీలాబ్జశూలముల్
　　శృంగారవీరరసాంగము లటు
రాజిల్ల నిరుదెస రత్నకపాలమా
　　లలు సంజకెంపు వెన్నెలరుచులటు
కాంచనాంగదమును బాఁపగండపెండె
రము నమరుపాదపద్మయుగ్మము వెలుంగ
నాఁడు మగవోఁడుములు నేక మైననీమ
హాద్భుతాకృతిఁ గనఁ గంటి మంబికేశ! 212

చ. అఱగొఱలేనిప్రేమ బహిరంగముల౯ బహువిభ్రమంబులై
విరిసిన—నంతరంగము లభిన్నములౌటను స్థాయి లోకృఁడై
వరలురసంబులం దనుభవంబున నైక్యము నొంద, మోదసా
గరు లగు నాదిదంపతులఁగాంచి తరించితి నింక సంసృతి౯.

ఆ. సర్వశక్తి నాదిశక్తిని దేహసం
సక్తఁ జేసికొన్న జగదతీత
శక్తి వీవు శమను సమయించి బ్రదికించు
టబ్రమొకొ! యుమాసహాయ దేవ!. 214

మ. అని సంగీతము సాహితీకళకుఁదోడైగూడ, బాష్పమ్ము స్తం
భనరోమాంచము లాది యావివిధ భావమ్ముల్ స్ఫురింప౯
　　　　　　　　　　　　　　　　　　　　　　విను
తన మహాభక్తిరసానుభూతి నురగాధ్యక్షుల్ యథార్థోక్తుల౯
వినుతింప౯ గరుణాతరంగితమతి౯ మృత్యుంజయుండిట్లను౯

ఉ. 'ఓభుజగేంద్రులార! యిటు లుగ్రతపఃక్రియ నన్నుఁగొల్వ నే
లాభము పొందఁగోరిరియొ తలంకక చెచ్చెరఁజెప్పుఁడన్న స్వా

మీా! భవబంధముల్ దునియుటే వర; మయ్యది చిక్కెని న్ననన్
క్షోభములెల్ల మానినవి సు, మ్మొకయల్పపుఁగోర్కిదక్కఁగన్

క. కరుణామయ! యయ్యల్పం
బెఱిఁగించుట చిన్నపుచ్చుటే యగు నిను నం
చఱమర గొనియెద 'మిచ్చెద
నఱసేయక యందువా బయల్పఱతు' మనన్. 217

చ. చిఱు నగ వామతిల్ల శశిశేఖరుఁ డిట్లను 'నన్నలార! యే
యఱమర లేక యల్పమొ యనల్పమొ కోరిక సెప్పకుండఁగా
వరము నొసంగుటెట్లు? లిటువంటిదె చల్లకువచ్చి ముంతదాఁ
పుర మొనరించు టంట, పొరపొచ్చెము లేకయ యిత్తు' నావుడున్.

గీ. భయవినయసంభ్రమములతోఁ బ్రమద ముబుక
నశ్వతరుఁ డను ఫుల్లఫణాంచితుఁ డయి
దేవ ! భూలోక మేలు పార్థివుఁడు శత్రు
జిత్తుసుతుఁడై ఋతధ్వజక్షితిపుఁ డలరు. 219

ఉ. ఆయువరాజుగేహిని మదాలస నాఁ జనుపుణ్యశీల య
న్యాయముగా నొకానొకదురాత్మకతంబున రూపుమాసె, నేఁ
డాయమ నాఁటిరూపము వయస్సునుగల్గి యథాతథంబుగా
నాయనుఁగుండనూజ యయి నాకునుదత్పతికింపు నింపుతన్.

గీ. మఱియు జాతిస్మరయు శాంతిమతియుఁ బరమ
యోగినియు యోగిమాతయై యుదయ మొంద

వలయుఁ దావకవచనప్రభావమున న
టంచుఁ గోరుటయును శంభుఁ డబ్బిపడుచు. 221

శా. ఈతీరౌ వరముల్ ద్రికాలములయం దేభక్తుఁడుల్ గోరరాఁ
డేతన్మాత్రము గాని దీని నలుపం బె ట్లంటిరో ? భస్మసా
ద్భూతంబై లయ మైనమేను పునరుద్భూతిన్ గనన్ గంటి రే?
చాతుర్యంబున "నిత్తు" నన్న నుడి నాచాయన్ వృథా
గొంటి రే ! 222

గీ. ఇది యసాధ్యాభిలషిత మె ట్లీరు గంద్రా
యరసితిరె? తొల్లి చచ్చి పూర్వాంగ మెనసి
వచ్చువాని; నాయువు గల్గి చచ్చువాని?
నేల యీాయభ్రసుమసౌరభేప్సితంబు? 223

క. అనుటయు గుటకలు మ్రింగుచు
ననిలాశనపరివృఢుఁడు చలాంగకుఁ డయ్యెన్
మనమున నెట్టెటొ ధృతి గొని
యనె దీనము లైన ప్రార్థనాలాపములన్. 224

చ. అకట ! 'దురాపమైన దిది'యంచు "జగంబుల నీవుదక్క వే
ఱొకఁ డిది యీా నదక్షుఁ" డనియుల్ నినుఁ గాంచుట కష్ట
మేని యె
న్నక తపియించినన్, మృదుమనంబునఁ బల్కక 'హాం'డనన్
సమా
ధికరహితుం డొకం డెవఁడొ తెల్పుము వానినె యాశ్ర
యించెదన్. 225

ఉ. ఈ వఖిలజ్ఞమూళివిగదే! నిను నచ్చికఁ గన్ను గప్పి యే
మేమో యసత్యముల్ పలికి యిష్టవరంబుల నొంద సాధ్యమా
నా? విను సృష్టిసేయుదు వనారతముఙ్, మును చావ కున్న
యా
జీవుల నెందఱిఙ్ గడనసేసితొ? యల్లక చెప్పదే దయఙ్.226

క. ఈనిత్యసముద్భవ మా
నానాజంతూత్కరములు నవనవము లోకో
మానుగ మును చా వెఱుఁగక
యీనాఁ డుదయించు నేది? యీావు వినాగా. 227

ఉ. చావక జన్మ మెత్తనటె జన్మము నెత్తక చావఁబోవ దే
జీవియు; చక్రవిభ్రమము సృష్టి యటంచును నేను నీకు నా
హా! వివరింపఁగా 'నరు'దటంచును నీ వవి వింటయా? మహా
దేవ! విచిత్ర మయ్యె గణుతించి మదల్పవరం బొసంగవే !

చ. 'మరణము నొంది మేను బసుమం బయి పో నెటు పుట్టు'
నందు వా
మరణము, మేను, దాహము, సమస్తము తావకమాయయైన నె
క్కరణి సృజింపఁజాల? వెది గావలె? నీకనుబొమ్మనన్న చేఁ
గరగత మైనతత్ప్రకృతికాంత సృజింపదె యెట్టిచిత్రముల్.

గీ. మూర్తియే లేనినీ వష్టమూర్తి వగుట
కంటె నాకొర్కి దుర్ఘట మంట వింత
యఘటనాఘటనాపటువనుచు దేవ!
మున్నెఱింగియ నిన్నుండగొన్నవాఁడ. 230

సీ. నీరుసోఁకినమాత్ర నాఱిపోయెడియగ్ని
నానీటఁ బుట్టింపవా కనంగ?
నగ్నిలోఁ బడినరూపఱు జలంబు సృజింప
వా విచిత్రముగ నయ్యగ్నినుండి?
శూన్య మాయింటికి జన్యమ్ముగా గంధ
వహము నిర్మించి పోవవె జగంబు?
కందుకమ్ములలీలగా భాస్కరాదిగో
ళములఁ ద్రిప్పవె నిరాలంబస్మృతిని?
నీవు లేనట్టి పరమాణు వెటుల లేదొ
యటులె నీయందు లేని యొక్కణువు గలదె?
కరుణ నాయెడఁ గల్గ కిక్కరణి నంటి
గాని తలపోయ నీ కశక్యంబు గలదె ? 231

చ. ప్రతినయొనర్చి వచ్చితిఁ 'దపంబొనరించి మదాలసన్ వెసన్
బ్రతుకఁగఁజేసి, తత్ప్రతికరగ్రహణప్రవణన్ బొనర్తు' నం
చతిధృతి; దాని కన్యమగునా విను మీతనువూఁది యింటి కే
గతిఁ జనెదన్ ద్వదంఘ్రులసకాశమునం దృజియింతుఁగా
కిదే ! 232

క. అనుటయు శివుఁడు ఫణీంద్రుని
ఘనతరసుజ్ఞానమునకుఁ గడు నలరుచు ని
ట్లనె నావచనంబున నీ
మనసునఁ గలకోర్కి దీఱు మానుము చింతల్. 233

వ. నీమనశ్శక్తియు వివేకమ్మును బరిశీలింప న ట్లంటి నన్యథా
భావింపవలదు. భవదీయవాంఛితంబు ఫలించునుపాయంబు

సెప్పెద సావధానమతి నాలింపుమని మదాలసాప్రస్తావ యంబు చెప్పఁబూనె నని జడుండు వాక్రువ్వ మీఁదివృత్తాంతంబు సాంతంబు వచియింపఁ దల్పిత యగు భార్గవుం డడుగుటయు. 234

శా. లక్ష్మాధీశ్వరపట్టబంధవిమలాలంకారుఁ, డక్షయ్యసా
రక్షేత్రార్జితధాన్యకోష్ఠవృతహర్మ్యస్థానవాసుండు, వం
శక్షేమంకర సాధువర్తన తనూజప్రాజ్యసేవావిశే
షాక్షీణప్రమదప్రఫుల్లహృదయుం, డవ్యాజకారుణ్యుఁడున్

క. విందుం, డారాధితగో
విందమనోహరపదారవిందుండు, బుధా
నందుండు, శ్రీసిరంగుకు
లేందుం, డాత్మజచతుష్టయీవిందుండున్. 236

పంచచామరము. క్షమాగుణప్రధానుఁడున్ విశాలమానసక్రమా
సమానమానమానుఁడున్ గృశానుతుల్యవిక్రమ
క్రమాపరాజితాహితప్రకాండకాండుఁడున్ లస
'జ్జమీనుదారు'లాంఛనప్రశస్తకీర్తి యెంతయున్.

గ. ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ 'కవితాభూషణ'
'విద్వత్కవిశేఖర' వెంపరాల సూర్యనారాయణ నామ
ధేయ ప్రణీతం బైన మదాలసావిలాసంబున
ద్వి తీ యా శ్వా స ము.

---

*

# తృతీయాశ్వాసము.



క. శ్రీరంగనాయికాచే
తోరాజీవస్రవన్మధుస్వాద కళో
దారభ్రమరిత హృదయుఁడు
రారాజద్యశుఁడు సత్రిరాజు దనరుతన్. 1

వ. ఋతుండు నిజజనకుం డగు భార్గవునితో మీఁదివృత్తాంతం బిట్లుపలుకు. తండ్రీ! శివుండు ఫణీంద్రునట్లు మెచ్చుకొని 'భక్తశేఖరా! అవహితుండనైవిను మని యీవైఖరి వాకొనియె.

చ. అమలమతిన్ స్వవాసమున కావటఁ జేరి పితృప్రియంబుగా
నమరిచి శ్రాద్ధమున్; బరిసమాప్తిని మధ్యమపిండ మారగిం
చి మది మదాలసాజననచింతన తత్పరవృత్తి నుండ మ
ధ్యమఫణమందు నుండి యుదయంబగు నాయమ నీకుఁ గూఁతురై. 3

క. మరణించునాఁటిమంజిమ
తరుణిమములు మెఱయ నామె తనతండ్రిగ ని
న్నరయుచు వరానుసారము
వరలును సౌభాగ్యభాగ్యవైభవములతోన్. 4

—♦ మదాలస పూర్వవయోరూపములతోఁ బుట్టుట ♦—

చ. అనుచుఁ దిరోహితుం డైనయంబరమౌళి కృపాతిరేకమున్
మనమున సన్నుతించుచు ఫణాధరనాథుఁడు సానుజన్ముఁడై

జని తనపీటికిఁ, నెఱపి శ్రాద్ధ మమరమనో క్త మైనరీ
తిని దిని మధ్యపిండము; నుతించె నిటుల్ పితృదేవతావళిన్.

ఉ. దైవతము ర్త్యపన్నగులుఁ దాపసకోటియు శ్రాద్ధరూపపూ
జావిధులన్ భజింప; శుభసంతతసిద్ధియు గోత్రవృద్ధియున్
దీవనచే ఘటించుపితృదేవతలన్ వినుతింతు మత్స్యప
ర్యావిధిఁదృప్తులై యభిమతార్థము లిచ్చికృతార్థుఁజేయఁగన్.

సీ. బ్రాహ్మణక్షత్రియోరవ్యశూద్రుల పూజ
నముల నెవ్వారు తర్పణంబు గండ్రి
కవ్యమ్ములను స్వధాకారమ్ములను దృప్త
లగుదు రెవ్వారు పావకాననమున
వలరుదు రెవ్వారు తిలగంధసుమధూప
దీపాదులను బాలఁ దేనియలను
నెవ్వారు వాంఛింతు రింపారఁ గాలశా
కము ముద్గమాషాదికము భుజింప
మూర్తులు నమూర్తులును నై నభో మహీ ర
సాతలాఖిలదిశల భాస్వరు లగుదురో
యెవరి యాశీస్సు వంశాభివృద్ధిహేతు
వట్టి పితృదేవతలకు సహస్రనతులు. 7

గీ. అనుచు మృత్యుంజయోక్తిఫక్కిని బితరుల
మదినిలిపి కన్ను లఱమోడ్చి మలఁచి యూర్పు
గగనసంఛన్నముగఁ బడగలను విప్పి
యురగపతి ధ్యాననిష్ఠఁ గూర్చున్నతఱిని. 8

చ. కురులు నొసల్ బొమల్ కనులుఁ గూర్చము నాసిక చెక్కు లోష్ఠ, కం
ధరము లురోజముల్ ముకుళితద్వికరంబు వళుల్ వలగ్న, సుం
దరజఘ,నోరు,జాను,చరణంబు లొకొక్కటి పైకి వెల్వడన్
దరుణి ఫణీంద్రమధ్యమఫణంబునఁ దోఁచెఁ బయోఽబ్ధి లక్ష్మి నాన్. 9

వ. అటు జనియించి కొంతతడ వావిరిబోణి యొకింతయూర్పు పు
చ్చుట, కనువిచ్చు, టంగములు సుంత కదల్చుట, లే క చేతిసం
బటు పడియుండ నాగవిభుఁ డాత్రముమై నొడిఁ జేర్చి సేద దే
ర్చుటయును గొంతసేపటి కురోగతవాయువు నాసఁ జేరఁగన్.

సీ. ప్రాణంబు లున్న వార్తను దెల్ప ననినట్టు,
లుస్సు రంచొక్క నిట్టూర్పు పుచ్చెఁ
జైతన్యమునకు సూచకముగా నక్కఁ బ్ర
క్క లు నొయ్య నొయ్యఁ గదలుపఁ జొచ్చె
గంఠగతార్తి దిగంబడ మ్రింగుచు
న్నటు క్రమంబున నొక్కగుటక వైచె
వికసన్న వాంబుజవిధమున నించించు
కగ నశ్రుపూర్ణమౌ కనులు విచ్చె
నూతిలోఁ బడ్డరీతి గొంతుకను వెడల
లేనిహీనస్వరమున విలీనవర్ణ
ముగను 'హా! జీవితేశ!' యం చగణితక్ల
మమున నెట్టెట్టొ పలికె నమ్మంజుగాత్రి. 11

క. 'అమ్మా! బ్రదికితివే' యని
గ్రమ్మన నిరుగేల మెత్తగాఁ బొదివి కవో
ష్ణ మ్మగుబాష్పమ్ముల ఘని
యమ్మానినిమేను దడియ ననియె నిటువలెన్. 12

గీ. 'బ్రదికి యున్నాఁడు తల్లి! నీభర్త, యడల
కడల' కన నట్టె లేచి 'యెక్కడను నుండె?
నొక్కపటి చూపవా తండ్రి! నిక్కమౌనె?'
యనుడు 'నూఱడుమా చూపెదన' యటన్న. 13

సీ. అన్న! ని న్నెన్నండు నరయ నెవ్వరవయ్య?
యశ్వతరుం డనునహివిభుండ
నేలోక మిది యిట కెట్లు వచ్చితినయ్య?
యిది రసాతలము, నా కుదితనైతి
నానాథుఁ డెటుల ప్రాణము గాంచె? రక్కసు
మాయ యయ్యెది, కాని మడియలేద
నాయత్తమామ లున్నారె జీవించి? యు
న్నారమ్మ నీకై విచారపడుచు
వచ్చునా ప్రాణనాథుఁ డీవంక కనఘ?
తెత్తు రేపటఁ జూపెదఁ దేలుకొనుమి
యని యిటు మదాలసాపన్నగాధిపతుల
కొక్కగడె సాగెఁ దొల్తఁ బ్రశ్నోత్తరములు. 14

క. పదఁపడి జాతిస్మృతిసం
పద నాయమ భూతపూర్వవర్తన మెల్లన్

మది నెఱిఁగి 'జనక' యను చా
సుదతి ఫణీంద్రునకు మ్రొక్కి సొంపానఁగూర్చెన్. 15

వ. అయ్యెడ నయ్యశ్వతరుం డమ్మదాలస నయ్యంతర్గేహంబున డాఁచి యుంచి యాయమకు వలయునుపచారంబు లొనరింపఁ బరిచారికల నియోగించి యాగుట్టితరులకుం దెలియకుండఁ గట్టడసేసి భూలోకంబుననుండి వచ్చి తన్నుదర్శింపఁ గుతూహలపడుచున్న నందనులఁ జేర నరిగి కువలయాశ్వునకు సేమమా? కొంటికై వడి నిచ్చలు నరసి వత్తురా? వింతలెవ్వియుం బుట్టవుగదా? యనుటయు. 16

—♦ కొడుకు లశ్వతరునితోఁ దాము తాళికేతుని జంపువార్త చెప్పుట ♦—

ఆ. తండ్రి మిత్త్రుఋణము దలఁగఁజాలితిమి యే
కాంశమాత్రమంద యాలకింపు
మదియు దైవఘటన మనుకొందు మస్మదు
ద్భవము మెఱసె నర్థవంత మగుచు. 17

క. ఆమెయిఁ దపమున కీ వటు
పో, మేము యథాప్రకారముగ మాసఖుఁ డౌ
నామహితుని గాంచఁగఁ జనఁ
గా మునివరుఁ డతనికడ నొకఁడు గనఁబడియెన్. 18

ఆ. అతఁడు గాలవాహ్వయబ్రహ్మఋషి యని
యాతుధానవిజయహేతు వనియు
నమ్మదాలసాపరాసుత్వవార్త విం
చరుగుదెంచె ననియు నెఱిఁగి వేగ. 19

మ. భయభక్తుల్ గదురంగ బ్రీణామము లొనర్పన్ మమ్ము
దీవించి మా
నియు నశుప్రిప్లుతవక్త్రుఁ డౌనతనితస్త్రీవిప్రయోగార్తి యం
తయు నున్మూలముగాఁగ సంసరణతత్త్వంబెల్ల వా(క్రుచ్చి ధై
ర్యయుతుం జేయుచునుండె, మాకు నెద వైరాగ్యంబు సంధి
ల్లఁగన్. 20

వ. అది యె ట్లంటేని.

ఉ. ఎచ్చటఁ బుట్టె నాసుదతి? యెచ్చట నీవు జనించి? తిర్వ రె
డ్డెచ్చట నైతి రాలుమగ? లేయది యట్టియపూర్వయోగ
మున్
దెచ్చిఘటించెనో యలయదృష్టమె కూర్చె వియోగమంచునీ
యిచ్చఁ దలంపు మార్తిఁద్యజియింపు గ్రహింపు బుణాను
బంధమున్. 21

చ. అనవుడు రాజపుత్రుఁ డనె నార్య! భవత్కృపచే లభించునిం
తిని గొని తెచ్చిచూపెడియదృష్టము గల్గక పోయెనంచు నాఁ
గనివగ మున్గినాఁడ, ధృతి గాడ్పడునేని వయస్యరాజితో
మనఁగలనే కళానిచయ మార్మికచిత్తవినోదరీతులన్. 22

ఉ. సాధువినుత్యశీల యగుసాధ్వి మదాలస నాకునై నిరా
బాధము జీవమున్ విడుచువార్తను వించుఁ గృతఘ్నమాళిగా
నే ధరియింతునా యసువు? లిట్టిశఠాత్ముఁడనైన నాకు ను
ద్బోధక హేతువై తమరు దోఁచుట శోకము పొంగ వార్ధియై

ఉ. దీనికి నేమి గాని గురుదేవ! కళిందసుతాతటీగతుం
డౌ నలపూనిమూలమున నంగన డించె నటం చెటింగి య

వ్వానిఁ గనంగఁ బోతి బహువారము; లాయుటజంబు గాని య
హ్మానియుఁ గాని తోఁప రతిమాయుఁ డతం డెవఁడో యె
ఱుంగుదే? 24

క. నన్నుఁ దొలుతఁ గన్గొంతన
కన్నుంగవ మోడ్చి కన్నగతి నావృత్తం
బు న్నెఱి వచించి వంచిం
చె న్నాప్రేయసిని, మునులు సేయుదురె యిటుల్ ? 25

వ. అనుటయు నమ్మునిలలామంబు కించిత్కాలనిమీలితలోచ
నుండై యుష్ణదీర్ఘనిశ్వాసపురస్సరం బి ట్లను.

—◆ గాలవమహర్షి తాళకేతునికి బ్రియ్యమిచ్చినవరము దెలుపుట ◆—

క. నాతండ్రి! యకట! వంచితు
లైతిరె మీ రెల్ల రటుల? యాఖలుఁ డనఘా!
పాతాళకేతు భ్రాత వ
గీతచరిత్రుండు తాళకేతుఁడు సువ్వే! 27

మ. పటుదోశ్శక్తిని నీవటుల్ రణమునన్ బాతాళకేతున్ వధిం
చుటయున్, దద్భృత యామదాలసను గొంచున్ బెండ్లియై యిల్లు సే
రుటయున్, దాపసబృందరక్షణయశోరూఢిన్, సదాసౌఖ్యమొం
దుటయున్, జారముఖంబునన్ విని దురాత్ముం డాతఁ డీర్ష్యాళుఁడై. 28

ఉ. ఎవ్వతెఁ బెండ్లియాడి సుఖయించెడి యేఁకట నున్న సోదరుల్
జివ్వనుగూల్చి యవ్వేలఁదిఁ జేకొని పెండిలియై సుఖంబుగా
నెవ్వఁడు పోల్చు; నాఖలు, మృగేక్షణ దానిని జంపకున్న చో
నెవ్విధి సోదరర్ణభర మీఁగుదు? దమ్ముఁడ నెట్టులయ్యెదన్?

శా. ఆజిన్ గెల్చుట దుష్కరంబు, పగతుం డండీరుఁ, డామీఁదశ
స్త్రాజీవుండఁట, కాని తాపసవిధేయస్వాంతుఁ డౌఁగావునన్
వ్యాజంబూని వధింతుఁ గా కనుచు మాయాపహానియై వచ్చినీ
రాజీవానన నిన్నుఁ బాపెను కుమారా! తాళకేతుం డటుల్

క. నీమృతి విని యామెయు, గృహి
ణీమృతి విని తత్ఫణంబ నీవును, మృతులై
పో మది నెంచెం గానీ
యామాయ సగంబె పండినది దైవగతిన్. 31

చ. అనుడు విషణ్ణమాహృదయ మంతయుఁ గ్రోధమయంబుగా మెయిన్
గనకనలాడునిప్పుకలఁ గప్పినయట్లయి కోప రాజనం
దనుఁడు 'మునీంద్ర! వాఁ డెచట దాఁగెనొ చెప్పఁడి యిప్పుడే వధిం
తును దదసృగ్ఝరిన్ సలుపుదున్ బ్రియకాంతకుఁ దర్పణాంజలుల్. 32

శా. భూమ్యాకాశపయోఽగ్ని వాయువుల నేభూతంబునన్ డాఁగినన్
దమ్మున్ దక్షలు మామకాప్రతిహతాస్త్రజ్వాలికామాలికా-

ధూమ్యాపూరితరోదసీకముగ దగ్ధుఁ జేయనేనిఁ మనో
గమ్యాకార మదీయపత్నిఁ గలియంగాఁ బంచితఁ గాంచె
దఁ. 33

క. క్షుద్రుఁడు మదాలసా ప్రా
ణద్రోహి సజీవుఁడై మనఁ క్షణమేనిఁ
నిద్రింతునె చూపు జగ
దృద్రంబుగ వాని ద్రుంచి వైచెద నిపుడే. 34

వ. అని యసహ్య క్రోధవిఘూర్ణితహృదయుం డగుకువలయా
శ్వనిప్రతినకు మనంబు దద్దరిల్లఁ గొండొక రాపడి మాలో
నే మి ట్లనుకొంటిమి. 35

చ. బహుళతరవ్యథాగ్నిఁ బుటపాకముగన్న మనంబు మోహాదు
ర్వహ మయి ప్రాణవాయు వెడఁబాపదె స్థాయి మఱొండు
గానిచో

ముహు రబలా స్మృతి స్ఫురిత సముత్థితశోకము వైరశుద్ధి స
న్నహనజకోపరూపపరిణామము గాంచె నితండు దక్కఁగా.

క. చిరముగఁ బ్రత్యుపకృతి నీ
పరమాప్తు బహూకరింప భావించెద మ
త్తఱి యిపుడు వచ్చె నీసఖు
శిరసునపూ వాడకుండఁ జెండుదమొ రిపుఁ 37

సీ. అని తలఁచి లోకకంటకుం డైనతాళ
కేతు నాయువుప ట్టెఱింగిన మహాత్ముఁ
డని తెలుపఁ గోర మునియుఁ బెం పలరఁ దయిలఁగ
ఁటుల వచియించె రక్కసుకుటిలవృత్తి. 38

శా. తుచ్ఛుం డాదితిజుండు సీధురసపాథోరాశి కుంభోద్భవా
నుచ్ఛిష్టం బనియెంచి కాఁపురము సేయున్ భూతిభోగాదికా
విచ్ఛిన్నంబయి తత్సముద్రగత మహాద్వీపంబునందొక్కటన్
దచ్ఛాయన్ గనఁజాలరెవ్వరును గన్నం బో రఘుత్రిస్థలే.

శా. సేవల్ సేసి విధాతమెప్పుగొని వాంఛించెన్ వరం బంచు నా
దేవానాంప్రియుఁ డోకుమార! త్రిజగద్దివ్యద్విపాజ్జంతువుల్
ద్యావాభూముల నెందు నున్నఁదనుఁ ద్రెళ్లన్ జేయఁగాలే
నటుల్.
దేవజ్యేష్ఠుఁడు నిచ్చె రక్షకయి యర్థించెం గదాయన్మతిన్.

క. ఆవరమునొంది యే మన
నావిష్కృతగర్వుఁడై నిశాటుఁడు రక్షో
దేవమనుష్యాదులఁ మా
యావి యగుచుఁ గలఁచు జగము లట్టిట్టు సేయున్. 41

క. అని తెలుపఁ గ్రోధావేశం
బున నాతఁడు మండలాగ్రమును గొని, తోడన్
గొన కెవ్వని, కువలయవా
జని నెక్కి చనెన్ విరోధిఁ జెండాడుతమిన్. 42

ఉ. మేము సదృశ్యరూపమున మిత్రునిపజ్జన యేఁగుచుండ న
య్యా! మిహిరుండటుల్ కువలయాశ్వము నెక్కి ప్రతాపదుర్నిరీ
క్ష్యామితధాటితోడ లవణాంబుధి నిక్షురసాబ్ధిదాఁటి హా
లామదగంధిలోర్మిబహుళం బయి యొప్పు సురాబ్ధిఁదార్కొ
నెన్. 43

గీ. అట్లు దార్కొని మధ్యేమహాబ్ధి పెద్ద
దీవి యగపడఁ దురగంబు దిగి యతండు
ఆకసము దాఁకుకోటయుం దలరుసౌధ
పంక్తిఁ జెన్నారునొకపురీవరము గాంచి. 44

చ. ఇదియ యగున్ దపస్వివచియించిన తత్సురవైరి దుర్గమా
స్పద మగుపత్తనం, బెటుపొసంగును దీనఁ బ్రవేశ? మెట్టు త్రుం
చెదను ద్విపాద్గణంబునకుఁ జెందిననే? నకటా! యుపాయ మె
య్యది యనికోరినన్ దెలుపఁడా ముని? యింతదలంపఁగిన్కమై

క. అని వెనుక కరుగుటా ముం
దున కేఁగుటయా? యటంచుఁ దొట్రిలుచును రా
ట్తనయుఁడు తురగస్కంధం
బునఁ బాణిని మోపి నిలిచి ముగ్ధుఁ డగుటయున్. 46

వ. మే మిరువురమును నదృశ్యరూపంబునఁ గువలయాశ్వంబు
ఖలీనపల్యాణంబులం దావహించి ప్రేరించుటయు.

చ. దిక్కులు పిక్కటిల్ల నతితీవ్రముగా సకిలించుచున్ జెపుల్
నిక్కఁగ నుక్కుమీఱ శరలీలఁ దదుత్తమవాజి వాఱి పెం
పెక్కినకోట దాఁటె, పురి నెందఱో యాశ్వికు లడ్డుకొన్నఁ జేఁ
జిక్కక తాళకేతుఁడు వసించుహజారము మ్రోల వ్రాలు
డున్. 48

క. చుక్క తెగిపడ్డపగిదిని
నక్కువలయతురగ మగ్రిమం దగపడ; నా
రక్కసులఱేఁడు చెంతకుఁ
గ్రిక్కునఁ జని దానిరూ పెగాదిగఁ గనుచున్. 49

శా. అరరే! యియ్యదియాఋతధ్వజుని వాహంబట్లకోఁ చేరనిజే
శ్వాసనిం బాసి ఖలీనపల్యయన భూషాభూషితంబై యిటుల్
పఱతేరఁగత మేమగుఁ? రిపులుచంపఁగవాని, దిక్కేఁది యి
క్కరణిఁ దిగ్భ్రమమొత్తి దిగ్భ్రమణముఁగావించు నంచెం
చెదరఁ. 50

శా. ఈగుఱ్ఱంబఁట వాసరార్థమున నే యేదేశలోకంబులఁ
వేగఁ గుమ్మరి వచ్చు నందు; రిటు దా విశ్వాసమె
ప్పఁ మదీ
యాగారంబును జేరవీడుదు నె? యం చాసక్తిఁ మైఁదట్టుచుఁ
వాగెన్ బట్టె సురారి పల్యయనబంధగ్రంథి సంధించుచుఁ.

క. పట్టుటయు మేము మారూ
పట్టె గని విశంకటస్ఫుటాటోపముతో
నెట్టయెదుట నిలువఁగ, దితి
పట్టి యదురుగుండె రిచ్చవడి కొంతవడిఁ. 52

ఆ. ధైర్య మెనసి మమ్ముఁ దండింప నాయుధ
మ్ములకు నలువలంకు గలయఁజూచు
చున్న క న్నెఱింగి యన్నిశాటుని పాద
హస్తనిగళయుగళ మైతి మేము. 53

శా. మమ్ముఁ జంపి యెటేని తేనివిడిపింపఁ గమ్మితద్భృత్యలో
కమ్ముఁ దీవ్రవిషాగ్నికీలలను నింగాలమ్ములఁ జేయ, ధై
ర్యమ్ముఁ వీడొఁకని తక్కరక్కసులు చేరఁ గంపమొం
దంగ; మే
మమ్మాంసాళిని గాంచి పల్కితి మనేమామర్షవాగ్వైఖరిఁ.

శా. ఓరీ! పాపవిచార! క్రూరమతి! మాయోపాయధారేయ! సా
ధ్వీరత్నంబుమదాలసన్ గుసుమగాత్రిన్ వంచనన్ ద్రుంచిర
క్షారూపం బచరించుదాఁకఁ జలమున్ సాధించితే!యింక నే
దారిన్ బోయెదు ప్రాణధారి వయి, తత్పాపంబ నిన్
మాపదే? 55

శా. కన్యారత్నము నాఁచి తెచ్చి హఠమున్ గావించు నీయు
న్నదా
ర్జన్యం బెన్నఁగ న్యాయమున్, దురితపూర్ణస్వాంతు నా
కూ్రరునిన్
జన్యక్ష్మోశ వధించు టక్రమము నౌనా? యానుబో వైరిఁ గా
కన్యాయంబుగఁ దత్సతిన్ గెడపి తే మాసించిరా బాలిశా!

చ. తులువను నిన్నుఁ బ్రాణములతో విడువన్ మహి కెల్లద్రో
హమున్
సలుపుట, గాన దేవుని మనంబున ధ్యాన మొనర్చుకోర! నీ
తల దెగెరా? ద్విపాత్తులకుఁ దక్కక త్రిక్కిన నేని గూఢ పా
త్కులు లగుమాకుఁ జిక్కి బ్రిదుకుంజవిఁ గాంచఁగ నీతరం
బౌకో. 57

క. అని కనలి దూఁటి తద్గళ
మును గోటలఁ గఱచి వదనముక్త విషమహా
గ్నిని నసుర బసుమ మొనరిచి
పనిచితిమి తదగ్రిజన్ముపజ్జకుఁ దండ్రి! 58

ఆ. అట్లు నిస్సపత్న మగునట్లు గావించి
ద్విజకుమారరూప ధేయుల మయి

యత్తురంగ మెక్కి యలవోక సింధుతీ
రస్థు మిత్రుఁ గాంచ రా నతండు. 59

ఉ. పెద్దగ బాహులెత్తుకొని ప్రేమముతో నెదు రేఁగుదెంచి మ
మ్మొద్దఁ గౌఁగిటన్ బొదివి 'యెప్పుడువచ్చితి రన్నలార! యె
ట్లద్దితిపుత్రుఁ గంటిరి? మదశ్వ మిదెక్కడ మీకుఁజిక్కె? వాఁ
డెద్దియొఁ నర్చుచుండెఁ? దర నే ననుఁబోఁటికి వానిమార్గ్గమున్?

క. అని మారాకకు నబ్రిం
బెనయుచుఁ రిపుఁ దునుమువెర వెదేఁ బనుపడునే
యని తహతహ నొందెడుమా
యనుఁగుంజెలికాని కిట్లు లంటిమి వెంటన్. 61

శా. అన్నా! నీ వటు గాలవర్షిపలుకుల్ సాంతంబు నాలింప క
స్థన్నక్రోధవశుండవై యపుడ యశ్వం బెక్కి విద్వేడ్వధో
త్పన్నోత్కంఠను బోవఁగాంచి 'విధిదత్తం బౌవరంబెంచఁ డా
యె న్నిష్కారణ మేమి యానొకద? యం' చేమెంతొ చింతిల్లు
చున్. 62

వ. నీకంటె మున్ముందర యాదైతేయునంగమచ్చి మెఱుంగ
వానివీటికిం బోయి వానిఁ గాంచఁ బ్రతీక్షించి యుండ మా
యండకు వచ్చినయీకువలయాశ్వంబుఁ బ్రేరించి ద్విపాజ్ఞం
తువులకు వాఁ డవధ్యుండు గావున దీనిచేతఁ జంపించితి"మని
మాగూఢపాత్త్వంబు నిగూఢం బొనరించి యథాపూర్వ
ముగాఁ బలికినట్లు పలుకుటయుఁ గువలయాధీశుండు సంతోష
పరవశుండై మాకిట్లనియె

ఉ. జాతి, వయః కళాభిజన సంపదలం దెదిఁ గాదు మైత్రికిన్
హేతువు, ప్రాజ్ఞునుస్సు కృతమేయగుఁగాని; సఖుండుగల్గగాఁ
జ్ఞాతినియోజ్యబాంధవులు సైన్యములున్ ధనముల్ వృథా
గదా
చేతముఁ బ్రాణ మర్పణముసేసి విపత్తున వీరు గాతురే? 64

వ. అని మామైత్రిని శ్లాఘించి.

చ. నదు లయి చెమ్మటల్ మెయిఁ దొనంకఁగఁ గ్రోధమునుండి
'బుఱ్ఱు' మన్
రొద యుదయింప నూర్పు లనణుత్వము గాంచఁ; జలింప
దేహ, మ
య్యెదుటన నిల్చియున్న తురగేంద్రము డాసి కరంబుతోడ స
మ్మదమున మూఁపుదట్టు చసమప్రియతన్నుతియించెనీక్రియన్

శా. 'అంభోజాప్తవరప్రసాదమవు, దేవారాతి జీవానిల
స్తంభాభిజ్ఞుడ వస్మదీయసకలాశాకోటిరాజజ్జయ
స్తంభాలంబమ వద్రివార్ధిమరుత్తారాధ్వచారక్రియా
లంభూష్ణుండవు వాజిరాజ! నినుఁబోల్పన్ గల్పకం బల్ప మా.

మ. అనిముమ్మారు ప్రదక్షిణించి పటుభక్త్యావిష్టుఁడై మ్రొక్కి మె
ల్లనఁ గందంబు కరంబునన్ జఱచి పల్యాణంబు కళ్యంబు చ
క్కన గాఁగూరిచి యంకవన్నియఁబదాగ్రంబూఁదిపైనెక్కి మ
మ్మును దోడ్కొంచును 'ఛే'యనంగఁ దురగంబున్ బాఱఁ
జొచ్చెన్ దివిన్. 68

గీ. అటుల హాలాసముద్రంబు నతకరించి
యిక్షురససాగరము దరియించి యుప్పఁ

గడలి నశ్రమమున దాఁటి పుడమి సేరి
క్రమముగా వచ్చి గాలవాశ్రమము సొచ్చి. 69

క. 'అరిఁ జంప నేను దెలిపెడి
వెరవు వినకె చనెఁ గుమారవిభుఁడే మగునో
యరిచే' నని కలఁగుచు నెను
రరసెదు గాలవుస కెఱిఁగి యఖిలము వినిచెన్. 70

వ. వినుచుటయు నయ్యనఘుండు.

— కువలయాశ్వునికి గాలవమహర్షి హితోపదేశము —

చ. అకట! యమర్ష మంతరభియాతిగణంబునఁ గ్రూరమై, విమ
ర్శకత హరించి, గౌరవము చకొ్కనరించి, విపత్పరంపరన్
వికలతఁగూర్చి, యెల్లెడల వేరిమిఁ దాటిచి, యెప్పుడెందు గె
ల్పొకలవమున్ ఘటింపదుగదోయి! యెఱుంగవె యీరహ
స్యమున్. 71

మ. తగునయ్యా! యిటువంటిసాహసము, సొంతం బేను వ్రాకు
వ్వకే
పగతున్ జంపఁగఁ గ్రోధఘూర్ణితనిజస్వాంతుండవై యేఁగి, త
ప్పగిదిన్ దైవవశంబునన్ సఖులునశ్వంబున్ సహాయంబులై
పగతున్ గూల్చిరిగాక; నీవ యెదిరింపం గల్గ; నేమౌదువో!

గీ. ద్విపదుఁడవు నీవు తగవు వధింప నసుర
పతిఁ; జతుష్పాత్తునో గూఢపాత్తునో ని
యోగ మొనరింప నుండ నీ వేఁగితైనఁ
గాకతాళీయముగ గెల్చె కాంచఁ గంటి. 73

సీ. కలుగునే గెలుపుగాక మహోంద్ర నీ కెందు
భానుప్రసాద సంప్రాప్తిఁ జేసి
యోర్తురే యాజిఁ ద్రిమూర్తులే నియు సర్వ
శస్త్రాస్త్రవిజ్ఞానశాలి నిన్ను
నిల్తురే విద్యల నీముందు పాశ్చాత్య
రాజ్ఞాసనాధీం ద్రులైనఁగాని
కలఁతురే యప్సరోంగ లేని యేకప
త్నీవ్రతస్థితుఁడ వౌనీమనంబు
భూతభావిభవంతిభూభుజులు నిన్నుఁ
బోలఁగలరయ్య ధర్మసంపూర్ణపాల
నమున రిపుశాతనమున దుర్దమహృషీక
చయవశక్రియ, సౌమనస్యమునఁ బుత్రి? 74

గీ, అరయ నన్నింటఁ బూర్ణుండ నైతి మున్న
కాని యిట్టు లనాశ్రమి గానె యుంట
యెంతయు నధర్మ మనుచు గర్హించు స్మృతుల
యరయకుందువె యని సంశయమ్ము దోడరె. 75

క. అనుటయు మార్వలుక కఫో
వనతాననుఁ డగుచుఁ గన్గవం బాష్పాంబుల్
దొనఁక 'మదాలసఃశోడనె
చనె నాగృహిధర్మ' మనువిశాంపతి కనియెఁ. 76

క. మీాపేర్మి మట్టిదియు, దై
వపేరణమునను దెగియె, వగపొందుచు ధ

ర్మపరిశీయ మొనర్చెదె యీ
విప్రార్భకు లక్కటంత వెస ధీర్తి సుమీ. 77

వ. అని మావంకఁ జూచినవ్వుచుఁ బలికి. పెక్కుధర్మంబు లక్కుమారనృపతికిం జెప్పి పోనంపిన నక్కువలయాశ్వుతోఁ జని యాతనినింట డిగ్గవిడిచి యిటకువచ్చితిమి సుమా. 78

క. అని తాళకేతువధముఁ
విను చుసుతులఁ గాంచి భోగివిభుఁడను 'నృపనం
దనున కుపకార మెదియే
నొనరుపుఁ డని యంటి; నటుల నొనరింత్రుబళీ! 79

—♦ కువలయాశ్వుని నాగకుమారులు పాతాళమునకుఁ గొనిపోవుట ♦—

చ. అదిగద! మైత్రిలక్షణ మహర్నిశముఁ మిముసోదరత్వసం
పద నటు లాదరించు గుణమండనుఁ డౌసఖుకార్యముఁ
రుచుల్
పొదల ఘటించి మీరుఋణముక్తుల రైతిరి, మీకుఁదండ్రినై
ముదితుఁడ నౌననుఁ సయితముఁ ఋణముక్తు నొనర్పఁ
జూడరే! 80

ఉ. ఆయనఘుఁ గనుంగొన నిరంతర ముర్వీళులూరుచుందు; నే
లా యలవోక నేని యిట కర్మిలిఁ దోడ్కొనిరా రొకప్డు? నం
చాయతహార్ద ముట్టిపడ నంటయు వెంటనె పాఁపరాసుతుల్
పోయి, ఋతధ్వజుంగదిసి, పూర్వమటులఁ విహరించు నత్త
ఱిఁ. 81

ఆ. తాళకేతువధకథల్ తుదమొదలు లే
కెలమిఁ జెప్పికొనుచు నిష్టలీల

నాటలాడుకొని నెడునంతరమ్మున నిట్టు
లనిరి ఫణికుమారు లధిపసుతుని. 82

క. అన్నా! నీసన్నిధి కే
మిన్నాళ్లుగఁ జెలిమి నెంచి యేతెంతుమొ, య
స్మన్నిలయమునకు నరుదే
వెన్నఁడు; సౌహార్దధర్మమే యిదిచెపుమీ. 82

చ. అన— నృపసూతి వల్కె హితులార,! యిటాడఁగ నేనె? నానికే
తన మిది మీది కాదె? యెడఁదన్ నను నన్యుఁగ నెన్నఁ జన్నె? వా
హనధనధాన్య రత్నవసనాది మదర్థములందు నెవ్వి యె
వ్వని కిడఁగోరుకొన్న నొసవం దగుఁ బ్రేమయె యున్న నాయెడన్. 83

గీ. పాపవిధిహతుఁడను గాన నాపగిది గృ
హమున నాయెడ మమత మీ కమరదాయె
హితము నా కూన్చుచు ననుగ్రహింతు రేని
మమతఁ గాంచుఁడు మద్గృహార్థములపట్ల. 84

క. మీసర్వస్వము నాయది,
నాసర్వము మీఁది, సఖుఁడనన్ బాహిరమై
భాసిలు ప్రాణము, కావున
నీసరణి విభేదమెంతు రే నొట్టుసుఁడీ. 85

గీ. అంచుఁ జెలిమిఁ గించిత్తు కోపించి పలుకఁ
కువలయాశ్వుని గాంచి వ్యాకోచవారి

రుహాములై మోము లలర నయ్యహిపతనయు
లిటుల పలికిరి వికసితహృదయు లగుచు. 86

ఉ. అన్న! త్వదుక్త మంతయు యథార్థము, మేమును నట్టి చిత్తమం
దెన్నదు, మన్యథా తలఁప; కియ్యెడ 'మాయిలుసేరనీవు ర
మ్మన్న? య'టంచు వేడ జనకాజ్ఞయె హేతువు; నిన్నుఁ జూడ మా
యన్న సతంబు గోరు, భవదానయదార్థము యంపె మమ్ములన్. 87

చ. అనవుడుఁ 'దండ్రి రమ్మనియెనా? కృతకృత్యుఁడ ధన్యుఁడన్ జుఁడీ'
యనుచు ఋతధ్వజుండు రయమూర వరాసన ముజ్జగించి మే
దినిఁ బడి మ్రొక్కి 'పోవ్రదమిదే! జనకాజ్ఞకు నెన్నడున్ విలం
బన మొనరింప నేఁ"నని భక్తియు రక్తియుఁబొంగి పొర్లి పోన్.

గీ. తలఁప మాతండ్రి యనఁగ నాతండ్రి కాఁడె
యట్టిమహితునియాన కెందైన నాల
సింతునే? నన్నుఁ జూడ వాంఛించువార్త
యున్ననాళ్లేల చెప్పరో యన్నలార! 89

క. ఎంత ప్రమాద మొనర్చితి
మింత దెలుప రెప్పుడుఁ దండ్రిరోఁకట మీఁదల్
సంతతము కలియుదుమె యా
వంత తలఁప జనకదర్శనార్థము నేనున్.

ఉ. ఆయన ప్రేమ చింద నను నారయఁగోరెడుదాఁకఁ బోనినై
ధేయుఁడ; నన్ను వంటియవిధేయుఁ గృతఘ్నునినెందుఁ గాంచినా
రే? యొకనాఁడు తల్లికుశలవృత్తము ప్రశ్న మొనర్పఁ; గాంచ నే
నై యట కేఁగుదేరనకదయ్య! పదం డిదె వత్తు వెంబడిన్.

వ. అని యాదండశూకేంద్రనందనులం గూడి ధరాధిపనందనుం డమందభక్తి నప్పుడ పురంబు వెల్వడి పాదచారియై మార్గమధ్యంబున వింత లరయుచు సుదూరం బరుగునంత.

శా. మాధుర్యప్రచురంబు శీతలిమసంపన్నంబు మానోజ్ఞక
శ్రీధుర్యంబు సభంగభంగపృషదార్ద్రీభూతమూలప్రతీ
రాధేయద్రుమశోభి, హంసబకచక్రక్రీడితాంభోజషం
డాధారం బగుగౌతమీనదిప్రవాహం బడ్డ మయ్యెన్ స్ఫూర్తిన్

చ. పరమపవిత్రవారిస్ఫురభాస్వరమైన తరంగశ్రేణిన్ సమా
చరిత వగాహ సాంధ్యవిధి సప్తహయార్చనులై విలాసభా
సురగతిఁ దీరమందుఁ జనుచున్, వినుచున్ జలపక్షి సంకుల
స్వరములు; గాంచుచున్ బ్రకృతిసంపదసొంపు, లెలర్చి రాత్మలన్

వ. అట్లు కొండొక విహరించి యన్నదీమధ్యంబునుండి సైకతంబులం బోవుచున్నయన్నాగకుమారుల ననుసరించి యేఁగుచు నాకువలయాశ్వుండు వారలనివాస మవ్వలితీరంబున నున్నది కాఁబోలునని యాత్మఁ దలంచునవసరంబున. 65

గీ. అన్న! కన్నులు మూసికొ మ్మంచుఁ గువల
యాశ్వునిరుగేలు పట్టి నాగాత్మజులు స్వ

మూర్తులు ధరించి క్షితిబిలమ్మున రసాత
లమునకుం గొనిపోయి రబ్రింపుశక్తి. 96

ఉ. అంతటఁ గన్నువిచ్చి యరయన్ ఫణసీమలు స్వస్తికాంకనా
క్రాంతము రత్నకాంతమును గా ఫణులై కనిపించువారి భూ
కాంతుఁడు చూచి, విస్మయవికస్వరలోచనుఁడై 'సరోజభూ
సంతతివారె మీ' రని హాసన్ముఖుఁడై పరిపృచ్ఛసేయఁగన్

ఉ. అశ్వతరాత్మజుల్ కువలయాశ్వునితోఁ దమతండ్రిఁ పన్నగా
ధీశ్వరుఁ డంచు శాంతుఁ డని దేవసమిత్స్తవనీయకీర్తి యం
చశ్వతరాహ్వయప్రథితుఁ డంచు వచింప;ముదబ్ధిఁ దేలి భూ
మీశ్వరుపట్టి కొంతవడి యెంతయు వింతగ నెంచె నెమ్మదిన్.

వ. అట్లు విస్మితుం డయి క్రమముగా వస్తుస్థితి యెఱింగి స్వా
స్థ్యంబు నొంది.

సీ. నవరత్నమయమండన శ్రీయుతకుమార
తరుణ స్థవిర భోగిపరివృతంబు
హార కేయూరమంజీరాద్యలంకారి
తాంగక నాగకన్యాయుతంబు
వేణువీణాస్వనాన్వితగీతమర్దళా
ద్యాశోద్యహృద్యసౌధాంచితంబు
సమ్మృతకాసారరసాభ్యుదితోత్ఫుల్ల
తరులతాసుందరోద్యానతతము
నంధతమసాద్మరమణీమహాప్రభా వి
తానపరిహృతదినకరం బైనభుజగ

జగము గని పింత యనుచు నౌరగకుమార
వరులబడి వీథిఁ జనె ఋతధ్వజుఁడు వీట. 99

చ. రతనపురాచబాటలు, సురస్వరసంకులమైనపేట, లు
న్నత మగుపైఁడిమేడలు, ననంతము ముద్దిడుకోటగోడ, లూ
ర్జితు లగుభోగిసంతతులు, జెన్నులతిన్నెలు నాగకన్నెలుఁ
క్షితిపతిసూతిచూపులకుఁ జిత్రములై కననైరి యెల్లెడన్.

వ. వీరలు పన్నగు లౌట నీజగంబు పాతాళ, మియ్యది భోగవతీ
పురంబు నౌఁగదా యని రాకొమరుండు నిశ్చయించుకొనియె.

శా. ఆరీతిన్ బురలక్ష్మిఁ జూపులన గాఢాశ్లిష్టఁ గావించుకొం
చారాజన్యసుతుండు నెచ్చెలులచాయన్ దన్మణీధామమున్
జేరంగాఁ జని శూరపన్నగభటానీకాతిసంబాధమై
శ్రీరమ్యం బగునాగరాజుసభఁ జొచ్చెన్ మెచ్చెఁ దచ్చారి
మన్. 102

—◆ అశ్వతరుఁడు కువలయాశ్వుని గౌరవించుట ◆—

వ. అట్లు మెచ్చుచు నెచ్చెలులతో రచ్చం జొచ్చి.

సీ. ధృతదివ్యమాలికాదివ్యాంగరాగది
వ్యామూల్యసూత్రాంబరాభిరాము
లలితముక్తాఫల లతికామనోజ్ఞహా
రాలంకృతాతివిశాలవక్షు
మణిమయకుండలమకుట కేయూరకం
కణమేఖలాపదాంగదవిలాసు
వైదూర్యవిద్రుమవార్తాంతరితరూప్య
హాటకసింహాసనావభాసుఁ

బంచముఖ, దశరసనా, ద్విపంచనేత్రి,
మూర్తి సమవేతుఁ బాండురకీర్తిపూతు
నమృతమయమానసాంతరు నశ్వతరుని
గనె ఋతధ్వజుఁ డక్షీణయుగ్మంబు దనియ. 103

మ. కని యల్లంతన మేను పొంగఁగ నమస్కారంబు గావించుత
జ్జనపాలాత్మజు నాత్మజుల్ దెలుపఁ బాతాళేశ్వరుం డాసనం
బును వీడ్కొం చెదు రేఁగి పెద్దగఁ గరంబుల్ సాచి గాఢోపగూ
హనముల్ సల్పెఁ 'జిరాయు జీవ'యని మూర్ధాఘ్రాణముల్
జేయుచున్. 104

గీ. మఱియు నిహతవిరోధిసమాజుఁ డయి
శుద్ధమతిఁ దోడ జనకశుశ్రూషణమ్ము
సలుపుదువు గాక యంచు నాశాసనంబు
సేసి యాసీనుఁ జేసె సద్వాసనమున. 105

వ. అంత.

సీ. పల్లెరం బొకఁ డంఘ్రిపాళికిఁ దిందుగఁ బట్ట
నొకరుండు గడిగెఁ బాదోదకముల
నునుఁజేల నందీయఁగ నొకండు, వేఱొకం
డది గొని తడి వోవ నల్ల నొత్తెఁ
బానీయ మొకఁడు దేఁ బో, నొకరుం డేఁగి
చెచ్చెరఁ దెచ్చి యందిచ్చెఁ దావి
నదుటిలేఁజెమ్మటల్ గదిసి మొక్కం డొత్తె,
నసరె నొక్కండు కొంకిరిసురంటి

నగరోకం, డత్తరోకఁడు, వీడ్య మ్మొకంను,
చందన మొకండు నొసఁగె నీసరణి నుపచ
రించి రారాజపుత్రు దర్వీకరేంద్రు
కన్నుబొమసన్నలనె యూడిగములగములు. 106

క. అన్యోన్యకుశలప్రశ్నా
మాన్యు లగునసంతరము కుమారనృపుఁ డసా
మాన్యమహిము నహిమహిరా
జన్యుఁ బలుకు నిటలఘటితచటులాంజలియై. 107

ఉ. ఈయెడఁ జూడఁ గోరి తని యీసుహృన్మహుల్ వచియించు దాఁక సు
శ్రీయుతుఁ దండ్రి నిన్ను దరిసింప నొకప్పుడు నేని రాని యా
నాయపరాధకోటి కరుణన్ క్షమియించితి నంచుఁ దొల్త నా
ర్యా! యన నేని యెట్లు భవదగ్రమహిన్ నిలువంగఁ జాలు
దున్. 108

క. నీదుతనయులకు నాకు న
భేదాధ్యవసాయ మాట వినియుఁ బృథక్త్వా
పాదనసూచక మగు పూ
జాదిక మీ విటు లొనర్చు టరయఁగ సిగ్గా. 109

శా. భక్తిన్ నీపదపద్మధూళిఁ దలఁదాల్పన్ వచ్చు నాచే మహా
రక్తిన్ సేవలుగొంచు దీవనలు మాత్రన్ గూర్చి పోనంప, కా
సక్తిన్ దేవునిగాఁ దలంచి యిటు పూజల్ సేయఁ దండ్రీ! భవా
దృక్తేజస్వుల కర్హమే? సుతుఁడఁ గానా నీకు భావింపఁగన్.

చ. అని భయమున్ నయంబు వినయం బనయం బగునానతోఁ
బెనం
గొనఁ దలవంచి యంజలిని గూర్చి వచించు ఋతధ్వజున్
గనుం
గొని భుజగేంద్రుఁ డిట్లు పలుకున్ బులకల్ మొలకెత్త మేన
నం
దన! యభినందనీయము గుణంబో వయస్య వచింపు మేర్ప
డన్. 111

ఉ. ధన్యుఁడ వైననీగుణవితానము నీదుపరోక్షమందు సౌ
జన్యధనుల్ మదాత్మజు లజస్రము గాన మొనర్పిందుఁ, ద
న్మాన్యగుణంబులన్ ద్రికరణంబులఁ బాయ కుదారశూర
మూ
ర్ధన్యుఁడవై యొసంగము చిరంబు ప్రసూనయతి ప్రధీనతన్

సీ. శ్లాఘ్యంబు సద్గుణశాలి జీవితము వి
వర్జితగుణుఁడ జీవచ్ఛవంబు
తల్లిదండ్రుల కనంతసుఖంబు, రిపులకు
హృదయజ్వరం, బాత్మహితము, పూజ్య
జనులకు విశ్వాసమును ఘటియిల్ల వ
ర్తించెడు సుగుణగరిష్ఠు నెపుడు
దేవపితృద్విజార్థిస్నిగ్ధ బాంధవుల్
దీవించెదరు 'చిరం జీవ' యనుచుఁ
బరుల దూఱక, పేదలఁ గరుణఁగాచు
చాపదల మున్గువారి కుద్ధర్తయగుచు

వెలయు సుగుణైకధనుని జీవితమె జీవి
తమ్మ గా కన్యనిది జీవితమ్మ తలఁప ? 113

వ. అని యశ్వతరుండు శ్లాఘాగర్భితంబుగను బ్రేమనిర్భరంబు
గను నాశీర్వదించె నంత.

క. వినవచ్చె మధ్యమాహం
బును దెలుపఁగ శంఖనినదములు మోసలపై
ననువొప్పెడు గడియారం
బుననుండి పయోదఘోషమున కెన యగుచుఁ. 114

గీ. కొలువు సాలించి యహికులతిలకుఁడంత
స్నానమందిరమున కాత్మజాతు లధిప
సూనుఁడును దాను నేఁగి యచ్చో నియోజ్య
సమితి దీర్ప నభ్యంజనస్నాన మాడె. 115

సీ. అగరునూనియఁ దలయంటెఁ బన్నగి యోర్తు
కొనగోళ్లఁ గురులచిక్కను సడల్చి,
యొకనాగకన్యక యుద్వర్తన మొనర్చెఁ
బరిమళ ద్రవ్యలిప్తముగ మేన
మృగనాభిఘనసారమిళితపటీరపం
కమునఁ గూరిచె నటకలి యొకర్తు
ఫణితలోదరి యోర్తు మణికలశావర్జి
తంబైన పన్నీటఁ దడియఁ జిలికె
జలకమార్చె నొకర్తు, గొజ్జంగి నీట
నొత్తె మైతడి నునుఁజేల నొకభుజంగి

సురభిధూపాప్తి సీటార్చెఁ గురు లోకర్త
రాకుమారుని కపుడు పరాకు లేక. 116

మ. జలతా రంచుల మేల్పుటాపనివిలాసం బొప్పు కౌశేయవుల్
వలిపంబుల్ మెయిఁగట్టఁబెట్టి పటుగంధద్రవ్యమిశ్రంపుఁబూఁ
తలఁ గైసేసియుఁ గస్తురిన్ దిలకముల్ దాల్పంగ సందిచ్చి ని
స్తులభూషాళి నలంకరించి రహిఁ పుత్రుల్ మిత్రుఁ బిత్తాజ్ఞచే

ఉ. అయ్యెడఁ బానసీల్ పచనమయ్యెఁ బదార్థములంచుఁ దెల్పఁగా
నొయ్యన బాంధవాతిథి సముత్కరసాంద్రము భుక్తిశాలక
క్షయ్యముదాప్తిఁ జేరి సరసన్ సుతులున్ నృపసూతియుండున
ట్లయ్యురగేంద్రుఁ డొక్కరుచిరాయతపీఠికఁ గూరుచుండి
దాన్. 118

క. ఇష్టాలాపమ్ములలో
మృష్టాన్నము వారిబంతినే ఫణివిభుఁడున్
దుష్టి యొదవ సాపడి యుప
విష్టుఁడయి వినోదమునకు వెస రాఁ బనుపన్. 119

—♦ అశ్వతరుఁడు కువలయాశ్వుని మనస్సును పరీక్షించుట ♦—

చ. సురుచిరహావభావ చటుసూక్తిచమత్కృతులై త్రిలోక సుం
దరు లగు నాగకన్యలు సుధామయ సుస్వరగీతికా విక
స్వరనటనాభినీతుల రసంబులు చిందఁగ నాడ, రాట్సుతుం
డరయును మానియై,విను ననాదరుఁడై, ద్రవియింప లేఁడెవన్.

క. అది యెఱిఁగి భోగివిభుఁ డ
మ్మదవతులను బోవ నంపి మహీపతిసుతునిన్

హృదయంగమ మగుకథలన్
ముదమునఁ దేలించి ప్రేమమున నిటు వల్కెన్. 121

సీ. అయ్య! నేఁ డీవు మాకు నభ్యాగతుఁడవు
గాన సూనుండు జనకు శంకను దొలంగి
యడిగినటు నన్ను నీ కిష్ట మడుగఁదగున
యంబర సువర్ణ ధన వాహనాది నెదియు. 122

ఆ. అనుడుఁ గువలయాశ్వుఁ డను దేవ! నీప్రసా
దమునఁ గలవు నుర్వీ తండ్రియింట
స్వర్ణరత్నవిత్తవస్త్రాదికము లెల్ల
నేల నాకు? నేన యిత్తుఁ బ్రజకు. 122

సీ. సర్వసర్వంసహాచక్రశాస్త నాదు
తండ్రి గలవేయియేండ్ల కింతయుఁ గొఱంత
నా కేటుల గల్గుఁ? బాతాళలోక మేలు
నీకరుణఁ గంటి, నిం కేల నాకు యాచ్న. 123

క. ఇచ్చ పొడము యాచ్నకు ని
ప్పచ్చర మగుతఱిని నెట్టివానికి, నటుగా
కుచ్చైర్విధమున సంపద
లచ్చువడిన నారసజ్ఞ యాచన కగునే? 124

క. పితృబాహుతరుచ్ఛాయా
శ్రితులై 'నాస్త్యస్తి' చింతఁ జెందనితనయుల్
కృతపుణ్యులు; శిశుత నె గత
పితృకు లగుకుటుంబు లెంత విధివంచితులో. 125

చ. జనకుప్రసాద మొందుట నజస్రము నర్థులు వేఁడినంత యీ
ప్పన మొనరింతు మున్ను పితృభక్తుఁడనై ధనకాంచనాది; ని
న్గని తలఁ దాల్చి నీచరణకంజపరాగము, తావకోపగూ
హన మిపు డొందఁ గాంచుట మహాత్మ! కొఱంతలు దీఱె
సర్వముల్ 126

క. జనకుదయఁ దృణప్రాయము
ధనములు నా; కర్థులకు సతంబు నొసంగన్
దినఁ గట్టఁ గొఱఁత గన, యీ
వన మారోగ్యమును గలవు పార్థివ మిఁ కున్నే? 127

చ. అనుచు వినీతిమైఁ బలుకునానృపనందను నందనోపక
ర్తను గని కుండలీంద్రుఁ డనురక్తిని నావలనన్ గొనంగ మం
డనవసనాదికంబులయెడన్ మది వుట్టదయేని; యెట్టిదై
నను ఘటియింతు నీమనమునం గలకోర్కి వచింపు నావుడున్

మ. ధరణీంద్రాత్మజుఁ డిట్లువల్కు భుజగేంద్రా! తప్పదంతేని భా
స్వరకార్తస్వరభూషణాసనమణిస్రక్చందనస్త్రీసుతాం
బర సౌధావ సథాన్నపాన ముఖసమ్యగ్భోగముల్ గల్గు ని
ర్భరధర్మంబునఁ; గాన వర్తిలుత మత్స్వాంతంబుధర్మంబునన్

క. ఈదృగనన్యాదృశభో
గాదులు ధర్మద్రుఫలము లగుటఁ దడుప నొఁ
గాదే! తత్తరుమూలము
లాదృతధర్మన కలభ్య మని, మహి నున్నే? 301

గీ. అనుడు ఫణిపతి పల్కు నీ వనినయట్ల
ధర్మతత్పర మగుతఁ ద్వత్స్వాంతమెపుడు

సంపదలు నీవు పలికినసరణి ధర్మ
తరుఫలములన్న నుడియు వాస్తవమె కాని. 131

క. మాయింటి కతిథి వగునీ
కీయెడ నరలోకమందు నెట దుర్లభ మౌ
నేయదియొ యిచ్చి యంపుట
న్యాయ మనుచు నెంతుఁ గోరుమా యెదియేనిన్. 132

క. అని ప్రేమైకాయత్తమనం
బున నిర్బంధింప, రాజపుత్త్రుఁడు మా తా
డను మోమోడి గనుంగొని
యెను దత్పుత్త్రికులమోము నిగ్గిచినలజ్జన్. 133

ఉ. అంతఁ దదాశయజ్ఞు లగునాయహిరాజతనూజు లయ్య క
త్యంతవినీతి దోఁప 'సదయా! యదనీయ మభీష్టమున్ బ్రసా
దింతు నటందువా? వినఁగదే! ఖలబుద్ధి విరోధి యామను
ష్యాంతకమాయ నీతనికులాంగనఁ గ్రమందెఁ స్మరించు చీతనిన్

మ. తనకై ప్రాణము లిచ్చి చన్నసతి, గంధర్వాధిభూపుత్త్రి; స
జ్జనసంస్తుత్యచరిత్రి నెంచుచుఁ గృతజ్ఞత్వంబు మించన్ బ్రతి
జ్ఞనుగావించె 'మదాలసన్ దొఱఁగి యాజన్మంబునం దన్యభా
మిని నిల్లాలుగ స్వీకరింప' నని మామిత్త్రుం డితం డత్తఱిన్.

తే. కాన నమ్మదాలసానలినేక్షణఁ
గనఁ దపించు నితనికాంక్షఁ దీర్ప
శక్యమే నొనర్పఁ జను నీకుఁ దండ్రి! య
న్యము సమస్తమును నిరర్థకంబ. 136

క. నా విని యశ్వతరుం డా
భూవరసుతు ననియెఁ బంచభూతవిలీనం
బౌ వపువుఁ గనుట యెటు? మా
యావిలసనమునవో స్వప్నమందో దక్షా. 137

చ. చదివితి వెల్ల వేదములు శాస్త్రము, లారసి తన్నివిద్యలన్
విదిత మొనర్చుకొంటి పృథివిం గలసృష్టిరహోవిశేష మిం
తదనుకఁ జూచితయ్య మరణం బయి పాత్రను వొందు
ప్రాణి? నీ
మదిఁ గలమోహ మీక్రియ భ్రమంబుల ముంచెడిఁగాక
పుత్రకా. 138

క. అని కొంచె మాశ గలుగఁగ
మును పలికి, వెసన్ నిరాశముగఁ బలుకుఫణీం
ద్రుని నుడువుల నృపనందను
మనసు కలఁగ సిగ్గొకింత మలఁగఁగఁ బలుకున్, 139

శా. తండ్రీ! క్రుందినపాంచభౌతికతనూధారుల్ గనన్ రామి నే
వ్వెంద్రున్ జెప్పకె యే నెఱుంగుదు, భవద్వాగ్రీతి నేఁ డాశ దాఁ
దీండ్రించెన్ మది; నీతరం బయిన నింతేన్ మాయచే నైననీ
వేంద్రం బింత శమింపఁ జూపు; మొద నువ్విళ్లూరుదున్ గాం
చఁగా. 140

వ. అనుటయు నశ్వతరుం డిట్లను—

శా. పుత్రా! శంబరమంత్రశక్తి నెటొయంభోజాస్యఁగాన్పింతుఁగా
కాత్రం బొందక డాలనుండి కనఁగానోఁగాని, స్వర్శేచ్ఛ యే

మాత్రిం బూనిన నామె మాయమగు, నామంత్రింబు నిర్వ్యర్థమై
యేత్రాసం బొనఁగూర్చునో యెఱుఁగ లే, మీ పల్కెదర్ దాల్పుమీ. 141

వ. అనుడు ఋతధ్వజుండు భుజగాధిపుఁ గన్గొని "తండ్రి! నీవు చెప్పినటె యొనర్తుఁజూపఁగదవే! యెట్టులేనియు నామదాలసన్ గని యొకతేప, తాప ముడుగన్ దలిదండ్రిల పాదసేవయుం దనయము మున్ని తక్కఁగలయాయువుఁ బుత్తునన్ ఫణీంద్రుఁడున్. 142

గీ. అటులె చూపెద నీరాత్రి యనుచు సుతులఁ
గూడి విహరింపు మని పంచి కువలయాశ్వుఁ
దిన్నగా నమ్మదాలస యున్నయెడకు
నరిగి యాళీపరీత సత్యాలిపఁ గాంచ. 143

—♦ అశ్వతరుఁడు మదాలసను బ్రతిమాకారంబునఁ గూర్చుండఁగోరుట. ♦—

సీ. గ్రిష్మభీష్మాతపమ్ముదితవల్లి రీతి
పసివాళ్లు వాడి వివర్ణ యగుచు
బహుళపక్షక్షీణతుహినాంశు రేఖ నాఁ
గళ దప్పి కృశిమాత్రగాత్రి యగుచుఁ
బాలార్కకిరణసంపర్క నీరుచి తార
పగిది నిర్ధూతలావణ్య యగుచు
మంత్రిబద్ధభుజంగమప్రమదాకృతి
మానాధికోచ్ఛ్వాసమాత్రి యగుచుఁ

గన్నుఁగవమోడ్చి; చెదరియంగకము లచల
భావమునఁ గల్వకాడలై వాడి యుండ,
భర్తృవిరహాకృశాను సంజ్వరవినిహత
యయి మదాలస గోచరమయ్యె శయ్య. 144

సీ. సఖులు గుము తాచు శిశిరోపచార లాల
నానులాపమ్ములం దేర్ప ననువుగామిఁ
గలఁగు టరసి భుజంగపుంగవుఁడు కరప
దంబు కంపింప దరిఁ జేరి తల్లి! యనుచు. 145

క. ఇరుగేలఁ బొదివి యల్లన
నురమున నిడుకొని కుమారి! యొకపఱి కన్నుల్
దెఱచి సను సరయు మని పరి
పరి గతులం బలుకరించి పలుకమి కగడై. 146

వ. స్వేదబిందుబృందసంసిక్త ఫాలతలవికీర్ణచూర్ణకుంతల సంతతి
నఖాంకురంబులఁ జక్క దిద్దుచు, నుత్తరీయాంచలమ్మున వీ
చుచు, సఖీజనంబువలనఁ బ్రాణేశ్వర విరహానలతప్తచిత్తయై
వివశ యగుట నెఱింగి. 147

శా. 'అమ్మా! వచ్చెను నీమనోహరుఁ' డటం చన్నాఁడొ లేదో విశా
ల మ్మౌకన్గవ విచ్చి యశ్రులు కపోలద్వంద్వముఁ గ్రమ్మఁగా
నెమ్మో మెత్తి ఫణీంద్రుమో మరసి 'తండ్రీ! చూపవా నాథుఁ, బ్రా
ణమ్ముల్ నిల్వవు జాల మైన' నని వంతన్ బల్క డగ్గుత్తికన్

క. కొనగోట నశ్రువులు మె
త్తనఁ జిమ్ముచు, నలకలొత్తి, తళుకుం జెక్కుల్
నునుఁజేలఁదుడిచి, యంక
మ్మున నిడుకొని, యశ్వతరుఁడు ముద్దియ కనియెన్. 149

ఉ. తల్లి! ధృతిం దొఱంగి పరితాపమునన్ దనువల్లి వేఁపఁగాఁ
జెల్లునె? సొమ్మసిల్లి గతచేష్టిత వౌ నినుఁ గాంచ గుండియల్
జల్లు మనెన్; గుదుర్కొనుము, చల్లఁగ వల్లభుఁ గంటఁ గాంచి రం
జిల్లుశుభక్షణం బిదిగొ! చేరువ యయ్యె నొకింత తాళుమా.

చ. పతిమృతి విన్నపాటుననె ప్రాణము వాసితి వీవు సాధ్వి, నీ
మృతి విని డిందకున్నఁ దపియించుచు జీవితమెల్ల నీక యం
కిత మొనరించె భర్త, పరికింపఁగ నీదృశ మైనప్రేమ మ
శ్రుతచర మౌటఁ గన్దనియఁ జూడఁ గుతూహలమయ్యెఁ బుత్రికా?. 151

క. ఈరేఁ దప్పక నీపతిఁ
గూరుతు, నొకగడియ సేపు కొమ్మరొ; ప్రతిమా
కారమునఁ గూర్చుచుండం
గోరుదుఁ దమిగొని ప్రియుండు గోచరుఁ డైనన్ 152

చ. అనుటయు నప్పతివ్రత మహాత్మ! మదాత్మవిభుం డనామయం
బున మునుపోలె నుండెనె? వియోగతఁ బ్రాణము వాసి యమ్మహా
త్ముని నెడఁద్రెవ్వనట్టివెత ముంచితి, నాసురబుద్ధినై కటా!
కను టెటులాకృతజ్ఞునిముఖంబు కృతఘ్నత నంచుఁ గొంకెదన్.

క. కాంతాప్రత్యక్షమ్మునఁ
గాంతుఁ డెవఁడు సూపకుండు గాటపుఁ బ్రేమన్
గాంతాపరోక్షమున నా
కాంతుఁడటు తపించుజనుఁడు గలఁడె త్రిజగతిన్. 154

ఆ. 'గరిత లచంచలప్రణయగాఢమనస్కలు గాని యారయన్
పురుషులు చంచలాత్ములు, ప్రభుల్ మఱియున్ జలచిత్తు లెందు' నం
దురె యది తాఱుమాఱుగ మనోహరుఁ డియ్యెడ సర్వభోగముల్
సురుఁగ మదాప్తికై యెదురుచూచున టే, కన నెంత ధన్యనో!

వ. అని యొక్కింత స్వాంతంబునఁ జింతించి యయ్యింతి యి ట్లను.

క. నీ వనినటు ప్రతిమపగిదిఁ
గావలె నని యే యతింతు గట్టిగఁ, గానీ
నావిభు మొగ మగపడ నెటు
దైవము నడుపునొ వచింపఁ దరమే నాకున్. 156

ఉ. ప్రేమరసైకమూర్తి గుణబృందనిదానము మత్సమాగమే
చ్ఛాముదితాంతరంగుఁడు విశాంపతి నాపతి దర్శనంబునన్
నామది కింపు నింపుతరుణంబునఁ గల్గురసానుభూతిలో
నేమెయి నుందునో తెలుపు టెట్టులు? తండ్రి! దురూహ మియ్యెడన్. 157

మ. అనఁ గాకోదరచక్రవర్తియును 'బిడ్డా! శక్య మైనంతలో
మనమం దే ననినట్టిమాట ధరియింపం జూడు' మంచున్ సఖీ

జనముఁ బిల్చి విభూషణాంబరసమంచద్గాత్రిగా నానెలం
తను గైసేయఁగఁ బన్నియోఁగుటయు, నాత్రిం బొప్ప నాబో
టులుఁ. 158

—♦ నాగాంగనలు మదాలస నలంకరించుట ♦—

క. పన్నీట జలక మార్చి, వె
స న్నెఱికురు లలరఁ దుప్పి, జడ యల్లి, జగా
సన్న సరిగంచు చెంగా
వి న్నెఱికలు దేరఁ గట్టఁబెట్టిరి మెఱయన్. 159

గీ. చిలుకప ట్టంచుగుత్తంపు జిలుఁగురైక
దొడిగి, తిలకంబు నొసటఁ గస్తురిని దిద్ది
మినుకుఁగాటుక కనుఱెప్పలను ఘటించి
యంగరాగ మలంది రయ్యంగనకును. 160

చ. మణిమయమండనావళుల మౌక్తికహారములన్ నితంబినీ
మణిఁ గయిసేసి చూచుకొనుమా చెలి! సోయగ మంచు రత్నద
ర్పణమునఁ జూపి 'నీపతి గరంప నెటుల్ గయిసేయనో నా నై
పుణమున నల్లె దిద్దికొను ముద్దియ' యంచు హసించు
నయ్యెడన్. 161

క. వనిత! పునస్సంధాన
మ్మును దైవ మ్మింతకాలమున కొడఁగూర్చెనె మీ,
కని నర్మంబున నొకచెలి
యన నందఱుఁ గెరలి నవ్వి 'రానా' ననుచున్. 162

గీ. ఇటుల రాతిరి యగుదాఁక నింతిఁ జుట్టు
వాఱి పరిహాసవచనశృంగార మొలుక
ఫణిపురంధ్రులు కాలయాపన మొనర్చు
చుండి; రహరావసాన మెయ్యెయ్య నయ్యె. 163

వ. అయ్యెడ నయ్యురగేంద్రుసభామంటపమున.

—♦ మాంత్రికవేషముతాల్చి యశ్వతరుఁడు మదాలసను
కువలయాశ్వునకుఁ జూపుట. ♦—

సీ. స్వర్ణకుట్టిమ కుడ్యజాలముల్ దుడిచి యా
శీరశోధనులఁ; బన్నీరు చిలికి
రత్నదీపములఁ బరాగశూన్యముగఁ గో
మలదుకూలాంచలంబులను దులిపి
హాటక మణి మహార్హాసన శ్రేణుల
మర్యాద కనువగుమాడ్కి నిలిపి
పాద్యపానార్ఘ మంభఃపూర్ణసౌవర్ణ
కుంభముల్ పరిపాటిఁ గుదురుకొలిపి
మరకతస్తంభపంక్తికి మెఱుఁగు దిద్ది
తెలివలిపచేల నడుమఁ బెద్దెర ఘటించి
నిలిచియుండిరి చంకఁ జేతుల ధరించి
యెపుడు పిలుచునో ప్రభు వం చహీంద్రభటులు. 164

క. వరుస నొకరొకరుగ నుర
స్సరవరు లరుదెంచి, భృత్యసందర్శితవి
ష్టరములఁ గూర్చుండిరి యె

గీ. దండశూకేంద్రసుతులు కైదండ యొసఁగు
చాభరణవస్త్రమాల్యగంధాభిరాముఁ
గువలయాశ్వుని దోడ్కొని కొలువు సేరి
సింహపీఠంబులను సమాసీను లైరి. 166

వ. అనంతరంబ భేరీమృదంగశంఖకాహళాదివాద్యరవంబులు నిబి
డంబు గాఁగ.

సీ. తోరంపుగంగసిందూరమ్ముపంకానఁ
దిలకమ్ము పెద్దగాఁ దిద్ది నుదుటఁ
గలయంగ మెదిచినకలికికాటుక కంటి
కొలుకులు దాఁట ఱెప్పలను దీర్చి
యంతరీయోత్తరీయములుగాఁ బసుపు మిం
చినకావికుప్పసంబును ధరించి
బర్హిపింఛమ్ము డాపలి కేల, వల కేలఁ
దళుకొత్తు నాగబెత్తమును బూని
'యంబ! పలుకవె! యోజగదంబ! పలుకు'
మనుచు నాడంబరముగ వాకొనుచు నపుడు
యవనికకు ముందు ప్రత్యక్షమయ్యె మాంత్రి
కాకృతి భయంకరముగ నయ్యశ్వతరుఁడు. 168

ఉ. మాయలమంత్రముల్ భుజగమండలనాయకుఁ డుచ్చరించు, చం
బా! యరుదెమ్ము! చూపు మహిమం బని పింఛము ద్రిప్పు
చుణ్, గనుల్

మఱాయుచు విచ్చుచుఁ దెరకు ముందర నిల్చి 'పరాకు లేక యుం
డే?!' యని యట్టహాసమున హెచ్చరికఁ బచరించిచెచ్చెరఁ

క. నరవర! కనుఁగొనుమా యని
తెర యించుక యెత్తి, మరలఁ దివిచి, భవత్సం
దరి యగునో కాదో లెస్సఁగ
నరయుమ యని యొత్తగించె యవనిక యల్లన్. 170

ఆ. ఒత్తగించి యాపయోజాస్య నీమదా
లసయ యగునొకో యిలాకళత్రి!
యనుచుఁ బలుక దిగ్భ్రమాక్రాంతమానసుం
డశ్రుపూర్ణనయనుఁ డయ్యె నతఁడు. 171

వ. మఱియు.

సీ. సుమమంజరులమంజిమము లెల్లఁ జెలువఁగా
మీనకేతనుఁడు నిర్మించినట్లు
పల్లవంబులమార్దవములు చైత్రుండు గ
డించి భామినిగ సృష్టించినట్లు
పదియాఱుకళలశోభయు నేర్చి రమణిగా
శీతాంశుఁ డెలమి సృజించినట్లు
మలయానిలుఁడు సౌకుమార్యసర్వస్వమ్ము
నించి కాంతగ విరచించినట్లు
లలితసకలాంగలావణ్యకలితమూర్తి
మెఱయఁ, జూపులు వెన్నెలఁ జఱచి కాయ

మేలిరుచులఁ దటిల్లతల్ మెఱవ, నమ్మ
దాలస తళుక్కు మని యగ్రమంద మెఱయ. 172

ఉ. తా నెట నున్నవాఁడొ? యిరుతట్టునఁ గాని పిఱిందిఁగాని ముం
దే నెవ రున్నవారొ? తను నెంచి యెటాడుచునుండిరో వినం
గాన, నెఱుంగఁ జాలక ముఖంబఖిలంబును గన్నుగాఁగ నా
చాన సతృష్ణచిత్తుఁ డయి సాంద్రతరప్రణయంబునన్ గనెన్

—• మదాలసంగాంచి కువలయాశ్వుఁడు తహతహపడుట •—

క. కని హా ప్రియా! యనుచు రి
వ్వునఁ బీఠమునుండి లేవఁబో నెంచ ఫణీం
ద్రునిసుతు లిరువురు 'మిత్రమ
జనకునివచనంబు మఱువఁ జను నే' యనుచున్. 174

శా. పాణిద్వంద్వముఁ బట్టి యాసనమునన్ బల్మిన్ సమాసీనుఁగా
క్షోణీంద్రాత్మజుఁ జేయ గాసివడు, టక్షుల్ విచ్చి తెప్పార్ప క
య్యేణీలోచన చూచుచున్ గరపదం బిట్టట్టు కంపింప 'హా
ప్రాణేశా! యనఁ బోయి క్రేటుకొని దీర్ఘశ్వాసమున్ బుచ్చె
చోన్. 175

క. మంత్రించినట్లు ఫణిపతి
యంత్రించిన మాట మాని యబల యధృతిమై
జంత్రంపుబొమ్మగతిఁ బర
తంత్రయగుటఁ జెమటఁ దనువు దడియ వడంకున్. 176

చ. అది గని 'నన్నుఁ బాయఁ దగవా? మగువా !' యని యా నృపాలుఁ డు
మ్మదద మెదఁ గ్రమ్మ నప్పుడ కుమారులఁ జిమ్మి తటాన లేచి యు
న్మదవతి డాయ నేఁగ 'నిది మాయ సుమీ! చెయిసోఁక మాయ మా
నోదవు దోసంగు' లంచు భుజగోత్తముఁ డాఁపగ, ని ట్లనుఁ వెతన్. 177

క. పిమ్మట మాయం బైనం
బిమ్మటిఁ గొన; నొక్కమాఱ పేరియసిఁ బరిరం
భ మ్మొనరిచి, తత్పదనిక
టమ్మున మరణమ్ము నొందుటకు సెల విమ్మా? 178

వ. అని విలపించుచుఁ, దనవంకఁ గాంచుచు ననురాగజనితబాష్ప పూర్ణవిలోచనయుఁ, గంపమానసుకుమారాంగలతికయు, నారంజితకపోలయుగళయు, వేల్లద్దశనచ్ఛదయు నగుపాణిగ్రహణి వంక గుండియలు దిగ్గురన నవలోకించి. 179

ఉ. మాయ యటందు వేమి? యదె! మామకభాగ్యఫలైకరూప మా
చాయ వెలుంగఁగాఁ? దనువిసర్జనకాలమునాఁటిమూర్తితో
నాయమృతంపుబావి నయనంబులకుఁ గనిపింపఁ; జేరఁగా
నీయక త్రోయఁ దండ్రి! తగునే? పగనే? వగ నేఁచనీగతిన్

క. పోనీవా? నీవాఁడం
గానా? నాప్రాణనాయికను గలియం

గానీవా? చెలి మాయము
గానీ యొకమాఱు సోఁకఁగానే నీవా?    181

క. అంచు శిలలుం గరఁగ వా
కొంచు విలాపించు చురగ కులపతిమోప్రిలఁ
వంచినతల యెత్తకె శపి
యుంచినయటు గూలె నిల నపేతస్మృతియై.    182

—♦ మదాలస మూర్ఛిలినపతిని సమీపించి విలపించుట ♦—

గీ. 'అకట! నే నెంతకఠినుఁడ నైతి' ననుచు
నశ్వతరుఁ డాకుమారు రయంబు మీఱ
లేవ నెత్తి యురస్తటి మోవఁ బూన్చు
తఱి మదాలస బిఱబిఱ నరుగుదెంచి.    183

ఉ. 'హా ప్రియ' యంచుఁ బై నొఱఁగి హస్తమునన్ బతిమేను రాయుచున్
గ్రప్రమటుల్ హరించినదె గాత్రము సారమువోయి శుష్కమై
యప్రతిమానమద్విరహయాతన; నెంతటి పాపజాతినో
విప్రతిపత్తిఁ బూని యిటు వేఁచితిఁ; బాచిత మున్నె నాకిఁకన్

వ. అనుచు నయ్యశ్వతరునియంకమ్మున నుండినజీవితేశ్వరు సంఛిటం బొదివి నిజాంకపాళికి రాఁ దివిచికొనుచు శోకభారంబున వివేకంబున కొంకింత దూరంబై యి ట్లను.    185

క. అమితార్తిఁ బడి దపమపా
రముగ సలిపి శంభుదయ వరం బొంది దయన్

మము బ్రిదికించియు నిటు శో
కమునఁ గలఁప నీకుఁ గ్రీడగాఁ దోఁచినదే? 186

సీ. గంధర్వసమ్రాట్ప్రకాండుఁ డౌ విశ్వావ
సునకు దనూజయై జనన మొంది
యవులఁ బుణ్యశ్లోకుఁ డగుశతృజిన్మహా
క్షోణీంద్రునకు ముద్దుఁగోడల నయి
శౌర్యధైర్యాతిగాంభీర్యాది గుణరాశి
యగునిమహాత్ము నర్ధాంగి నగుచుఁ
బరమపాతివ్రత్యపరమావధియ మదాలస
యనుసజ్జనస్తుతులను గడించి
విధివశంబునఁ దొలిమేను విడిచినను బ
విత్రచారిత్రునకు నీకుఁ బుత్రి నయ్యుఁ
గాంతుఁ గనులారఁ గాంచియుఁ గలసి మెలఁగు
భాగ్యమును గాంచనట్టినిర్భాగ్య నైతి. 187

క. మరణించిననాకై పతి
దురటిల్లుటఁ గంటి, తద్వియోగురనై వెత నే
నొరలఁ గనఁ గోరితేమో
హరహర! సుత వగవఁ దండ్రి కానంద మెటుల్. 188

—♦ అశ్వతరుని పశ్చాత్తాపము ♦—

క. అనుటయు ఫణిపతి యనియెఁ
దనయా! నను నెంత దూఱినను దూఱఁగ నౌ
ననితర మగుమీపేర్మము
కననెంతును గాని యిట్లు కావుట యెంచన్. 189

మ. అని యాపాదశిరోంత మంగము సమీరాఘాత వేల్లద్ద్రుమం
బనఁ గంపింపఁగ నొచ్చుకొంచు మది, దాసానీకముం బంచి, చం
దనసీహారజలాదిశీతలపదార్థశ్రేణిఁ దెప్పించి తా
నునుబుత్రుల్ పరిచర్యసల్ప నృపసూనుం దేర్చె నత్యార్తిమై

— మదాలసా కువలయాశ్వు లొండొరులం గలియుట —

సీ. తనమోము వంకఁ గన్గొను చెలిమోముఁ ద
మ్మినె చూచెఁ దొలుదొల్తఁ గనులు విచ్చి
తనశిరంబు ప్రియాంకముననుండి యువ్వెత్తు
గా నెత్తి పుచ్చె దీర్ఘముగ నూర్పు
తనకరాబ్జమ్ము కాంతాకరంబులనుండి
దివిచి తద్గళము నుద్దవిడిఁ జుట్టె
దనపల్కు వినఁగ సోత్కంఠ యా కలకంఠిఁ
గని 'ప్రియా! బ్రదికితే' యనుచుఁ బనవె
నెదుట నివ్వెఱ నరయు నహీంద్రుఁ గాంచి
మ్రొక్కె 'క్షమియింపు తప్పిదమ్ముల' నటంచుఁ
గౌఁగిలించె సుహృద్భుజంగమతనూజ
యుగము నారాసుతుఁడు మూర్ఛనుండి తేఱి. 191

గీ. అహిజగంబునవా రెల్ల రరయుచుండఁ
గాంతుఁ గౌఁగిటఁ గూర్చి యంకమునఁ జేర్చి
నపుడు తొలఁగినలజ్జ స్వాస్థ్యమునఁ బ్రియుఁడు
మోము గనునంత నయ్యింతి ముంచి వైచె. 192

ఉ. సిగ్గున మోము వంచి పతిచెంగట నుండిన యమ్మదాలసన్
బిగ్గఁ గవుంగిలించి ఫణభృత్పతిదేవి యలంత దీర్చి స

మ్యగ్గతి నాబుతధ్వజుసమంబుగ నిల్పి నివాళులిచ్చి పే
రగ్గలికన్ మహాభ్యుదయ మందుఁ డటంచు నొనర్చె దీవనల్

వ. అనంతరంబ యందఱు నాసభామధ్యంబునం దందందుఁ గూరు
చుండ నయ్యశ్వతరుం డక్కువలయాశ్వున కభిముఖుండై
నా తనయులవలన మదాలసాతనూత్యాగ, భవదీయభోగా
నుభవవిరాగములాలించి, శారదాదేవి నుపాసించి, తదీయ
కారుణ్యంబున సోదర ద్వితీయుండనై, పరిపూర్ణగానవిద్యా
మహిమం బుపార్జించి, దానిచే మహాదేవు మృత్యుంజయు
సేవించి, తదీయవరప్రభావంబునఁ బితృదేవతాకరుణను జాతి
స్మరగా మదాలసను బుత్రికగాఁ గాంచితినని యావద్వృత్తాం
తంబు దెలుపుటయు విని పరమాద్భుతరసాక్రాంతనిజస్వాం
తుండై కువలయాశ్వుండు పన్నగేందునకు సాష్టాంగంబుగా
మ్రొక్కి యి ట్లను :— 194

ఉ. నా కయి ప్రాణ మిచ్చులలనామణిపట్లఁ గృతజ్ఞతన్ సుఖ
స్వీకృతి దక్కియుంట యొక పెద్దయె? మ్రిందినవారి తోంటి యా
యాకృతితోడఁ దెచ్చిన మహాత్ములఁ గందుమె నిన్నుఁ దక్క? నే
లోకములోఁ ద్రికాలములలో కననౌనొకొ యిట్టిచోద్యముల్. 195

వ. అనుటయు మదాలస యి ట్లను.

చ, పతులు మృతిన్ గనన్ బరమపావనశీలలు సాధ్వులెంద అం
చితగతిఁ బ్రాణముల్ దొఱఁగి చేరరు నాథుల? నట్లె నేను నా

పతికయి ప్రాణ మిచ్చు టొకపాటిద యా, నటు బూది యైనమే
నతికరినార్తి కోర్చి పడయం గలవా రెవ రీవు దక్కఁగన్?

వ. అనుటయు నశ్వతరుం డి ట్లను.

ఉ. పాయక నన్నుఁబోలెఁ గొలువన్ శివుఁ డీయఁడె నిన్ను వీనిక
ష్టా! యిది దొడ్డ? డిందెఁ బ్రియుఁడంచును వించునెమ్మంది తీవు నీ
తోయము కాంత యున్న? సతిశ్రో గతియింపన నెంచి, తండ్రికై
కాయము వాయ కైహికసుఖంబుల వీడె నితండు బాపురే!

క. మిముఁ బోలుదంపతులు లో
కమునఁ దిరికాలములఁ గనము; గార్హస్థ్యము పే
రిమ మయాఽద్వైత మని చరి
త్రిమున ధ్రువంపఱచినట్టిధన్యులు మీరల్. 198

వ. అనిన నురగరాజకుమారులు రాజకుమారునకు ని ట్లనిరి.

చ. త్రికరణశుద్ధి మమ్ముల సుహృద్వరు లంచును నమ్మి, గుట్టొకిం
చుకయును లేక యెందు, మనసున్ లవమేనియు నొవ్వనీక, యె
ల్లకళల దిద్దుచున్ సుఖములన్ దనియించెడుమిత్రు ని న్నమా
యికుఁ గపటప్రవర్తనమెయిన్ గలఁగింతు మయో! క్షమిం పుమా. 199

సీ. ఉరగవంశజుల మయ్యును విప్రనందనా
కృతుల నీసౌహార్ద మెనయు టొకటి
తాళకేతుని మేము తూలించియు హయాహ
తునిగఁ గల్లల నాడఁ దొడరు టొకటి

మైత్రినే యగుఁగాక మాయచేసియ నిన్ను, ని
చ్చిల్వజగతికిఁ దెచ్చు టొకటి
తండ్రి పన్నాగ మంతయో యింతయో యెఱిం
గియుఁ గిమ్మనక నిరీక్షించు టొకటి
యిన్ని యపరాధములు చేసియున్న; మైత్రి
నాత్మ ధరియింప నట్టియుదారమతివి
యగుటచేఁ గాని క్షమియింప నైనపనులె?
తలఁపుమా మమ్ము నీ సహోదరుల మంచు. 200

వ. అని తమకపటనటనంబునకు క్షమాపణంబు గోరుకొని మ
ఱియు ని ట్లనిరి.

క. భోగత్యాగమ్మున నీ,
వీగరిత తనూవియుక్తి, నిరువుర నిటు సం
యోగము సేఁతం జనకుఁడు,
మాగురు నయినారు నిరుపములు నిఖిలమునన్. 201

వ. అనిన నయ్యహిరాజసుతుల నుద్దేశించి సభ్యు లిట్లనిరి.

ఉ. మీరలు తండ్రి కన్నొఱఁగి మేదినికిన్ జని యీనృపాలుమై
త్రీరస మాస్వదించి యెఱుదేరక యుండిన వీరు మావు రే
కా, రిట నున్న మేమును సుఖప్రచురాద్భుతసాగరోర్మికో
దారవిహార మొందఁ గలమా? సుదినాహము నేఁడుచూడఁ
గన్. 202

మ. అని యి ట్లందఱుఁ జారితార్థ్యమున బ్రహ్మానందముం జెం
ది మె
చ్చ్చ నేడన్ దారసమేతుఁడై కువలయాశ్వుం డల్లనన్ గుండలీ

శునకుఁ డొక్కఁ డున్నఁ బ్రముఖాంబుజదివ్యకులంబున్ దల్లిదండ్రి యం
చును, నీరాకకు వారెల ర్చెదరటంచును గోరసోత్కంఠులై

వ. అశ్వతరుండు దానును భూలోకంబున కాత్మజులతో నేఁ తెంచుట కంగీకరించి.

సీ. అనుపమ శిల్పచీనాంబర నికురుంబ
మాసంజితమణికూర్పాసరాశి
మాణిక్యకాంచనమయమండన శ్రేణి
మణికలశాదికామత్రవితతి
బహుళసువర్ణఖట్వాహంసతూలికా
తల్పకౌశేయోపధానచయము
కలితచిత్రితదంతోపలదర్పణగణంబుఁ
గరిదంతకంకతికాశతంబు
రత్నఖచితకుంకుమ హారిద్రకరండ
తతి యమరఁ గూర్చి జీవరత్నములు మౌక్తి
కములు దోసిళ్లఁ గొలఁది హస్తములఁ బోసి
యమ్మదాలస కిడె సారె యశ్వతరుఁడు. 204

ఉ. అత్తఱిఁ గత్తలాని మది యందుఁ దలంచు తెఱంగునఁ గభూ
భృత్తనయాగ్రభూమి దివిజేంద్రధనూరుచిరాంగకాంతిసం
పత్తిని దోఁచె నశ్వము; సుపర్ణుఁ డపర్ణకుఁ డౌచు వచ్చె నం
చెత్తినభీతి సర్పజగ మెల్లను దత్తఱ మెత్తి పాఱఁగన్. 205

క. అపుడు భుజగేంద్రుపత్ని మదాలసనొ
సంటఁ గుంకుమబొట్టిడి చక్కఁ దోయి

చలకలను 'దల్లి! తలఁతె మమ్ముల నటంచుఁ
బలుకరించి దీవించె సంపదల మించ. 206

చ. ప్రమదను జేటికల్ పసిఁడిపల్లకిలోపలఁ గూరుచుండఁ బె
ట్టి ముదము మీఱఁ గన్గొనఁగ; డెందమునన్ వెత మాటి యున్ భుజం
గమపతిదేవి యాజ్ఞ యిడెఁ గన్నులు చెమ్మగిలంగ; నేమిచి
త్రమొ! సుత నంపునత్తఱిఁ గరంగనితల్లియుఁ దండ్రియుందురే?

సీ. కేలుదోయి నొసంటఁ గీలుకొల్పె మదాల
సా దేవి పెద్ద లౌ సర్పపతుల,
కనుఁగుఁగత్తెలు కాన్కలను గొని తమి మీఱఁ
బ్రియము సెప్పుచు వెనువెనుక కరిగి
రిరువంక వచ్చుచుండిరి ఫణీశ్వరునాత్మ
జాతు లిర్వురుఁ బాదచారు లగుచుఁ
గువలయాశ్వారోహకుం డయి యరుగఁ జొ
చ్చెను ఋతధ్వజుఁ డగ్రమునను తీవి
సపరివారుం డగుచు ఫణిచక్రవర్తి
యందల మ్మెక్కి వెంబడి నరుగుదేర
మహీభుజిష్యులు చతురంతయానధారు
లగుచుఁ బయనింపఁ జొచ్చి రయ్యవసరమున. 208

వ. ఇట్లు భోగవతీపురసీమంబుదాఁక వచ్చి పురంబునవా రెల్ల మరలి నిజనివాసంబుల కరుగుటయు, భోగిరాజన్య, తత్పుత్రి, నిజకళత్రియుతుండై, మహావైభవంబుతోఁ గువలయాశ్వుండు క్రమంబుగ గౌతమీతరంగిణీ పరివాహాంతర్భిల

ద్వారంబునఁ గువలయంబునకు వచ్చి యప్పుణ్యనదియందు నశ్వతరానుమతి ధర్మపత్నిసమేతంబు స్నానం బాచరించి గంధపుష్పకుంకుమఫలాదులఁ బూజించి యందఱు విన ని ట్లని యన్నదిని స్తుతించె. 209

శా. అమ్మా! శాంకరజూటజూటలలితోద్యానద్యుశాఖప్రవా
శమ్మా! స్వర్వసుధారసాతలగళాస్థానతిప్రధాభూతమా
ల్యమ్మా! గౌతమమహాని శేఖరతపోనంతప్రభావప్రవా
హమ్మా! ప్రోవు తలంచి మమ్ముఁ ద్వపత్య మ్మొంచు
గోదావరీ. 210

శా. ఉత్సంగంబున ముజ్జగంబు నిడుకొం చుద్యత్తరంగావళిన్
వాత్సల్యంబునఁ దాఁకుచున్ లలితగానస్ఫూర్తి జోకొట్టు
చున్
క్షుత్సంశాంతిగ మాధురీచణపయస్సున్ గ్రోల్చుచున్
సౌఖ్యసం
పత్సంపన్న మొనర్చి ప్రోతువు జగన్మాతా! మహాగౌతమీ!

చ. మధుమధురాంబుపూరగరిమంబున సర్వమహీజసస్యసే
వధిగ వసుంధరన్ మనిచి, ప్రాణుల కెల్లను క్షుత్పిపాస లే
విధి నొదవంగ నీక, కని పెంచెదు చల్లనితల్లి! జన్మకో
ట్యధిగతపాపతూలనిచయాగ్ని శిఖాయిత!మాత!గౌతమీ!

గీ. అనుచు నగ్గౌతమీగంగ నమితభక్తిఁ
గొలిచి ఫణినేతయును గొడుకులు మదాల
సయును దనతోడ రా నిజాశ్వమ్ము నెక్కి
తనపురము చేరుకొనియె బుతధ్వజుండు. 213

శా. చేరన్ రాఁ బురివార లానృపసుతున్ సీమంతినీహార్మ్యాలం
కారం బైనమదాలసన్ విపులభోగస్ఫూర్తి మదోద్భగిరా
ద్వీరానీకముఁ దత్సమర్పిత మణీవిత్తోల్లస చ్ఛృంగ్యాలం
కారాపూర్ణసుదాయధూర్వహభుజంగవ్రాతమున్ జూచుచున్

వ. అత్యాశ్చర్యనిమగ్నులై యయ్యారే! యంచు యెంతయు మెచ్చిరి.

సీ. తరుణిరో! మన ఋతధ్వజయువరా జెక్క
నట్టియక్కువలం బదిగో కంటె
యతని దేవేరి మదాలసవలె నంద
లమున నున్నది యేక్రమమున బ్రిదికె!
చానరో! కడ లేనిసారెకావళ్లసం
దడి గంటె యీపదార్థములు వింత
లజ్జాక్షి! యవ్వాహనాధిష్ఠితవినూత్న
పురుషు లెవ్వరె తొల్లి యరసియుండ
మక్కరో! చుక్కలందుఁ బూర్ణామృతాంశుఁ
డట్లు యువరాజు చూచితే యెట్లు మెఱసి
పోవుచున్నాఁడో యనుచు నప్పురపురంధ్రు
లాడుకొనఁ జొచ్చి రపుడు సౌధాళిఁ నిలిచి. 215

వ. ఆవార్త విని సామంతపురోహితమంత్రి దండనాథ, సేనానీ సహితుండై శత్రుజిద్భూపాలుండు బిఱబిఱ కక్ష్యాంతరంబులం దాఁటి మొగసాల కెదురుగా వచ్చి. 216

సీ. కువలయాశ్వారోహకుం డయి హృష్టుఁడై
వచ్చుచుండెడు ఋతధ్వజకుమారు
వెనుక మదాలసాంగనఁ బైఁడిపల్లకి
మెఱయించు మెఱుఁగు నెమ్మేనిదానిఁ
బల్లకి కిరుగేలఁ బసిఁడిబెత్తము లూని
యరుదెంచు నాగేంద్రునాత్మజులను
నద్భుతామూల్యపదార్థముల్ వహియించి
వచ్చెడి సారెకావళ్లవారి
వెనుక రత్నమయాందోళికను బరిజన
పటల సంసేవ్యమానుఁడై వచ్చునశ్వ
తరుని భుజగేంద్రు నరసి యాదరము మీఱఁ
మన్నన యొనర్చె శత్రుజిన్మహివిభుండు. 217

వ. అంతఁ గువలయాశ్వంబుడిగ్గి, ఋతధ్వజుండు జనకునిచరణార విందములకు వందనంబాచరించి, నాగేంద్రుని, నాగకుమారులను, మదాలసను వరుసగా నెఱింగించి యందఱంగూడి యాస్థానమంటపంబు సేరి మదాలస నంతిపురంబున కనిపి వ్యాళమండలేంద్రుఁ దత్పుత్రుల నర్హాసనంబుల సమాసీనులం జేసి తత్పరివారంబు యథార్హస్థానంబుల విడియించి, యావజ్జనంబులకు నాతిథ్యంబు సమకూర్చి తనివి సేదదేఱిన యనంతరంబు విందుకొలువు తీర్చి యుండు నెడ. 218

ఉ. హెచ్చినవేడ్కఁ బౌరజను లెల్లరుమూఁగి మనంబులందుఁబే
రచ్చెరు వొంది 'యాయమ మదాలసయే! . యెటు లొంటి
మేనితో

వచ్చెఁ? బరాసువయ్యెనని వందురుచుఁ దహనంబొనర్పఁగా
నచ్చగఁ గాంచమే? యని రహస్యముగా ననుకొంచు
నున్నెడన్. 219

ఆ. శత్రుజిన్మహీశశత్రుండు సుతుఁ గాంచి
వీర లెవరొ తెలిపి వేఱువేఱ
నాయదృష్టఫల మనందగు కోడ లీ
సాధ్వి యెట్లు బ్రదుకఁ జాలెఁ జెపుమ. 220

చ. అని జనకుండు పంచుటయు నాన్నృపపుత్రుఁడు తత్సభాసదుల్
వినఁగ ఫణీంద్రనందనులవృత్తము తొల్త వచించి వారికిన్
దనకుఁ గలట్టిస్నేహకథంబున నశ్వతరుం డుదారమా
మనమునఁ జేసినట్టియుసమం బగుమేలు వచించె నీక్రియన్.

శా. కన్నారా ప్రజలార! యీదృశు, మహాకారుణ్యవారాశి న
చ్ఛిన్నైశ్వర్యుఁ, బరోపకారకృతిలక్ష్మీభూతచారిత్రు, వా
ణీ న్నాగాభరణున్ దపోబలమునన్ మెప్పించి పీతాసువున్
ము న్నున్నట్లుగఁ దెచ్చి యిచ్చినమహాత్మున్ మూఁడులోకం
బులన్? 222

ఉ. శారద సంభజించి, నగజాపతి గానకళన్ గరంచి, స్వా
గారము చేరి, తత్పితృనికాయము గొల్చి,మదాలసన్ సుతా
కారగఁ గాంచి, నాకొసఁగి, గాని, కనుంగవమూయనట్టి
యీ
కారుణికాత్ముఁ బోలినయకారణబంధు వెవండు నా కిఁకన్?

మ. జనకా! యీమహనీయుఁ డశ్వతరసంజ్ఞాకోరగేంద్రుఁడు;నం
దనవక్త్రంబున నాయవస్థ విని సంతాపించి, నాకాంతఁ దె,

చ్చినలోకోత్తరసత్త్వుఁ డూర్జితదయాసింధుండు, జామాతగా
నను మన్నించినవాఁడు, వియ్యమున ని న్మన్నింపఁ వచ్చెన్
జుమీ. 224

వ. అనుటయు సభాసదులయందఱచూపు లొక్కమ్మడి నయ్య
హిరాజచూడామణిపై వ్రాలుటయు నాతండు నిజాసనోత్థి
తుండై యావద్వృత్తాంతంబును వివరించి మదాలసాజన
కత్వంబునఁ దమబంధుత్వంబు మెఱయించి మదాలసాకువల
యాశ్వులం బ్రేమనిర్భరం బగువాక్కుల 'సమానులం దుత్త
మశ్లోకు లగుదురుగాక' యని యాశీర్వదించి, గంధర్వరా
ట్సుతకతంబునఁ ద్రిలోకంబులకుం గల్గిన సంబంధబాంధవ్య
మ్ము లుగ్గడించుటయు నయ్యాస్థానం బెల్ల క్షణకాల మాశ్చ
ర్యచకితం బయ్యె ననంతరంబ. 225

ఉ. శాంతికపౌష్టికక్రియల శామ్యదరిష్టులఁ జేసి, పుత్త్రుఁ ద
త్కాంతను దీవనల్ సలిపి, తత్క్షణమే మహిరాజ్యభారసం
క్రాంతులఁ జేసి వార్ధకభరంబునఁ గ్రుస్సినశత్రుజిన్మహీ
కాంతుఁడు భార్యతోడఁ గడఁకం జనెఁ గానలకున్ దపో
ర్థమై. 226

గీ. దండశూకేంద్రుఁడును మహానందమొనసి
నందనులఁ గూడి నిజభవనమున కరిగె
నమ్మదాలస కొయ్యఁ బ్రియంబు సెప్పి
కువలయాశ్వునియనుమతిఁ గూడఁ బడసి. 227

వ. అట్లుకరిమకరిమంబుగ బంధువులందఱుఁ దత్తద్వాసంబులకు
సముదితులై యేఁగుటయు, కువలయాశ్వుం డను నామంబున

విశ్రుతి కెక్కె యాఋతధ్వజుండు మదాలసాద్వితీయుండై
సుఖంబులనెల్లఁ జూఱఁగొనుచు.

సీ. అరి యప్పనమ్ముల నర్పించు చఖలరా
 జన్యులు సామంతసమితి గాఁగ
వైరిచోరార్తినివర్తనంబునఁ బ్రజా
 తతిఁ దండ్రిపగిది సంతత మరయుచు
హవ్యతర్పితదైవతాళివృష్టసకాల
 వృష్టిఁ బంటలనెల్లఁ బృథివి పిదుక
ధర్మంబు నాల్గుపాదములఁ బ్రవర్తింప
 నోము చేమఱక బ్రహ్మోత్తరముగఁ
బితృఋణము దీఱఁ బుత్రసంతతులఁ బడసి
యాధరాతలేంద్రుండు మదాలసాస
మేతుఁడై సింహపీఠంబు నెక్కి పెద్ద
తడవు పాలించె నిల శుభోదర్కముగను. 228

చ. "అమృతముకంటెఁ దియ్యనయి యాగమధర్మనిధానమై త్రికా
లముల గృహస్థకోటి కమలం బగుదర్పణమై మదాలసావిలా
సము జగతీత్రయంబునఁ బ్రశంసఁ ధనర్చుత" మంచుఁ బుష్పవ
ర్షము గురియించి పల్కిరి సురల్ దివినుండి ప్రమోదపూర్ణులై

వ. అనిమఱియు:—

సీ. పరమపాతివ్రత్యపరత కాకర, మేక
 పత్నీవ్రతప్రభావమున కొజ్జ

పితృభక్తికల్పకవ్రతతికి నందనం
బనఘమైత్రీలత కాలవాల
మభవకారుణ్యమహత్త్వమ్మునకు నిధి
ముకురమ్ము వాణీపరిభూతకృపకు
త్రిజగతీబాంధవ్యసృష్టికి దృష్టాంత
మాత్మవిద్యాప్తి కధ్యాపకంబు
చారుసింహాసనము ధర్మవీరమునకు
నర్థకామమ్ములకు విహారాంగణంబు
సజ్జనప్రార్థ్యము మదాలసావిలాస
మఖిలదురితక్షయంబు పుణ్యప్రదంబు. 230

క. మంగళములు సంధించు న
భంగురవిజ్ఞాన మొసఁగి పరమార్థము దె
ల్పుం గడలేనిభవవ్యథ
లం గెడపు మదాలసావిలాసము వినినన్. 231

గీ. అని జడుం డను పేరిమహావివేక
ఖని తనకుఁ దండ్రి యైనభార్గవసమాఖ్య
విప్రునకుఁ జెప్పె సంమదావిష్టుఁ డగుచు
సకలజగదుద్ధరణధీవిశాలవృత్తి. 232

ఆశ్వాసాంతము.

శా. శ్రీద్ధాభక్తిపురస్సరానవరతార్చాప్రీణితాహస్కరుం,
డిద్ధాత్మీయమహామహోముషితదుర్వృద్గర్వసర్వస్వుఁ, డా
బద్ధశ్రీయుతరంగమాసుగుణసంపన్మానసుం, డాజను
స్సిద్ధోదారరమాక్షమామితకృపాజేగీయమానుం డిలన్.

క. ప్రత్నాచారాభిరతుఁడు
నూత్నయశశ్శ్రీవధూమనోహరుఁడుఁ జతూ
రత్నాకరోపమాత్మజ
రత్నచతుష్కోల్లసత్సిరంగుకులుండున్.

మత్తకోకిల.

విత్తనాథహసన్మహార్థుఁడు వీరసూమణిరంగమా
చిత్తశాంతికృతిప్రవీణవిశిష్టధర్మధురీణుఁడున్
సత్తిరాజజమీనుదారు, ప్రజాస్థిరోపకృతిక్షమా
నుత్తమామితకార్యకర్త శుభోదయుం డయి శోభిలున్.

గ. ఇది శ్రీగురుకరుణాసమాసాదితకవిత్వ 'కవితాభూషణ'
'విద్వత్కవిశేఖర' వెంపరాల సూర్యనారాయణ నామ

ధేయ ప్రణీతం బైన మదాలసావిలాసంబున

తృతీయాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

---

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 20 | త్రైశ్వరుఁడయి | త్రైశ్వర్యుఁడయి |
| 2 | 11 | వాంచిత | వాంఛిత |
| ,, | 16 | నుషనిషల్లనల | నుపనిషల్లలనల |
| 3 | 3 | ముపాసవం | సముపాసనం |
| 4 | 12 | ప్రమర్థ | పుమర్థ |
| 26 | 6 | ద్రవ్యంబొసంగి | ద్రవ్యమొసంగి |
| 42 | 2 | రచితం | రచింపం |
| 47 | 6 | భ్రమించుచుఁ | భ్రమించుచోఁ |
| 55 | 4 | రాగములు | పరాగములు |
| 64 | 6 | యజ్ఞయ | యజ్ఞియ |
| 68 | 12 | హార్య | హార్మ్య |
| 85 | 16 | కుమారుదృష్టికిఁ | కుమారమాలికిఁ |
| 107 | 14 | మీానంటి | మీావంటి |
| 140 | 10 | త్వమునఁ | త్మమునఁ |
| 144 | 13 | నీవవి | నీవది |
| 147 | 6 | రారాజ్య | రారాజ |
| 157 | 16 | చెపుల్ | చెవుల్ |
| 164 | 19 | మటులఁ | మటుల్ |
| 196 | 13 | త్రోపల | వోపల |